10 TD122

The Largest Circulated Telugu Monthly

మార్చి 1997

# చతుర

రు.7/-



అక్కినాపల్లి సుబ్బారావు

## నీళ్లలో చంద్రుడు

# అరుదైన జంట





**సచిత్ర విచిత్రం**

కార్లనీ, భార్యల్నీ మారుస్తుండటం
సాధారణం అయిపోయిన అమెరికాలో
ఈ 85 ఏళ్ల రేక్రివెల్లో 82 ఏళ్ల వర్జీనియాలు
64 ఏళ్లు హాయిగా కాపురం చేశారు.
పెళ్ళప్పుడు ఏ కార్లో, ఏ హోటలుకైతే
హనీమూన్‌కు వెళ్ళారో
అదే కార్లో అదే హోటల్‌కెళ్ళి
తమ 64వ వివాహ వార్షికోత్సవం
జరుపుకోవటం మరో విశేషం.

# ఏరిన ముత్యాలు

☆ మానవుని దయామయునిగా తీర్చిదిద్దేదే నిజమైన విద్య.

-బాబా

☆ మరణించిన వానికంటే బతికున్నవాడు ఎంత అధికుడో, నిరక్షరాస్యునికంటే అక్షరాస్యుడు అంత అధికుడు.

-అరిస్టాటిల్

☆ బలవంతుణ్ణి ఉన్నచోటనే పూజిస్తారు. విద్యావంతుని సర్వత్రా పూజిస్తారు.

-చాణక్యుడు

☆ అజ్ఞానులే చదువుని ద్వేషిస్తారు.

-పుబ్లీరియస్ సైరస్

☆ అడగనివాడికి పొను విద్య ఇచ్చేకంటే అడిగినవాడికి ఔన్సు విద్య ఇవ్వటమే మేలు.

-ఆస్కార్ వైల్డ్

☆ చదువు ఐశ్వర్యంలో ఆభరణం, దారిద్ర్యంలో ఆశ్రయం.

-అరిస్టాటిల్

☆ జ్ఞానం అనేది మహాసాగరం. దాని ఒడ్డున ఏ కొద్ది గులకరాళ్ళనో ఏరుకోగలిగాను.

-ఐజాక్ న్యూటన్

☆ ప్రజలను గౌరవించడమే విద్యలోని రహస్యం.

-ఎమర్సన్

☆ విద్య మానవున్ని పరిపూర్ణ మానవుడిగా చేస్తుంది.

-జేమ్స్ కాథార్న్

☆ గుణశీలముల రూపకల్పనే విద్యాలక్ష్యం.

-హార్బర్ట్ స్పెన్సర్

☆ ప్రేమ ఎప్పుడూ మూల్యం కోరదు. తనని తాను అర్పించుకుంటుంది. బాధలో పునీతమవుతుంది.

-మహాత్మాగాంధీ

☆ పుట్టెడు విజ్ఞానంకంటే అణుప్రమాణమైన ప్రేమ ఎంతో గొప్పది.

-వెస్లీ

☆ అన్నివర్గాల ప్రజలు కలుసుకునే వేదికే ప్రేమ.

-డబ్ల్యు.యస్. గిల్బర్ట్

☆ మానవుడు ఆనందంగా జీవించాలంటే అతనికి రెండు కావాలి. మొదటిది ప్రేమ, రెండవది జ్ఞానం.

-బెర్ట్రండ్ రస్సెల్

**సేకరణ: మాడగుల రాము**

# చతుర ప్రపంచం

## హక్కులకోసం పోరాటం

నాగరికులకు దూరంగా అడవుల్లో బతికే గిరిజనులు ఎన్నో రకాలుగా ఆధునికులచేత వంచింపబడుతున్నారు. వాళ్ల అమాయకత్వం, నిరక్షరాస్యత వాళ్లు వంచనకు గురికావడానికి కారణమవుతున్నాయి. దీన్ని గురించి పరిశోధించిన బార్బరా బెంట్లీ అనే మహిళ గిరిజన హక్కుల పరిరక్షణకు నడుంకట్టి దానికోసం ఓ సంస్థను స్థాపించింది. దాని ద్వారా వారి హక్కుల రక్షణకు పోరాటాన్ని సలిపింది. నిజానికి గిరిజనులకు తమ హక్కులకోసం పోరాడేందుకు ఇన్నాళ్లూ ఒక వేదిక లేదు. పెద్ద పెద్ద అంతర్జాతీయ కంపెనీలతో వారు అప్పుడప్పుడు పోరాటాన్ని సలపవలసివస్తుంది. వాళ్లకి సహాయాన్నందించే వరల్డ్‌బ్యాంక్, ఇంటర్నేషనల్ మోనిటరీ ఫండ్ వగైరాలతో గూడ వాళ్లు తరచు ఎదిరించి పోరాడాల్సి వుంటుంది.

బార్బారా వాళ్లతో చెప్పేదేమంటే వాళ్ల కంపెనీ పెంపుదలకు చేపట్టే కార్యక్రమాలు గిరిజనుల అభిమతాలకు భంగం కలిగించేలా వుండరాదని, వాళ్ల జీవన విధానాలకు ఎలాంటి ఇబ్బందులు కలగకుండా చూడడమే తమ సంస్థ ధ్యేయమంటుంది ఆమె.

కేవలం అసూయాద్వేషాలు గిరిజన నాగరికతను తుడిచిపెడుతున్నాయని దాన్ని గురించి ఎవరూ పట్టించుకోవడంలేదని వాపోతోంది ఆమె. 'వన్యమృగ సంరక్షణ' అంటూ క్రూరమృగాల కోసం ఏడ్చే మానవుడు... సోదరులులాంటి గిరిజనులు నిరక్షరాస్యతలో అజ్ఞానంధకారంలో మగ్గుతుంటే పట్టించుకునేవారు లేరంటుంది.

ప్రపంచం మొత్తంమీద అత్యధిక సంఖ్యలో వంచించబడుతున్న గిరిజనులు లాటిన్ అమెరికా, సౌత్ ఈస్ట్ ఏషియాలలో ఎక్కువగా ఉన్నట్టు తెలుస్తోంది. వాళ్ల భూములను అన్యాయంగా ఆక్రమించుకుని, వాళ్ల జీవన విధానాలను ఆసరా చేసుకుని ఎన్నో పెద్ద పెద్ద కంపెనీలు కోట్లు గడిస్తున్నాయని వాదన. ఆధునిక పారిశ్రామిక సంఘంవాళ్లు తమ తమ డ్యాములను, ప్రాజెక్టులను, రైల్వే లైన్లను గిరిజన భూములమీదుగా నిర్మించాలనే ఆలోచన చేస్తున్నారు. ప్రభుత్వం కూడా తమ తమ పార్టీల ప్రయోజనాల కోసం గిరిజనులను మోసంచేసి లొంగదీసుకుంటోందని తెలియవస్తోంది.

టూరిజం, రోడ్లు, వ్యవసాయం ఈ మూడూ గిరిజన జీవితాలను కష్టమయం చేయడానికి కారణమవుతున్నాయి. టూరిస్టుల కోసం ఎంతోమంది గిరిజన స్త్రీలు వేశ్యలుగా మారుతున్నారు. ధనికులైన టూరిస్టులను ఆకర్షించడంకోసం, డబ్బు సంపాదన కోసం దట్టమైన అడవుల్లో కూడా స్టార్ హొటల్స్ నిర్మించాలని అభిప్రాయపడుతున్నాయి కొన్ని కంపెనీలు.

సుస్థిర ఆర్థిక విధానానికి పరోక్షంగా సహాయపడే గిరిజనులు, ప్రత్యక్షంగా మాత్రం చిన్నచూపు చూడబడుతున్నారు. పట్నవాసపు ప్రజల్లోని కృత్రిమత్వం, దగాతత్వం అడవిజనుల్లో మచ్చుకు కూడా కనపడవు.

బార్బారా బెంట్లీ గిరిజనులకోసం నిర్మించిన సంస్థ ఆర్థికంగా కొంచెం ఇబ్బందులనెదుర్కొంటోంది. ఆ సంస్థకి సంవత్సరాదాయం 7.5 లక్షలుంటే ఖర్చులు

ముఖచిత్రం: 'యోధుడు'- కలంకారీ చిత్రం — ఫోటో: కుమారస్వామి

10 లక్షలకి మించి వుంటున్నాయి. ఈ సంస్థ ద్వారా విడుదలయ్యే అధికార పత్రికకి ప్రపంచ వ్యాప్తంగా కేవలం వెయ్యిమంది మాత్రమే చందాదారులున్నారు. వారిచ్చే చందా డబ్బు ఒక్కొక్కరిది 225 రూపాయలు మాత్రమే. పెండింగ్‌లో వున్న ప్రింటింగ్ బిల్స్‌ను పూర్తిగా కట్టకపోవడంతో విపరీతమైన ఆర్థిక సంక్షోభంలో వుందా సంస్థ.

దాన్ని ప్రత్యేకమైన సంస్థగా తలచి 5 సంవత్సరాలకి పొడిగించారు. ఇది వాళ్ల సిద్ధాంతాలకి వ్యతిరేకమయినా ఆ సంస్థయందు వాళ్లకున్న ప్రత్యేకమైన అభిమానం అలాంటిది.

బార్బారాతోపాటు ఆ కంపెనీకి చెందిన ఒక డైరెక్టర్ పేరు స్టీఫెన్‌గోరీ. పెరూ, ఈక్వేడర్‌లలో గిరిజనులతో కలిసి ఆయన ఎంతో పనిచేశాడు. భవిష్యత్తులో వాళ్ల విశ్వాసాన్ని




పొందడం కోసం వాళ్లతో కలిసి జీవించాడు. బార్బారా స్థాపించిన సంస్థ గిరిజనుల పరంగా ఎన్నో విజయాలను సాధించలేకపోయినా కొన్ని ఎప్పటికీ మర్చిపోలేనివి వున్నాయి. బ్రెజిలియన్ ప్రభుత్వం యనోమని గిరిజనులకు కొంత భూమినిచ్చింది. రియోటిన్ట్ ఇంటర్నేషనల్ జింక్ కంపెనీ, పనామా ట్రైబల్స్ ప్రాంతంలో కోట్లాది రూపాయల లాభాన్నిచ్చే గనుల తవ్వకం పనిని నిలిపివేసింది. బార్బారా చేయాల్సిన పనులు ఎన్నో వున్నాయి. చాలాచోట్ల డ్యాములు కడుతున్నారు. ఈ ప్రాజెక్టుల కారణంగా ఆ ప్రాంతమంతా నీటితో నిండిపోతుంది. బంగ్లాదేశ్‌లో కూడా పర్వత ప్రాంతాల్లో నివశించే అనేకమంది గిరిజనులు, ఆ ప్రభుత్వం తయారుచేస్తున్న రోడ్డు ప్లాన్‌లు, టెలీకమ్యూనికేషన్లవల్ల ఎన్నో ఇబ్బందులకు గురవుతున్నారు.

వాతావరణ కాలుష్యం సంగతి ఎరిగి వుండీ కూడా ఆ సంస్థకి చెందిన డోనార్ కంపెనీలు ఎలాంటి సహాయం చెయ్యడానికి ముందుకు రావడంలేదు. చందాలు పోగుచెయ్యడం బార్బారాకి అత్యంత క్లిష్టమయిన పని. ఎందుకంటే చందాలడిగేటప్పుడు ఆయా కంపెనీలతో తమ సంస్థ ఆశయాలకు వ్యతిరేకమైన ఏవిషయంలోనూ రాజీ పడలేదామె.

"నేను చందాలను ఎంతో మర్యాదగా చేతులు చాచి మరీ అడుగుతాను. కానీ ప్రిన్సిపుల్స్‌ని దెబ్బతీసే ఎలాంటి షరతులనూ నేనంగీకరించను'' అంటుందామె. రాక్‌ఫెల్లర్ ఫౌండేషన్‌వారు 3 సంవత్సరాల గ్రాంటును ఇవ్వడానికి అంగీకరించి, తిరిగి

ఈ సందర్భంగా వరల్డ్ బ్యాంకుతోటి ఇంటర్నేషనల్ మోనిటరీ ఫండ్ మొదలయిన పెద్ద పెద్ద కంపెనీలతో తలపడుతోందీ సంస్థ. ఎందుకంటే ఆయా ప్రాజెక్టులకు లోన్స్ ఇచ్చేది ఈ కంపెనీలే. అందుకే వాటిని నిలిపివేయాలని ఈ కంపెనీలను నిలదీస్తోంది. కానీ తమ సంస్థ అలాంటి కంపెనీలను ఎదుర్కొని విజయాన్ని సాధించగలదా అని బార్బరా ఎప్పుడూ అనుమానపడుతూనే వుంటుంది. కానీ ఈ సంస్థ ద్వారా గిరిజన హక్కుల రక్షణకోసం బార్బరా చేసిన పోరాటం, ఆ సంస్థకి ఎంతో కీర్తిప్రతిష్టలను తెచ్చిపెట్టింది.

అయితే ప్రస్తుతం ఈ సంస్థ చాలా ఆర్థిక సంక్షోభంలో పడింది. దానినుంచి బయటపడి సంస్థ ఆశయాలను ఆచరణదిశగా పయనింపచేసేందుకు బార్బరా తీవ్రంగా కృషిచేస్తోంది.

---

# ఏనుగుదంతం

'చచ్చినా, బతికినా ఏనుగు ఏనుగే' అనీ, 'ఏనుగెడుతుంటే కుక్కలనేకం మొరుగుతాయి' అనీ సామెతలు చెపుతూ ఆదినుంచీ ఏనుగును అందలం ఎక్కించారు జనులు. ఏనుగును పెంపుడు జంతువుగా కూడా వుంచుకోవడమనేది అనాదినుంచీ వస్తోంది.




పూర్వం రాజులవద్ద వుండే బలగాలలో గజాలు కూడా ప్రముఖ పాత్ర వహించాయి. మిగతా విషయాలెలావున్నా ఏనుగు దంతం మాత్రం లక్షల విలువచేస్తుందని అందరికీ తెలిసిన విషయమే. ఏనుగు దంతంతో అనేక రకాలైన అందమైన వస్తువులను తయారుచేస్తారు కళాకారులు. ఇటలీ, ఆఫ్ఘనిస్థాన్ మొదలైన దేశాల్లో ఈ దంతపు వస్తువులు విరివిగా కనిపిస్తాయి. ప్రాచీన కాలపు దంతపు వస్తువులు మొహంజొదారో, హరప్పా శిథిలాలలో కనుపించాయి. ఇవన్నీ నిత్యం మనం ఉపయోగించే దువ్వెన్న, తలపిన్ను, బాణపు ములుకులు వగైరా వస్తువులు. ఇలాంటి మామూలు వస్తువులను తయారు చెయ్యడానికి ఎక్కువ నైపుణ్యత అవసరం లేదనిపిస్తుంది. కానీ ఒక్కొక్క వస్తువును తయారుచేసేటప్పుడు జామెట్రికల్ వస్తువులనుపయోగించి, సరియైన కొలతలు చూసి మరీ తయారు చేస్తారీ వస్తువుల్ని.

పురాతన హిందూ సాహిత్యంలో దంతపు

పని గురించి ఎన్నోచోట్ల విస్తారంగా వివరించబడింది. జాతక కథల కాలం నుంచి, నేటి యూరోపియన్ ట్రావెలోగ్స్ వరకు ఈ ఐవరీ ప్రస్థావనవుంది.

ఓసారి ఓ శిల్పి దంతంతో బియ్యపు గింజల్ని తయారుచేసి భార్యకిచ్చాడు. అవి నిజమైన బియ్యమనుకుని ఆమె పొయ్యి మీద పెడితే అవి ఎంతకూ ఉడకలేదట.

రామాయణ, మహాభారత కాలాల్లో ఇళ్లకి టికీలు, మంచాలు దంతంతోనే చేయబడేవి. మహా భారత యుద్ధంలో వాడిన కొన్ని కత్తులకు దంతపు పిడులువుండేవి.

1000 నుంచి 300 బి.సి.ల మధ్యకాలంలో యుద్ధాలు జరిగినప్పుడు దంతపు బాణపు ములుకులుగల బాణాలనే వాడేవారు. 6వ శతాబ్దంలో హిందూ దేశపు దంతపు పనితనం ఇరాన్‌కు ఎగుమతి చేయబడిందన్నారు కొందరు.

ఆఫ్ఘనిస్థాన్‌లోని చారిత్రక తవ్వకాలలో సుమారు 600 రకాల దంతపు వస్తువులు బయల్పడ్డాయి. ఇందులో చాలా వస్తువులు స్త్రీల అలంకరణల్లో చోటుచేసుకునేవే. ఇవి 1 లేదా 2వ శతాబ్దికి చెందినవని అంచనా. గుప్తులకాలంలో కూడా దంతపు సామాన్లు వాడినట్లు వరాహమిహిరుడు తన 'బృహత్సంహిత'లో ప్రస్తావించాడు. అయితే అప్పటి వస్తువులు నిత్యకృత్యంలో ఉపయోగించే చిన్నచిన్న వస్తువులు మాత్రమే. గుప్తుల తరువాతికాలంలో దంతపు పనితనం మరింత అభివృద్ధి పథంవైపుకి పయనించింది.

ఆమధ్య కాశ్మీరులో జరిగిన కొన్ని తవ్వకాలలో చిత్రవిచిత్రమైన దంతపు వస్తువులు బయటపడ్డాయి. ఇవి బౌద్ధ మతాన్ని సూచిస్తున్నాయి. ఇవి 8వ శతాబ్దివి అంటున్నారు చరిత్రకారులు. టిబెట్‌లోని బౌద్ధారామాల్లో దంతాన్ని ఎక్కువగా ఉపయోగించారు.

సేన్, పాల్... రాజులకాలాల్లో బెంగాల్‌లో దంతపు పని అత్యంత ఉచ్ఛస్థితికి వెళ్లింది. 13నుంచి 17వ శతాబ్దం వరకు ఒరిస్సా దంతపు సామానుల ప్రధాన కూడలి అయింది. ఒరిస్సాను పాలించిన రాజులు దేవాలయాలను నిర్మించి వానిమీద అద్భుతమైన దంతపు చెక్కడాలను అమర్చారు. రాజస్థాన్‌కూడా ఈ దంతపు పనికి ప్రాముఖ్యత వహించినరాష్ట్రం. రాజస్థానీయులు ఇప్పటికీ దంతపు గాజులను వేసుకుంటారు.

గోవాలో 17వ శతాబ్దంలో క్రీస్తు యొక్క దంతపు విగ్రహాన్ని ప్రతిష్టించారు. పేపర్ కట్టింగ్ మెషీన్లు, బిలియర్డ్స్ బంతులు, షర్ట్ బటన్‌లూ ఇవన్నీ దంతంతోనే చేసేవారు అప్పట్లో.

## ఆదర్శ విద్యాలయం

**1983** సెప్టెంబర్ 5న మధ్యప్రదేశ్‌లోని సేంధ్వా అనే ఊళ్లో ఒక వృద్ధుడికి సన్మానం జరిగింది. అయితే ఆయనేమీ రాజకీయవేత్త కాదు. కనీసం ఆ రాష్ట్రానికి చెందిన వ్యక్తి కూడా కాదు. ఆయన పుట్టింది కర్నాటకలో అయినా మధ్యప్రదేశ్‌లో ఎంతోమంది హృదయాల్లో గౌరవనీయమైన స్థానాన్ని సంపాదించుకున్నారాయన. ఇంతకీ ఈయన ఎన్నుకున్న పని ఉచితంగా ఇంగ్లీషు బోధించడం. ఆ బోధన ఆయనకి చక్కని కీర్తి గడించి పెట్టింది.

1905, ఆగస్ట్ 15న కోలార్ జిల్లాలోని చింతామణిలో పుట్టాడు రామయ్యాశాస్త్రి. బెంగుళూరు, మైసూర్లలో ఆయన విద్యాభ్యాసం పూర్తయింది. 1919లో జరిగిన జలియన్‌వాలాబాగ్ ఉదంతం ఆయన్ని కదిలించింది. కానీ గాంధీజీ ప్రభావంతో విప్లవ స్వభావానికి స్వస్తి చెప్పి అహింసోద్యమంలో పాల్గొనేలా చేసింది. మైసూర్‌లో ఎస్.ఎస్.ఎల్.సి పూర్తిచేసి నాగపూర్ వెళ్లి ఎగ్రికల్చరల్ కాలేజీలో 1927లో పట్టాపుచ్చుకున్నారు. అగ్రికల్చరల్ డిపార్ట్‌మెంట్‌లో చాలాకాలం పనిచేసి, అగ్రికల్చరల్ ఇన్ఫర్మే

టివ్ ఆఫీసరుగా రిటయిరయ్యారు.

అటుపైన ఆయన మరాఠీలో 'షేత్కారీ సమాచార్', హిందీలో 'కిసాన్ సమాచార్' అనే పత్రికలను ప్రారంభించారు. వాటికి ఆయన చీఫ్ ఎడిటర్గా కూడా పనిచేశారు. అతని నిర్భీతి, స్వాతంత్ర్య సమరంలో పాల్గొనడం, ఖాదీ ధరించడం వగైరా విషయాల మూలంగా అప్పట్లో ఆయన పోలీస్ల రెడ్ లిస్ట్లోకి వెళ్లడం కూడా జరిగింది.

రిటయిరయ్యాక ఆయన తన కొడుకులతో కలిసి వుండేవాడు. హొసంగాబాద్, ఝాబువా, బస్తర్ మొదలైన ప్రాంతాల్లో అతని కొడుకు పని చేసేవాడు. ఆయా ప్రాంతాల్లో సాంఘిక కార్యక్రమాల్లో ప్రముఖ పాత్ర వహించేవాడు రామయ్య. 1970లో ఆయన భార్య గతించాక ఆయన సేంధ్వాలో వుండసాగాడు. సేంధ్వా మధ్యప్రదేశ్లో ఖర్గావ్ జిల్లాలో వుంది. 12 ఏళ్లు అక్కడున్నారు. మొదటి ఆరేళ్లు ఆయన ఒంటరిగా వున్నారు. అక్కడ ఇంగ్లీషుబోధన ప్రారంభించారు.

మధ్యప్రదేశ్లో ఓసారి 'అంగ్రేజీ హటావో' ఉద్యమం చెలరేగింది. రామయ్య కోడలు ఓ స్కూల్లో ఇంగ్లీషు టీచర్గా పనిచేసేది. అప్పటికే అక్కడివారిలో ఇంగ్లీషు నేర్చుకోవాలనే కుతూహలం నశించడంతో మామగారితో తన గోడు చెప్పుకుంది. దాంతో ఆయన 'ఆదర్శ విద్యాలయం' అన్న పేరుతో కేవలం ఇంగ్లీషు భాషను నేర్పే విద్యాలయాన్ని ప్రారంభించారు. మొదట్లో టార్పాలిన్తో రెండు మూడు కర్రలు పాతి క్లాసు రూములు నిర్మించారు. అటుపైన విద్యార్థుల సంఖ్య ఇబ్బడిముబ్బడిగా పెరిగి స్కూలు నిర్మాణాన్ని పెంచి, పటిష్టపరచవలసి వచ్చింది. ఆదర్శ విద్యాలయానికి విద్యార్థులు విభిన్న సంస్థలనుంచి చందావసూలు చేసి తెచ్చి ఇచ్చేవారు. తరచు పోటీ పరీక్షలు నిర్వహించి మంచి మార్కులు వచ్చిన వారికి బహుమతులనిచ్చి ప్రోత్సహించేవారు. అటుపైన విద్యాలయానికొచ్చిన ఆదాయాన్ని ఇంజనీరింగ్, మెడిసన్ చదివే విద్యార్థులకు వడ్డీలేకుండా అప్పు ఇచ్చేవారు. ఆదర్శ విద్యాలయంలో రోజుకు 10 గంటలు క్లాసులు జరుగుతాయి. ఇదంతా ఆయన వృద్ధాప్య దశలో జరిగిందే. అతని సేవాభావానికి, ఆదర్శాలకి మెచ్చి డిస్ట్రిక్ట్ కలెక్టరు అతనికి సన్మానం చేసి 15,501 రూపాయల చెక్కును అందచేశారు. దీనితో ఆయన 'స్టూడెంట్ వెల్ఫేర్ఫండ్'ను ప్రారంభించారు. 'తను వృద్ధుడయి, మృత్యువుకు దగ్గరవుతున్నానన్న విషయాన్ని మర్చిపోయేలా చేసి, మరింత ఉత్సాహవంతంగా వుండేలా చేస్తోంది నన్నీ బోధన' అంటారాయన. ★



చతుర

సంపుటి: 20 సంచిక: 2 మార్చి 1997

అమెరికాలో స్థిరపడ్డనాటినుంచీ ఆ తండ్రీకొడుకుల మధ్య బంధం యాంత్రికమైపోయింది. సాంప్రదాయాలను, మాతృదేశంలోని మానవతా విలువల్ని కొడుక్కు చెప్తూనే తప్పనిసరి పరిస్థితిలో అతని ప్రేమ వివాహానికి, అదీ... ఓ తెల్లపిల్లతో అంగీకరించాడా తండ్రి.

యాంత్రికతతో జడమైన వారి బాంధవ్యం తండ్రి మరణంతో ఒక్కసారిగా చైతన్యవంతమయింది. ఆయన డైరీలు అతని మనసుని తీరనివేదనకి గురిచేశాయి.

ఆ డైరీలను తీసుకుని ఎంతో ఆర్తితో, ఆవేదనతో భారతదేశానికి బయలుదేరాడతడు. ఎందుకు? మృత్యువుతో తప్ప బయటపడని తండ్రి జీవన రహస్యం ఏమిటి?

మానవతా బంధాలను,మమతానురాగాలను మృదువైన శైలిలో విశ్లేషించిన అక్కినాపల్లి సుబ్బారావు రచన

# నీళ్లలో చంద్రుడు

ఈ నెల చతుర సమగ్ర నవల.

ఆర్పేసిన సిగరెట్ పీకని చెత్తడబ్బాలోనికి గిరవాటేసి, మెక్డోనాల్డ్‌లోనికి ప్రవేశించేడు సురేష్.

"కెన్ ఐ హెల్ప్ యూ? " అనడిగింది పదిహేడేళ్ళ నిగనిగలాడుతున్న నల్లపిల్ల పళ్లన్నీ విప్పి నవ్వుతూ.

"ఆనియన్ రింగ్స్, రెగ్యులర్ కాఫీ" అన్నాడు సురేష్.

"కాఫీ, ఆనియన్ రింగ్స్" అంటూ మైక్రోఫోన్‌లో లోపల ఉన్న సిబ్బందికి తెలియపరచి,

"డాలర్ సెవెంటీ ఫైవ్" అంది ఆ పూబోడి సురేష్‌తో.

డబ్బు ఇచ్చి అరనిమిషం తరువాత ఆమె అందిచ్చిన కాఫీ, ఆనియన్ రింగ్స్‌తో కిటికీ దగ్గర కుర్చీలో చతికిలపడి, బయట తిరుగుతున్న ప్రజానీకాన్ని నిరాసక్తితో గమనిస్తూ కాఫీని చప్పరించేడు.

కాఫీ చేదుగా అనిపించగానే, పాలు పంచదార కలుపుకోలేదని గ్రహించి, లేచి, కౌంటర్‌మీదున్న బుల్లి పాలకప్పులని, పంచదార పేకెట్లని తెచ్చుకుని, కోటు విప్పుకుని, తిరిగి పాత స్థానంలో ఆసీనుడయ్యేడు.

పేకెట్లలో ఉన్న పంచదారని కాఫీ కప్పులోకి వంచేక, మట్టిరంగు వచ్చేంతవరకు పాలని కలిపేడు. సలసలా కాగే నూనెలో వేయించిన ఆనియన్ రింగ్స్, నోటిలో పెట్టుకోగానే రుచిగా తగిలేయి.

"ఆనియన్ రింగ్స్ నిండా కొవ్వే. తినకు. నీ ఒంటిలో కొవ్వు పెరుగుతుంది" అనో, లేకపోతే, "పానకంలాగ కాఫీలో అంత పంచదారేమిటి? " అనో కేతరీన్ తరచూ మందలించేది, విసిగించేది. ఆమెను సంతోషపెట్టడానికి, కాఫీలో పంచదార, ఆనియన్ రింగ్స్‌తోపాటు చాలా వాటిని తను వదులుకున్నాడు.

అయినా కేతరీన్ తనని వదిలి వెళ్ళింది!

కేతరీన్ వెళ్ళి దాదాపు రెండు సంవత్సరాలవుతోంది.

బయట క్వీన్స్ బులావార్డ్‌మీద కార్లు, ఇతర వాహనాలు హడావుడిగా పరిగెడుతున్నాయి. దగ్గరగా ఉన్న యూనియన్ టర్న్‌పైక్ మెట్రొస్టేషనులోంచి, 'టక్‌టక్, టక్‌టక్' అని శబ్దం చేసుకుంటూ రైళ్ళు వేగం పుంజుకుంటున్నాయి.

ఏప్రిల్ మొదటివారం, చలికాలం వెళ్లనంటూ మొరాయిస్తోంది. శనిని చూసి తొర్రలో దాగుకుని ఉన్న శివునిలా, చలికాలం అంటే భయపడిన సూర్యుడు ధైర్యం చేసి, బయటకు వచ్చి, అటూఇటూ చూస్తూ అంబులని విసరడానికి ఆయత్తమవుతున్నాడు.

కళ్ళజోళ్ళు, బవిరిగెడ్డాలతో, మాడుమీద చిన్న రేసుల టోపీలతో యూదులు తిరుగుతున్నారు. వాళ్ళ పెద్ద బలమైన ముక్కులని చూడగానే వీళ్ళు యూదులని సులభంగా పోల్చుకోవచ్చు. తెల్లని శరీరంమీద, పూర్తిగా కప్పుకున్న నల్లకోట్లలో అటూ ఇటూ తిరుగుతున్న వ్యక్తులని చూస్తుంటే, సురేష్‌కి నల్ల గండుచీమలు మదిలో మెదిలేయి. ఎంతటి విషసర్పాన్నయినా చుట్టుముట్టి తినేయగల క్రూరత్వం, భయంకరత్వం ఉంది గండుచీమలకి.

అమెరికాలో యూదులూ అంతే!

ఎవరైనా వాళ్ళ జోలికివస్తే, వాళ్ళని సర్వనాశనం చేస్తేగాని వదలరు!

కేతరీన్ వెళ్ళిపోయేక, ఆఫీసుకి దగ్గరని, న్యూయార్క్ క్వీన్స్‌లో, యూదులు ఎక్కువగా నివశించే ఫారెస్ట్ హిల్స్‌లో గది అద్దెకు తీసుకున్నాడు. యూదులు డబ్బున్నవాళ్ళు కాబట్టి ఫారెస్ట్ హిల్స్‌లో పోలీసుల గస్తీ ఎక్కువ, హింస తక్కువ.

కాఫీ తాగడం పూర్తయింది.

జో అంబులెన్స్, దాని వెనకాలే రెండు ఫైరింజన్లు శబ్దం చేసుకుంటూ వెళ్తుంటే లేచి, నిలబడి కోటందుకుని బయటకి నడిచేడు సురేష్. సూర్యుడు ప్రకాశిస్తున్నా,

సముద్రంమీదనుంచి వచ్చిన గాలి చల్లగా చెవులని తాకగానే కోటు వేసుకున్నాడు.

"ఒక క్వార్టర్ ఇవ్వగలవేమిటి బ్రదర్? కాఫీ తాగుతాను" అంటూ తన దగ్గరగా వచ్చి చేతిని చాచేడు ఒక నలుపు వ్యక్తి. ఆ వ్యక్తి వేసుకున్న కోటు మాసిపోయి, నిండా మరకలతో అశుభ్రంగా ఉండడమే కాకుండా చిరగడానికి సిద్ధంగా ఉంది. చాచిన చేతికి ఉన్న గ్లవ్స్‌లోంచి వేళ్ళు బయటకి తచ్చాడుతున్నాయి. చిరుగులున్న జీన్స్ పేంట్, బలంలేని స్నీకర్స్, తైల సంస్కారంలేని జుత్తు.

జేబులోంచి ఒక క్వార్టర్ తీసి అతనికి అందిచ్చేడు సురేష్.

" గాడ్ బ్లెస్‌యూ" అంటూ కదలి ముందుకువెళ్ళేడు ఆ వ్యక్తి. బాగా డబ్బున్న అమెరికాలో అడుక్కోవడం కూడానా అనుకుంటూ మెల్లిగా ఇంటివేపు నడక ప్రారంభించేడు సురేష్.

ఫారెస్ట్ హిల్స్‌లో ఎక్కడ చూసినా యూదులే.

దుకాణాలు, కంపెనీలు, పెద్దపెద్ద బేంక్‌లు, కట్టడాలు అన్నీ యూదులవే. ఎక్కడ నివశించినా యూదులు తమ సాంప్రదాయాల్ని వదిలిపెట్టరు.

సాంప్రదాయం!

సాంప్రదాయం అంటే చటుక్కున తండ్రి మదిలోనికి వచ్చేడు.

నిన్నని పట్టుకుని వదిలిపెట్టని తండ్రి!

గతాన్ని కౌగిలించుకుని, ఈవేళ్టిలోనికి అడుగుపెట్టడానికి భయపడిన తండ్రికి, తను కేతరీన్‌తో సన్నిహితంగా మసలడం నచ్చలేదు.

అది పట్టించుకోకుండా కేతరీన్‌ని పెళ్ళిచేసుకుని, తండ్రి నమ్మిన సామాన్య సాంప్రదాయానికి గండిపెట్టి, తండ్రి గుండెలో చిచ్చుని రగిల్చేడు తను.

దాదాపు ఏభైఐదేళ్ళ ఓ జవ్వని, జాగింగ్ డ్రెస్‌తో పరిగెడుతూ, సురేష్‌ని ఒరుసుకుంటూ దాటి వెళ్ళింది. ఏభైఐదేళ్ళ స్త్రీ, పట్టపగలు నడిబజారులో విలక్షణమైన దుస్తులు వేసుకుని పరిగెత్తడం ఏ జాతి, ఏ తెగ సాంప్రదాయం?

సాంప్రదాయం!

రోజులు మారుతుంటే, అలవాట్లూ, సాంప్రదాయాలూ మారుతాయి.

వాంఛనీయమైనా, అవాంఛనీయమైనా మార్పు తప్పనిసరి!

మెయిన్‌రోడ్డుమీదనుంచి మలుపు తిరిగి, చిన్నరోడ్డుమీదకి రాగానే, గాలి తాకిడి తగ్గింది. దానితోపాటు సూర్యుడు ఎక్కువగా ప్రకాశించడంతో, హాయి అనిపించింది సురేష్‌కి.

మనుష్యులు నడిచే బాట పక్కని ఉన్న పూలు, పళ్ళ దుకాణాలని దాటుకుంటూ ముందరకి నడిచేడు. కాలి బాట మీదున్న దుకాణాలని ఆనుకుని, చిన్నచిన్న బుట్టలలో పెట్టి అమ్ముతున్న "బ్లూబెర్రీ"లని చూడగానే తండ్రి మరోసారి ఆలోచనలోనికి చొచ్చుకువచ్చేడు.

"సూరీ, మా చిన్నపుడు విజయనగరానికి దగ్గరగా ఉన్న మచ్చకొండమీద దట్టమైన పొదలలో దొరికే పుసినాగపళ్ళు ఇంచుమించు ఇలాగే ఉండేవి" అనేవాడు బ్లూబెర్రీలని చూపిస్తూ. ఒక పళ్ళదుకాణం దగ్గర ఆగి, బ్లూ బెర్రీలని కొనుక్కుని ఇంటి వేపు నడక కొనసాగించేడు సురేష్.

ఆదివారం ఉదయం చర్చికి వెళ్ళే జనం తప్పిస్తే సందులలో జనసంచారం అట్టే లేదు.

మేడమీదకి వెళ్ళి తలుపు తెరిచి, పదహారు మెట్లు నీరసంగా ఎక్కి, గది తలుపు తీసి సోఫాలో చతికిలపడ్డాడు.

పరదాల వెనుకనుంచి లోపలికి వడకట్టబడి వచ్చిన వెలుతురు కనీకనిపించకుండా మందంగా ఉంది.

సురేష్ లేచి పరదాలని పక్కకి నెట్టగానే

కొళాయి ధారలోంచి నీళ్ళు తన్నుకువచ్చి నట్లు, ఒక్కసారి వెలుతురు లోపలికి జొర పడి, పరుగెత్తి గోడల మీదున్న వాల్ పేపరుమీద వయ్యారంగా సర్దుకుంది.

తెల్లని వాల్ పేపరుమీద, తాజ్‌మహల్ గోడలమీదున్నట్లు పొడుగు కాడలున్న ఎర్ర గులాబీలని కాంతికిరణాలు మృదువుగా స్పృశించడంతో రేకులు వింత సోయగాన్ని ఒలకపోసేయి. చూరునుండి వేలాడుతున్న గుండ్రని కర్ర చక్రంమీద ఎనిమిది లాంతర్లు, గదిలో ఓ మూల టెలివిజన్, దాని పక్కనే స్టీరియో, సోఫాలని ఆనుకుని రెండు సోఫాలమధ్యా, చిన్న బల్లమీద ఎర్ర టెలిఫోన్, పరదాలని పక్కకి తొలగించగానే ప్రాణం పోసుకున్నాయి.

బట్టలు మార్చుకోనడానికి పడక గదిలో నికి నడిచేడు సురేష్.

అస్తవ్యస్తంగా ఉన్న పరుపుమీద నలిగిన దుప్పటి, క్రమమూ పొంకమూలేని రెండు తలగడాలు. కంప్యూటర్ బల్లమీద చిందర వందరగా కాగితాలు.

సీలింగ్ మీదున్న లాంతరులోని రెండు బల్బులలో ఒకే బల్బు వెలుగుతోంది. కిటికీ పరదాల హుక్స్ తెగి, పక్షవాతం వచ్చిన పుడు ఒక పక్కకి ఒరిగిన నోటిలా, పరదా వంగి ఉంది.

నేలమీదున్న లేతనీలం రంగు కార్పెట్ మీద చెత్త, దుమ్ము అక్కడక్కడ పడి ఉన్నాయి. కప్‌బోర్డ్ తెరచి, ఇంటిలో ఉండే టప్పుడు వేసుకునే దుస్తులు ధరించి, ఆ గదిలో ఉండలేక, హాలులోనికి వచ్చి టెలివి జన్‌ని ఆన్‌చేసేడు.

ఆదివారం ఉదయం పది గంటలయింది.

టెలివిజన్ ఛానెల్స్ మారుస్తుంటే ఇండి యన్ ప్రోగ్రాం కనిపించగానే, సోఫాలో వెనక్కి చేరగిలబడి చూడసాగేడు.

బ్లేక్ అండ్ వైట్ హిందీ సినిమాలలోంచి దాదాపు నలభై ఏళ్ళ క్రితంవి, ప్రణయగీ తాలు ప్రసారం చేస్తున్నారు.

తండ్రికి ఇవంటే ఎంత ఇష్టమో! పాత పాటలంటే చెవికోసుకునేవాడు. బాల్యం, కొంత యవ్వనకాలం ఇండియాలో గడిపిన తండ్రికి, ఆనాటి పాటలంటే ఇష్టం ఉండ డంలో ఆశ్చర్యమేముంది? రెండు పాటలమధ్య ఎనౌన్సర్ వచ్చి హిందీలో ఏదో వివరిస్తోంది.

తండ్రికి హిందీలో ప్రవేశం ఉండేది, అందుకే హిందీ పాటలంటే పరిగెత్తేవాడు. తనకి హిందీ పాటలమీద ఉత్సాహం కలి గించబోయేడు. దాదాపు పదేళ్ళ వయస్సులో ఇండియా వదలిన తనకి అది నచ్చకపో వడం కనిపెట్టి, ఆ ప్రయత్నం విరమించు కుని, తనచుట్టూ గుడి కట్టుకున్నాడు తండ్రి. కేతరీన్‌తో పెళ్ళయ్యేక, తనకీ తండ్రికీ మధ్య దూరం ఎక్కువయింది. తల్లి చనిపోయేక, ఒంటరయిన తండ్రి, కేతరీన్ తన జీవి తంలో ప్రవేశించేక మరింత ఒంటరయేడు. తనని మందలించకపోయినా, రోజులు గడు స్తుంటే, తండ్రి, తనని తన మానాన వదిలే యడం ఎక్కువయింది.

దాదాపు సంవత్సరం క్రితం, తండ్రి కారు ఏక్సిడెంట్‌లో హఠాత్తుగా చనిపోగా, ఎలక్ట్రిక్ క్రిమెటోరియంలో ఆయన్ని బూడిద చేసిన పుడు, తను అనాథయ్యాడన్న సత్యం తనని ఒక్కసారి విచలితుని చేసింది.

జన్మనిచ్చిన తండ్రి!

చదువు, సంధ్యలు నేర్పించిన తండ్రి!

సైకిల్ నేర్చుకుంటూ జారిపడి ముడుకులు చెక్కుకుపోతే, కంటినీరు తుడి చిన తండ్రి!

తల్లి చనిపోతే వెక్కివెక్కి ఏడుస్తున్న తనని ఊరడించిన తండ్రి!

ఉద్యోగంలో అన్యాయం జరిగిందని గింజుకుంటున్న తనని సముదాయించిన తండ్రి!

కేతరీన్‌తో తన పెళ్ళి ఇష్టంలేకపోయినా, తన అయిష్టతను బయటకి చెప్పకుండా

అసమ్మతిని గుండెల్లో దాచుకున్న తండ్రి!

అలాంటి తండ్రి, అర్థాంతరంగా అంతర్ధానమయేసరికి ప్రపంచం అంతా ఒక్కసారి చీకటైంది తనకి.

తండ్రి వ్యవహారాలు సరిదిద్దడానికి దాదాపు నెల్లాళ్ళు పట్టింది. తండ్రితో పని చేసే సహాధ్యాయులతో మాట్లాడినపుడు, తండ్రి గుణగణాలు తెలిసి ఆశ్చర్యం కలిగింది. ఆ ఆంతరంగిక విషయాలు తనతో పంచుకోకుండా కనుమరుగయిన తండ్రిని తలచుకుని బాధవేసింది. కేతరీన్ తనని వదిలి వెళ్ళేక తండ్రితో జరిగిన సంభాషణ మదిలోనికి వచ్చింది.

"మనం అనుకున్నట్లు, కోరినట్లు జీవితంలో అంతా జరగదు సూరీ! అవాంఛనీయమైన సంఘటనలని ఆవలకి నెట్టి ముందుకు నడవాలి. ఆఖరుసారి నేను నీకు డిన్నర్ ఇస్తాను. లే, బ్రాడ్వే వెళదాం, అక్కడ ఏదైనా షో చూద్దాం, రేపు ఉదయం ఫ్లైట్‌కి నేను మా ఊరు వెళ్తాను" అన్నాడు తండ్రి.

విచారంలో కూరుకుపోయిన తను, తండ్రి మాటలని ప్రత్యేకంగా గమనించ లేదు. తండ్రి అన్నట్లు, అదే ఆఖరుసారి అయింది.

మర్నాడు పొద్దున్న ఎయిర్‌పోర్ట్‌కి వెళ్ళబోతూ, నిద్రపోతున్న తన భుజంమీద తట్టి తలమీదున్న జుత్తుని సవరించి "ఇండియా ఒకసారి వెళ్ళి మీ చిన్నాన్నని, అత్తని చూసి రాకూడదూ? ప్రదేశంలో మార్పు నీకు మంచి చేస్తుంది. వాళ్ళ ఎడ్రసులు, టెలిఫోన్ నెంబర్లు నీకు పంపుతాను" అని మెట్లు దిగి, టేక్సీలో ఎయిర్‌పోర్ట్‌కి వెళ్ళిపోయేడు.

తను కనీసం మేడమెట్లయినా దిగి వీడ్కోలు చెప్పలేదు!

తండ్రి ఏమనుకున్నాడో!

బతికి ఉన్నపుడు అర్థమవని తండ్రి, చనిపోయి తనమీద వింత ప్రభావాన్ని కలిగిస్తున్నాడు ఈనాడు.

అన్నట్టుగా ఎడ్రసులని పంపేడు తండ్రి. తను వాటి గురించి పట్టించుకోలేదు. ఆ ఎడ్రసులు, టెలిఫోన్ నెంబర్లు తండ్రి ఆకస్మిక మరణం గురించి వాళ్ళకి తెలియపరచడానికి మాత్రం ఉపకరించేయి.

ఒంటరితనం భయంకరమైనది!

ఈ దేశంలో తండ్రి జీవితానికి ఆలంబన తను, తల్లి! కాని ఈనాడు తను ఏకాకి!

గతంలో ఒక పండుగరోజున "చరిత్ర తిరగేసి చూస్తే, ఎన్నాళ్లు ఈ దేశంలో నివశించినా మనం పరాయి దేశస్తులమే. ఈ దేశపు సంస్కృతి అలవరచుకున్నా, ఇక్కడి మంచి స్నేహితులని సంపాదించినా, దగ్గర బంధువులకోసం అర్రులు చాస్తాం" అన్నాడు తండ్రి.

తనకి ఏమీ అర్థమవలేదు. దగ్గర బంధువులు, ఇరవై ఏళ్ళక్రితం వెలిసిపోయిన జ్ఞాపకాలు! లీలగా, గజిబిజిగా, అలుక్కుపోయిన బంధువుల మొహాలు!

విశాఖపట్నంలో అదేదో పేటలో, మేడమీద ఒకభాగంలో అద్దెకి ఉండేవారు. అదే ఊరులో ఇంకెక్కడో ఉండేవారు చిన్నాన్న, అత్త.

హిందీ ప్రోగ్రాం ముగిసి కార్టూన్లు మొదలవడంతో టెలివిజన్‌ని ఆఫ్‌చేసేడు. ఆలోచనలు తెగేయి. తిరిగి పాత ఆలోచనలోనికి వెళ్ళడానికి ప్రయత్నించేడు.

చెదిరిన కల, తెగిన ఆలోచనలు తిరిగి పాతచోటకి చేరవు. అసహనంగా లేచి, స్నానాలగదిలోనికి వెళ్ళి, షవర్ విప్పి, వేడెక్కిన మెదడుని చల్లబరచబోయేడు సురేష్.

★ ★ ★

"ఫెస్టివల్ ఆఫ్ ఇండియా" అంటూ ఏర్పాటుచేసిన సంగీత కచేరీ దాదాపు రెండు గంటలు సాగేక, కళాకారులు, కళాపోషకులు తేరుకోవడానికి పదినిమిషాలు విరామం ప్రకటించేరు.

కచేరీకి వచ్చిన నూటఏభై జనాభాలో సగంమంది భారతీయులు కారు.

పసుపు దట్టంగా వేసి కాచిన మజ్జిగ పులుసు రంగులో, దాదాపు ముప్ఫయి ముప్ఫయిఐదేళ్ళ వయస్సులో ఉన్న ఇద్దరు అమెరికన్లు, ఎరుపు, ఆకుపచ్చ రంగు పట్టు చీరలు ధరించడం చూసి, రవ్వంత ఆశ్చర్య పడ్డాడు సురేష్.

దూరంనుంచి సురేష్ వాళ్ళనే పరీక్షగా గమనించడం కనిపెట్టి, "వాళ్ళని పరిచయం చేసేదా? వాళ్ళ భర్తలు హరి, బెనర్జీలు నాకు తెలుసు" అన్నాడు స్నేహితుడు రామ కృష్ణ.

"అబ్బెబ్బె ఎందుకు? " అని తడబడ్డాడు సురేష్.

"ఈ పాట కచేరీకి ఆర్టిస్టులు హైదరాబా దునుంచి వచ్చేరు. రా, వాళ్ళని పలకరిద్దాం'' అంటూ లాక్కెళ్ళేడు రామకృష్ణ.

కాఫీ తాగుతూ, వాళ్లతో రామకృష్ణ తెలు గులో సంభాషణ కొనసాగిస్తుంటే మౌనంగా ఉండిపోయిన సురేష్‌తో ఒక ఆర్టిస్ట్, "మీరు ఎక్కడ నుంచి వచ్చేరు? " అని తెలుగులో ప్రశ్నించేడు.

పచ్చివెలక్కాయ గొంతులో కూరుకుపో యినట్లయింది సురేష్‌కి.

తేరుకుని,

"విశాఖపట్నం" అని సమాధానమిచ్చేడు.

"నేను కొన్నాళ్ళు విశాఖపట్నంలో పనిచే సేను. ఆ రోజుల్లో రాజేశ్వరీ టాకీస్ దగ్గర అద్దెకి ఉండేవాళ్ళం. మీవాళ్ళు ఎక్కడ ఉంటారు? " అని సంభాషణని కొనసాగిం చేడు ఆ ఆర్టిస్ట్.

"నాకు సరిగ్గా జ్ఞాపకం లేదు. డైరీలో ఎడ్రసు ఉంది. నేను విశాఖపట్నం వెళ్ళి చాలాకాలమైంది" అని ఇంగ్లీషులో జవాబి చ్చేడు సురేష్.

సురేష్‌వేపు విచిత్రంగా చూసి, ఖాళీ కాఫీ గ్లాసుని చెత్తడబ్బాలో వేసి, "మళ్ళీ కలుద్దాం'' అంటూ స్టేజ్‌వేపు కదలివెళ్ళేడు ఆ ఆర్టిస్ట్.

రవ్వంత చిన్నతనం వేసింది సురేష్‌కి.

మరొక గంటన్నరసేపు కచేరీసాగేక, అందరూ ఇళ్లకు మళ్ళేరు.

పక్కమీద నిద్రపట్టక కదులుతున్న సురే ష్‌కి సాయంకాలం జరిగిన సంభాషణ తిరిగి జ్ఞాపకానికి వచ్చింది.

ఆ కళాకారుడు "మీ వాళ్ళు విశాఖప ట్నంలో ఎక్కడ ఉన్నారు?" అన్న ప్రశ్నకి తన సమాధానం విన్నాక, ఆ వ్యక్తి తనవేపు వింతగా చూసేడు. ఆ చూపుకి ఎలా అర్థం చెప్పుకోవడం?

"అక్కడనుంచి వచ్చేక అందర్నీ మరచిపో యేవా? " అనా?

లేక "మీ బంధువుల ఉనికే తెలియ కుండా నీ జీవితం వెళ్తోందా? " అనా,

లేక, "సంస్కృతి, కట్టుబాట్లు, వేషభాషలే కాకుండా బంధువులనీ వదిలిపెట్టేవా? " అనా?

అమెరికాకి జనం అంతా వలసవచ్చిన వాళ్ళే, ముందువెనకా అంతే తేడా.

ఐదారు తరాలు వెళ్ళేంతవరకు ఆ వలస వచ్చిన జనం, పుట్టి పెరిగిన దేశంతో లేక బంధుమిత్రులున్న గడ్డతో, సాంప్రదాయాల్ని మరచిపోకుండా లింకులు వదలకుండా కాపాడుకుంటారు. తరాలు మారుతుంటే అవి మెల్లిగా సడలుతాయి.

కాని తన విషయంలో అలా కాదే. తను పుట్టినది ఆదేశంలో, దాదాపు పదేళ్ళ వరకు పెరిగిందీ అక్కడే. ఈ స్వల్పకాలంలో, గత పద్ధెనిమిది, పందొమ్మిదేళ్ళలో తనలో ఇంత మార్పుకు కారణం తల్లా? తండ్రా? లేక ఇద్దరూనా?

గతం తిరిగి కళ్ళముందర లీలగా నిలు చుంది.

తండ్రి ఇండియా ప్రజల గురించి, బంధు వుల గురించి తనకి చెప్పబోతే "అనవస రంగా వాడికి, కోడళ్ళని రాచి రంపానపెట్టే మీ అమ్మ గురించి, ఆ ముచ్చు జనం గురించి ఎందుకు చెబుతారు? వాడు



# పిచ్చోళ్ళుకాదు పెయింటర్లు



అమెరికాలోని
అంగవైకల్యం, మానసిక
వైకల్యం ఉన్న బాలుర
హాస్టల్ వార్డెన్ ఒకాయన
వారిచేత వేయించిన ఈ బొమ్మల్ని
ఎగ్జిబిషన్ పెడితే
ఒక్కొక్కటి 27 లక్షల రూపాయల
నుండి 36 లక్షలదాకా
అమ్ముడైపోయాయి.

సచిత్ర విచిత్రం

పెరిగి నివసించబోయేది ఈ దేశంలో. ఆ రొచ్చు, దారగుంటల గురించి వివరించడం అనవసరం" అంటూ మధ్యలో తల్లి కలుగ చేసుకునేది.

ఒకరోజు తల్లి ఇంటిలో లేనపుడు, "మీ అమ్మ అలా ఎందుకు మాటలాడుతుందో ఆమెకే తెలియాలి. పెళ్ళయ్యేక, ఆమె అత్త వారింట్లో ఉండడంకాని, వాళ్ళు నా దగ్గరకి వచ్చి ఉండడం కాని జరుగలేదు" అని సంజాయిషీ ఇవ్వబోయేడు తండ్రి.

తనకి తెలిసినంతవరకు ఇండియా వెళ్ళ డానికి తల్లి ఇష్టపడేదికాదు, పాత రోజుల గురించి ఆలోచించేది కాదు.

అందుకు తండ్రి భిన్నం. మూడు నాలు గుసార్లు ఒంటరిగా ఇండియా వెళ్ళివచ్చేడు.

గతాన్ని పూర్తిగా తుడిచిపెట్టి, మరచిపో దామని ప్రయత్నించిన తల్లి, ఆమె నిరంతర మాట విసుర్లకి నోరు తెరచే తండ్రి, తల్లితో వాదనకి దిగి గెలిచే ఓపికలేక ఊరుకుని, తనని ఈ పరిస్థితులకి తెచ్చేరు.

ఐర్లాండ్‌లో ఉన్న తన దూరపు బంధు వుల గురించి, వింతప్రదేశాల గురించి ఉత్సా హంగా కేతరీన్ చెబుతున్నపుడు, తను ఇండియా గురించి ఏమీ చెప్పకపోవడం కనిపెట్టి,

"నీకు నిన్ను గురించి, మీ వాళ్ళ గురించి ఏమీ తెలియదు. వాళ్ళ గురించి తెలుసు కుందామన్న ఉత్సాహంలేదు. కనీసం ఈ వేళయినా బాగా జ్ఞాపకం ఉంచుకో. లేక పోతే రేపటిలోకి వెళ్ళేసరికి, నీకు నీ గురించి తెలియని కాలం ఎక్కువైపోతుంది" అంది.

నిజమే! ఆనాడు కేతరీన్ మాటలని తను పట్టించుకోలేదు. కాని ఆ మాటల్లో నిజం మెల్లిగా తెలియవస్తోంది, అనుకుంటూ అస హనంగా పరుపుమీద అటూ ఇటూ కది లేడు.

కేతరీన్ విచిత్రమైన మనిషి! తనని కాదని, వెళ్ళిపోయిన కేతరీన్ జీవితాన్ని ఎలా వెళ్ళదీస్తోందో! అనుకుంటూ నిద్రలో నికి ఒరిగేడు సురేష్.



"పోస్టాఫీసుకి వచ్చి మీకు వచ్చిన రెండు పెద్ద పేకెట్లని తీసుకోవలెను" అన్న పోస్ట్ మెన్ కాగితం చూసి, "నాకు సామాన్లు పంపేదెవరు?" అని ఒక రోజంతా ఆశ్చర్య పోయేడు సురేష్.

"మీడేడీ, నేను ఒకచోట పనిచేసేవాళ్ళం. రెండు సంవత్సరాలక్రితం నేను పనిచేస్తున్న దగ్గర నుంచి సెలవు తీసుకుని ఆస్ట్రేలియా వెళ్ళి ఈ మధ్యనే తిరిగి వచ్చేను. మీడేడీ చనిపోయినందుకు విచారంగా ఉంది. మీడేడీ, తన ఇల్లు అమ్మినపుడు, ఎపార్ట్‌మెం ట్‌లో ఖాళీలేకపోతే, పేక్ చేసిన రెండు పేకెట్లని నా దగ్గర వదిలేరు. ఆ సామాన్లని పంపుతున్నాను" అంటూ డేవిడ్ నికల్సన్ రాసిన ఉత్తరం చదివేక, సామాన్ల గురించి వివరాలు తెలిసేయి.

పోస్టాఫీస్ నుంచి తెచ్చిన కార్డ్‌బోర్డ్ పెట్టె లని విప్పేడు సురేష్.

ఒకదాన్లో తన చిన్నప్పటి పుస్తకాలు, స్కూలులో వచ్చిన సర్టిఫికేట్లు, పొట్టయిపో యిన బట్టలు వగైరా ఉన్నాయి.

ఆ సామాన్లని అంత భద్రంగా తండ్రి ఎందుకు దాచేడో అవగాహన అవలేదు సురేష్‌కి. రెండవ పెట్టెలో మూడు ఫొటో ఆల్బంలు, ఉత్తరాల కట్టలు, పాతడైరీలు

ఉన్నాయి. తండ్రి డైరీ రాస్తుండగా తను ఎప్పుడూ చూడలేదు అనుకున్నాడు సురేష్. అవి పాతికేళ్ళ క్రితం డైరీలు. వాటిని పక్క

కినెట్టి, ఫొటో ఆల్బంని చేతిలోనికి తీసుకుని పేజీలని తిప్పసాగేడు.

బ్లేక్ అండ్ వైట్‌లో తీసిన ఫొటోలు చాలా ఉన్నాయి.

ఫొటోలక్రింద వ్యక్తుల పేర్లు, ఫొటో తీసిన తారీకులు వేసి ఉన్నాయి. ఐదారేళ్ళక్రితం తీసిన కలర్ ఫొటోలలో, చిన్నాన్న, అత్తల ఫొటోలే కాకుండా వాళ్ళ పిల్లల ఫొటోలు కూడా ఉన్నాయి.

పెరటిలో నిలబడి తీయించుకున్న ఫొటోలు.

సగం సిగ్గుపడుతుంటే తీసిన ఫొటోలు.

అందరూ కలిసి ఉన్న గ్రూప్ ఫొటోలు.

ఆఖర్న చేర్చిన ఫొటోలను బట్టి చిన్నాన్న వయస్సు దాదాపు ఏభై అని, అత్త వయస్సు అంతకు మూడు నాలుగేళ్ళు ఎక్కువని అంచనా వేసేడు సురేష్.

ఆల్బంని మూసి ఆలోచనలో పడ్డాడు.

గజిబిజిగా మస్తిష్కంలో దాగుకుని ఉన్న మొహాలతో, ఆల్బంలో ఉన్న మొహాలని జతపరచ ప్రయత్నించేడు సురేష్. అది సాధ్యపడలేదు.

తండ్రితో రక్తం పంచుకున్న చిన్నాన్న, అత్తలు తనకి పూర్తిగా అపరిచితులని, ఆల్బం చూడగా తెలియవస్తోంది. న్యూయార్క్‌లో రోడ్డుమీద ఆ ఇద్దరూ ఎదురుపడినా తను వాళ్ళని పోల్చగలిగేవాడు కాదు! బంధువుల గురించి సంభాషణ వచ్చినపుడు కేతరీన్ చేసిన విమర్శ సమంజసం అనుకున్నాడు సురేష్.

తల్లి మాటలకి భయపడి, తండ్రి బంధువుల గురించి చెప్పనందుకు రవ్వంత కోపం వచ్చింది.

తండ్రి ముభావత్వం, తల్లి విసుర్లు మరో సారి జ్ఞాపకానికిరాగా తల పట్టుకుని, ఆల్బంలని తిరిగి పెట్టెల లోనికి చేర్చేడు.

రెండవ పెట్టెలో ఉన్న డైరీలని చేతిలోనికి తీసుకుని గమనించసాగేడు.

పందొమ్మిదవ ఏటనుంచి రాయడం మొదలెట్టిన తండ్రి డైరీలు ఇరవై తొమ్మిదవ ఏడు రాగానే ఆగిపోయేయి. అంటే పెళ్ళయిన రెండు సంవత్సరాలకి ఆగేయి. కాని వాటిని తండ్రి పదిలంగా ముప్పయిఏళ్ళు దాచేడు!

డైరీలని ఒక వరుసక్రమంలో ఉంచి మళ్ళీ ఆలోచనలోపడ్డాడు సురేష్.

"ఇంకొకరి డైరీలు చదవకూడదు" అన్నది అందరికీ తెలిసినదే. కాని అది బ్రతికి ఉన్న వ్యక్తులకే వర్తిస్తుంది.

"వ్యక్తులని అర్థంచేసుకోవాలంటే, మనిషి ఆంతరంగిక ఆలోచనల్ని, ఊహలని, తెలుసుకోవాలంటే అతని డైరీలు చదవాలి" అన్నారు ఇంకెవరో.

తన డైరీలు ఇతరులు చదవకూడదు. చదివితే దానివల్ల హాని సంభవిస్తుంది అన్నది తన తండ్రి అభిమతమైతే వీటిని నాశనం చేసి ఉండేవాడు. అలా కాకుండా ఇలా దాచిఉంచడం, వాటి ప్రాముఖ్యతని చెబుతున్నాయి.

ఈ డైరీలకి హక్కుదార్లు ఎవరూ లేరు, వీటిని చదవడం వలన ఎవరికీ నష్టంలేదన్న నిర్ధారణకి వచ్చి, అన్నిటికన్నా పాత డైరీని విప్పేడు సురేష్.

★ ★ ★

"ఏమిటి సురేష్, నే విన్నది నిజమేనా?" అనడిగేడు రామకృష్ణ.

"ఏ విషయం?" అని తిరిగి ప్రశ్నించేడు సురేష్.

"నువ్వు ఉద్యోగానికి రాజీనామా చేసేవని విన్నాను"

"అవును, నిజమే"

"ఏం జరిగిందేమిటి?"

"నాలో కమ్యూనికేషన్ స్కిల్స్ లేవంటూ నన్ను పక్కకినెట్టి, నాకంటే జూనియర్లని, తక్కువ క్వాలిఫికేషన్ ఉన్న వ్యక్తులని ప్రమోట్ చేసేరు. ఆరునెలలక్రితం నేను చేస్తున్న ఇదే పనికి ప్రత్యేకంగా జీతం పెంచిన కంపెనీ ఇలా రంగు ఫిరాయిస్తుందని నేను ఊహించలేదు. అందుకే ఈ కంపెనీ వదలి శాన్‌ఫ్రాన్సిస్కో వెళ్ళిపోతున్నాను"

"అక్కడకి ఎప్పుడు వెళ్ళి ఎందులో చేరబోతున్నావు? "

"ఇక్కడ పదిహేను రోజులలో ఉద్యోగం ముగుస్తుంది. తరువాత ఆరునెలలపాటు ఇండియా వెళ్ళి బంధువులని, ప్రదేశాలని చూసి, తిరిగి వచ్చేక కొత్త కంపెనీలో చేరుతాను. ఆ నిబంధనమీదే ఆ కంపెనీలో చేరడానికి ఒప్పుకున్నాను" అని వివరించేడు సురేష్.

"సడన్‌గా ఇండియా వెళ్తున్నావు, ఆరునెలలు అంటున్నావు, పెళ్ళి ట్రిప్పా ఏమిటి? '' అని పరిహాసమాడేడు రామకృష్ణ.

"అబ్బే! అలాంటిదేమీలేదు. ఈ దేశంలో ఒక్కసారి నాలుగైదు వారాలకంటే సెలవు దొరకదు కదా. ఇక్కడ, ఇప్పుడు నా గురించి పట్టించుకునే వాళ్ళు ఎవరూ లేరు కాబట్టి, ఈ అవకాశాన్ని ఉపయోగించుకుంటున్నాను. లంచ్‌కి టైమయింది, కేఫిటీరియాకి వెళ్దాం పదా" అంటూ లేచేడు సురేష్.

"నువ్వు అమెరికన్ పౌరసత్వం పుచ్చుకున్నావు కాబోలు, ఇండియా వెళ్ళడానికి వీసా కావాలి. అప్లికేషన్ ఇండియన్ ఎంబసీకి పంపేవా? " అనడుగుతూ కేఫిటీరియాలో ఖాళీ టేబిల్ మీద సర్దుకున్నాడు రామకృష్ణ.

"రేపో, ఎల్లుండో పంపుతాను" అంటూ రామకృష్ణకి ఎదురుగా కూర్చున్నాడు సురేష్.

"నువ్వు ఇండియా వెళ్ళి ఎంత కాలమైంది? "

"పదిహేనేళ్ళయింది. ఇపుడు అంతా గుర్తుపట్టలేనంతగా మారిపోయి ఉంటుంది"

"మారడమంటే అలా ఇలా కాదు. నువ్వు ఎయిర్‌పోర్ట్‌లోంచి బయటకి రాగానే ఒక్కసారి ఆ మార్పు నిన్ను కలవరపెట్టే అవకాశం ఉంది"

"చూద్దాం" అన్నాడు సురేష్.

"వచ్చే శనివారం మా ఇంటిలో తెలుగు వాళ్ళం కలుస్తున్నాం. నీకు అభ్యంతరం లేకపోతే రా"

"అభ్యంతరమేమీలేదు కాని, నీకు అనవసరమైన శ్రమ. అదీకాక నేను ఒంటరిపక్షిని. మిగతావాళ్ళంతా ఇబ్బందిగా ఫీలవుతారేమో! కేతరీన్ వెళ్ళాక నేను ఏ పార్టీలకీ వెళ్ళలేదు" అని తప్పించుకోబోయాడు సురేష్.

"నిన్ను బలవంతపెట్టలేననుకో. అయినా ఎన్నాళ్లు ఇలా ఇతరులతో కలవకుండా తిరుగుతావు? నువ్వు వస్తావనే ఆశిస్తున్నాను" అంటూ బలవంతపెట్టాడు రామకృష్ణ.

"నీకు తెలియదు. నేను కేతరీన్‌ని పెళ్ళి చేసుకుంటే నేను ఏదో ఘోరం చేసినట్టు ప్రజలు ప్రవర్తించేరు. కేతరీన్ నన్ను వదిలి వెళ్ళిందని తెలిసి, మంచి శాస్తి అయిందని చెవులు కొరుక్కోవడం చూశాను" అన్నాడు సురేష్.

"నువ్వు చెప్పినదాంట్లో నిజం ఉంది. మనవాళ్ళు అమెరికాలో నివశిస్తున్నారే కాని, ఆలోచనల్లో మార్పు రాలేదు ఇంకా. నీ ఇష్టం. నువ్వొస్తావనే ఆశిస్తున్నాను. వినుత నీ గురించి తరచూ అడుగుతుంటుంది" అన్నాడు రామకృష్ణ.

★ ★ ★

లంచ్‌నుంచి తిరిగివచ్చి పనిలో తలదూర్చినా, సురేష్ మనస్సు పనిలో లగ్నమవడంలేదు. ఆరేళ్లు ఒళ్లువంచి పనిచేసిన

కంపెనీ తనని నిర్లక్ష్యంగా వెనక్కి నెట్టిన ధోరణి జ్ఞాపకానికి రాగానే లోపలినుంచి కోపం తన్నుకువచ్చింది.

రాజీనామా ఇచ్చేడు కాబట్టి, తను పనిచేయకపోయినా ఫరవాలేదు అనుకుంటూ కాగితాలని దూరం తోసేడు.

జీతం తీసుకుంటున్నందుకు పనిచేయక పోతే ఎలా? అని పెద్ద మెదడు చిన్న మెదడుని పొడవడంతో కోపాన్ని అదిమిపెట్టి తిరిగి కాగితాలని అందుకున్నాడు సురేష్.

"కానీ నువ్వంటే నాకు అసహ్యం, నీకంటే ఎవరైనా నయం" అని 'రక్కేసి వెళ్ళిన ప్రియురాలిని మళ్ళీ దగ్గరకు తీసుకోవలసివచ్చినట్లు మొరాయిస్తున్న మనసు పనిచేయనని భీష్మించుకు కూర్చుంది.

ఏం చేయాలో తెలియక, కుర్చీలో అసహనంగా కదిలి మెల్లిగా ఆలోచనల్లోనికి కూరుకుపోయాడు.

అమెరికాలో ఉద్యోగాలు శాశ్వతం కావు. కంపెనీ ఉద్యోగుల్ని, పదిహేను, ఇరవైఏళ్ళు పనిచేసినా అవసరమైతే నిర్దాక్షిణ్యంగా ఉద్యోగాన్ని ఊడబెరుకుతుంది.

అలాగే ఉద్యోగులూ, కంపెనీ గురించి పట్టించుకోకుండా, ఎప్పుడు తమకి లాభదాయకమనిపిస్తే అప్పుడు అర్ధాంతరంగా, రాజీనామా ఇచ్చి వెళ్ళిపోతారు. కంపెనీ ఉద్యోగులమధ్య విశ్వాసం చాలా తక్కువ. ఒకే ఉద్యోగాన్ని అంటిపెట్టుకుని ఉండడం సామాన్యం కాదు.

ఉద్యోగ విషయంలోనే ఏమిటి, భార్యాభర్తల మధ్య బంధుత్వమూ అంతే!

కేతరీన్!

"ఇద్దరికీ ఇష్టమైతే కలిసి ఉందాం. లేకపోతే విడిపోదాం, దానిలో తప్పేమిటి? " అనేది. అన్నట్టుగానే, బేధాభిప్రాయాలు రాగానే సామరస్యానికి ప్రయత్నించకుండా "ఒక వస్తువు కిందపడుతుంటే, దానిని పడకుండా ఆపుచేసే ప్రయత్నంవలన కలిగే అనర్థం ఆ వస్తువు కిందపడినప్పుడు చేసే అనర్థం కంటే ఎక్కువ. ఇప్పుడు విడిపోయే కంటే మరికొన్నాళ్ళ తరువాత విడిపోతే, మనం శత్రువులుగా మారిపోతాం. ఒకర్ని ఇంకొకరు అసహ్యించుకుంటాం. అందుకే ఇది మంచిది" అంటూ వెళ్ళిపోయింది కేతరీన్.

★ ★ ★

ఆకాశాన్నంటుకుంటున్న న్యూయార్క్ బిల్డింగ్స్‌ని వదిలి, చిన్న హైవేమీదకి మళ్ళీ న్యూజెర్సీ రాష్ట్రంవైపు కారుని మళ్ళించాడు సురేష్.

న్యూయార్క్ పట్టణంనుంచి దూరంగా వెళ్తుంటే రోడ్లమీద కార్ల సాంద్రత తగ్గినా, రోడ్డుకి ఇరువైపులా చిన్న కట్టడాలూ, ఒకటి తరువాత ఒకటి ప్రతీ అరమైలు దూరంలో షాపింగ్ మాల్సూను. మాల్స్‌కి దగ్గరగా, వెనకాతల కొత్తగా వెలిసిన ఇళ్ళు, కొత్త ఇళ్ళు కట్టడానికి వాడుతున్న మెషీన్లు, ట్రాక్టర్లు కనిపిస్తున్నాయి.

అబ్బ! ఎంత త్వరితంగా మార్పు కనిపిస్తోంది. చెట్లని నేలకూల్చి ఇళ్లు ఎంత తొందరగా కట్టిస్తున్నారు. అనుకుంటూ రామకృష్ణ ఉంటున్న కౌంటీలోనికి కారు తిప్పాడు.

హైవేకి దూరంగా ఉన్న ఊరిలోనికి వెళ్తుంటే రోడ్డుకి ఇరువైపులా ఉన్న చిన్న చిన్న చెట్లు చిగురిస్తున్నాయి. చలికాలంలో మంచు ఎక్కువగా కురిసి, భూమంతా చెమ్మ నిండడంతో, వసంతం వచ్చి రెండు వారాలైనా చెట్లమీద ఆకులు చాలా చిన్నగా ఉన్నాయి.

హరితవర్ణాన్ని ప్రదర్శిస్తున్న కొమ్మలని అంటిపెట్టుకుని పెరుగుతున్న బుల్లి బుల్లి ఆకులు.

ఈ చెట్లనీ త్వరలో పడగొట్టేస్తారేమో అని మథనపడుతూ, కారుని రోడ్డుమీద ఆపి, రామకృష్ణ ఇంటి గుమ్మంలో నిలబడి కాలింగ్‌బెల్ నొక్కాడు సురేష్.

తలుపు తెరచి, "హలో సురేష్, లోపలికి రా" అంటూ ఆహ్వానించింది వినుత.

"ఏమిటి ఇంకా ఎవరూ రాలేదా? నన్ను ఆరున్నరకి రమ్మని రామకృష్ణ చెప్పాడు" అంటూ ఖాళీగా ఉన్న డ్రాయింగ్‌రూమ్‌వేపు చూస్తూ, కాలికి ఉన్న మట్టిని తుడుచుకున్నాడు సురేష్.

"ఆరున్నరకి పార్టీ - అంటే ఆరున్నరకి వచ్చేస్తే తమ ప్రాముఖ్యత మరుగుపడుతుందని ఏడుంబావు ఏడున్నరకి వస్తారు. ఎవరో నీలాంటివాళ్లు తప్ప టైముకి ఎవ్వరూ రారు. నాకు ఇంకా వంటింటిలో పనివుంది, నువ్వు సోఫాలో కూర్చుని పేపరు చూడు" అంటూ వంటింటిలోనికి వెళ్ళింది వినుత.

సోఫాలో కూర్చుని పేపరు అందుకున్నాడు.

అరగంట గడిచాక తలుపు తోసుకుని మంచి దుస్తులలో ఉన్న వ్యక్తి లోపలికి వచ్చి, సోఫాలో సురేష్‌కి ఎదురుగా చతికిలబడి,

"రామకృష్ణా, ఐయామ్ హియర్" అని అరిచేడు.

"నా పేరు సురేష్. నేను న్యూయార్క్ ఫారెస్ట్ హిల్స్‌లో ఉంటాను" అంటూ తనని తాను పరిచయం చేసుకున్నాడు సురేష్.

"అయామ్ డాక్టర్ పారాల. నేను ఇ.ఎన్.టి. స్పెషలిస్ట్‌ని. ఇక్కడకి దగ్గరగా ఉన్న రెడ్ బేంక్‌లో నా ప్రాక్టీస్" అంటూ సురేష్ చాచిన చేతితో చేయిని కలిపేడు డాక్టర్ పారాల.

"ఆయన చిప్సు వగైరా తీసుకురావడానికి వెళ్లారు. అరగంటయింది వెళ్ళి, ఇప్పుడే వచ్చేస్తారు" అంది వినుత, భర్త ఇంటిలో లేకపోవడానికి కారణాన్ని చెబుతూ.

తన చేతికున్న బంగారపు వాచీవేపు చూశాడు డాక్టర్ పారాల. తన కాలం చాలా విలువైనదన్న భావనని ప్రదర్శిస్తూ.

"ఆవిడ రాలేదా? " అనడిగింది వినుత.

"నేను తిన్నగా క్లినిక్‌నుంచి వచ్చేను. ఇంటినుంచి ఆవిడ పిల్లల్ని తీసుకుని వస్తుంది" అని సమాధానమిచ్చి రెస్ట్‌రూంలోనికి వెళ్ళాడు డాక్టర్ పారాల.

జె.సి. పెన్నీలో నాలుగువందలు ఖరీదు చేసే బూడిదరంగు సూటు, తెల్లని షర్ట్, చేతులకి బంగారపు కఫ్ లింక్స్, సూటుకి మేచయిన ఖరీదైన టై, ఫ్లోర్‌షమీ జోళ్లు, చేతికి బంగారపు గొలుసులో ఉన్న ఒమేగా వాచీ, పేంటుకి తగిలించిన పేజర్, వెంకటేశ్వరస్వామి బొమ్మతో ఉన్న ఉంగరమే కాకుండా చేతివేళ్ళకి ఉన్న రాళ్లు పొదిగిన ఉంగరాలు చూడగానే సురేష్‌కి, డాక్టర్ పారాల బాగా ధనవంతుడని అర్థమైంది. ఏకాంతాన్ని చెదరగొడుతూ, లోపలికి ప్రవేశించి, రెస్ట్ రూంలోంచి తిరిగివచ్చిన డాక్టర్ పారాలని సురేష్‌ని చూసి,

"ఇప్పుడే వస్తానని" తెచ్చిన సామాన్లని డైనింగ్ టేబిల్ మీదకి చేర్చాడు రామకృష్ణ.

"ఇతను సురేష్, ఈయన..." అని రామకృష్ణ పరిచయం మొదలుపెట్టబోతుంటే,

"మమ్మల్ని మేం పరిచయం చేసుకున్నాం" అన్నాడు సురేష్.

"సురేష్ త్వరలో ఇండియా వెళ్ళబోతున్నాడు. మీరు మాట్లాడుతూ ఉండండి, టేబిల్ మీద ప్లేట్లని అమర్చి వస్తాను" అని కదిలివెళ్ళాడు రామకృష్ణ.

"మలేరియా హెపటైటిస్ నివారణకి, షాట్స్ తీసుకున్నారా? వేసవిలో వెళ్తున్నారు, అక్కడ నీళ్ళకి ఎద్దడి. ఎక్కడ చూసినా గేస్ట్రో ఎంటరైటిస్. ఫిల్తీవాటర్. జాగ్రత్త. ఎన్నాళ్లకి వెళ్తున్నారు? " అంటూ సంభాషణని ఆరంభించేడు డాక్టర్ పారాల.

"చాలా కాలం తరువాత వెళ్తున్నాను. నేను అక్కడ ఎన్నాళ్లు ఉంటానన్నది అక్కడ పరిస్థితులమీద ఆధారపడి ఉంటుంది. బహుశా ఐదారునెలలు ఉంటానేమో"

"ఐదారునెలలే? ? "

"మీరు ఎన్నాళ్ళకి వెళ్తారు? ఎక్కడెక్కడికి వెళ్తారు? "

"మూడువారాలకి మాత్రమే వెళతాను. అంతకన్నా ఎక్కువయితే, ఇక్కడ నా పేషెంట్లకి ఇబ్బంది. పేషెంట్లని చూడకపోయినా, స్టాఫ్‌కి జీతాలు, ఆఫీసుకి అద్దె, మెషిన్లకి కట్టవలసిన వాయిదాల డబ్బు, వగైరా ఖర్చులుంటాయి. మూడు వారాల ఇండియా ట్రిప్‌వలన నాకు సుమారు ఇరవై వేల డాలర్ల నష్టం. నేవెళ్తే, సాధారణంగా హైదరాబాదులో మా తోడల్లుని ఇంటిలో ఉంటాను. ఆయన ఇల్లు ఎయిర్‌కండిషన్డ్ కాబట్టి వసతిగానే ఉంటుంది. నాకున్న దగ్గర బంధువులు అక్కడికే వచ్చి నన్ను కలుస్తారు" అంటూ వాచీవేపు మరోసారి చూశాడు డాక్టర్ పారాల.

రామకృష్ణ, సురేష్, డాక్టర్ పారాలని సమీపించి,

"బీర్, విస్కీ, బ్రాందీ, జిన్, ఆరంజ్ జ్యూస్, కోక్‌లు ఉన్నాయి. మీరేమిటి తీసుకుంటారు? " అనడిగాడు.

"ఐ విల్ హేవ్ ఎ స్కాచ్ ఆన్‌ది రాక్స్" అన్నాడు డాక్టర్ పారాల.

"బీర్" అన్నాడు సురేష్.

డ్రింక్స్ తీసుకురావడానికి వెళ్ళి, రెండు నిమిషాల తర్వాత తిరిగి వచ్చి డ్రింక్స్ అందిచ్చేడు రామకృష్ణ. బీరు చప్పరిస్తూ, పార్టీకి వచ్చిన ఆహ్వానితులని గమనించసాగాడు సురేష్.

రామకృష్ణ ఎంతమందిని ఆహ్వానించేడో తెలియదుకాని, అప్పటికే ఐదు కుటుంబాలు వచ్చాయి.

ఆడవాళ్ళందరూ ఒకచోట, మగవాళ్లు ఇంకొకచోట కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారు. భూమికింద ఉన్న బేస్‌మెంట్‌లో పిల్లలంతా చేరి హుషారుగా గెంతుతూ, టెలివిజన్ చూస్తున్నారు.

"మీ పార్టీలు విచిత్రంగా ఉంటాయి. ఆడాళ్ళంతా ఒకగదిలో, మగాళ్లు ఇంకో గదిలో సర్దుకుంటారు" అన్న కేతరీన్ వ్యాఖ్య గుర్తుకువచ్చింది సురేష్‌కి.

కేతరీన్‌కి ఈ రకం పార్టీలంటే నచ్చేది కాదు.

"కూరల్లో, సూపుల్లో కారం తెగదంచేస్తారు. డిసర్ట్ అంటూ పంచదార పానకంలో ముంచిన స్వీట్లని ఇస్తారు" అనేది ఇండియన్ తిండి గురించి.

అమెరికన్ చప్పిడి తిండికి అలవాటుపడిన కేతరీన్, ఇండియన్ తిండి ఏమాత్రం తిన్నా నాలుక బయటికిపెట్టి నీళ్లకోసం పరిగెత్తేది.

తనకి తెలిసిన ఇండియన్ కుటుంబాలని, ఇంటికి డిన్నర్‌కి పిలవడానికి ఇష్టపడేది కాదు. దాంతో ఇతర ఇండియన్ కుటుంబాల ఇంటికి తాము భోజనానికి వెళ్ళడం నిలిచిపోయింది. కేతరీన్‌తో పరిచయం ఉన్న అమెరికన్లని ఆమె భోజనానికి ఆహ్వానిస్తే, తను ఆ కంపెనీలో ఇమడలేక అవస్థ పడేవాడు.

ఇద్దరికీ రాజీకురదకపోవడంతో, తాము ఎవరింటికీ పార్టీలకి వెళ్లేవారు కాదు. అయినా దానికి తనే కారణమని నిందించేది కేతరీన్.

"ఈయన డాక్టర్ సంపెంగి", "ఇతను సురేష్" అంటూ డాక్టర్ పారాల చేసిన పరిచయం సురేష్‌ని తిరిగి పార్టీ లోకంలోనికి తెచ్చింది.

కరచాలనం అయ్యేక డాక్టర్ సంపెంగి, డాక్టర్ పారాల ప్రక్కని సర్దుకున్నాడు.

రామకృష్ణ వచ్చి డ్రింక్‌ల దండకం వల్లించి, డాక్టర్ సంపెంగి అడిగిన డ్రింక్ తీసుకురావడానికి వెళ్ళాడు.

"నేను ఈ ప్రాంతానికి వచ్చి ఒక సంవత్సరమైంది. మీరు ఈ ప్రాంతానికి కొత్తా? '' అనడిగేడు డాక్టర్ సంపెంగి సురేష్‌ని.

"నేను న్యూయార్క్‌లో ఉంటాను. రామకృష్ణా నేను ఒకే కంపెనీలో పనిచేస్తాం. ఆరేళ్ళయింది న్యూయార్క్‌కి వచ్చి"

రామకృష్ణ వచ్చి డాక్టర్ సంపెంగి చేతికి డ్రింక్ అందించేడు. డ్రింక్ అందుకుని ఒక పెద్ద గుక్కవేసి,

"మీ ఇంటి పేరు ఏమిటి? " అనడిగేడు సురేష్‌ని.

తన ఇంటిపేరు తెలుసుకోవలసిన అవసరం ఏమిటా? అని ఆశ్చర్యపడుతూ, "మాధవ్" అన్నాడు సురేష్. సురేష్‌వేపు విచిత్రంగా చూసి, "అదేం ఇంటి పేరు? నేనెప్పుడూ వినలేదే" అంటూ ఆశ్చర్యం ప్రకటించాడు డాక్టర్ సంపెంగి.

ఏం సమాధానమివ్వాలో తెలియక, 'ఏమో' అన్నట్లుగా భుజాలెగరేసేడు సురేష్.

డాక్టర్ సంపెంగి నుదుటని మెలుచుకు వచ్చిన ముడుతలు, అతను తీవ్రమైన ఆలోచనలో పడ్డాడని తెలిపాయి. మరొక గుక్క డ్రింక్ పట్టించి, "మీరు ఇండియాలో ఎక్కడికి వెళతారు? మీ బంధువులు ఎక్కడెక్కడ ఉన్నారు? " అని తిరిగి పృచ్ఛించి చూస్తూ సురేష్‌ని ప్రశ్నించాడు.

"ఢిల్లీ, హైదరాబాదు, విశాఖపట్నం"

ఒక్కసారి, డ్రింక్ చేదైనట్టే మొహంపెట్టి ముందరకి వంగి టేబిల్‌మీదున్న చిప్స్ అందుకున్నాడు డాక్టర్ సంపెంగి.

"ఐదు నెలలు ఇండియాలో ఎలా గడుపుతారు. విసుగేయదూ? " అని టాపిక్ మార్చేడు డాక్టర్ పారాల.

"ఇండియా గురించి, ఆంధ్రప్రదేశ్ గురించి మా డేడీ డైరీలలో రాసినది చదవడమేకాని నేను చూడలేదు. ఇంతవరకూ సాధ్యపడలేదు. మన దేశం ఎలా ఉందో చూద్దామని వెళ్తున్నాను"

"ఈ డైరీలు రాయడం ఒక బూటకం. డైరీలలో నిజంకంటే కల్పనే చాలా ఎక్కువ. ఆంధ్రాలో అన్నింటికీ రిజర్వేషన్లే. అంతా కంగాళీ! మీరే చూస్తారుగా ఎంత అధ్వాన్నంగా ఉందో"

"మీరు ఇండియా వెళ్తే, మీరు చదువుకున్న కాలేజీకి వెళ్లి, అక్కడ ప్రొఫెసర్లని చూస్తారా? " అనడిగేడు సురేష్.

"సర్లెండి. అది ఒక కాలేజీనా? అవి పందులదొడ్లు. ఇహ ప్రొఫెసర్లు! వాళ్ళెవరికీ పొట్ట చించితే అక్షరం రాలదు. కనీసం బట్టలైనా సరిగ్గా ధరించడం రాదు. ఈ దేశంలో ఉన్న ప్రొఫెసర్లని చూడండి, ఎంత పోలిష్డ్‌గా ఉంటారో? అమెరికాలో ఉన్న డాక్టర్లతో పోల్చిచూస్తే వాళ్లు ఏభైఏళ్లు వెనకబడి ఉన్నారు" అన్నాడు డాక్టర్ సంపెంగి అతిశయాన్ని ప్రదర్శిస్తూ.

"అక్కడ ప్రొఫెసర్లకి ప్రాక్టికల్ నాలెడ్జి లేదు. ఎంతసేపు సోడా కొట్టడమే" అని వంతపాడాడు పారాల. గోల్డ్‌ఫ్రేమ్ కళ్ళద్దాలతో, ఖరీదైన సూట్లలో, ఆరోగ్యంగా కనిపించే పారాల సంపెంగిల ధోరణి చూసి ఆశ్చర్యంతోపాటు విచారమేసింది సురేష్‌కి.

"వాళ్లకి ఉన్న విజ్ఞానం మాట ఎలాగున్నా, ఈ దేశం రావడానికి పునాదిని ఇచ్చిన ఆ కాలేజీని చూడాలనిపించదూ? "

"అదంతా ఆవుపేడ, అర్థంలేని సెంటిమెంట్" అని డాక్టర్ సంపెంగి, డాక్టర్ పారాలతో కబుర్లలోపడ్డాడు.

"మీరు నేచెప్పినట్టు సర్జిటెక్ కంపెనీ షేర్లు కొన్నారా? "

"ఆ!"

"ఎన్ని కొన్నారేమిటి? "

"వెయ్యి"

"అదేం, రెండువేలు కొంటారనుకున్నాను"

"ఒక్కసారి ముప్ఫయివేల డాలర్లుగదా అని ఆలోచించాను"

తమకి అవసరమైన విద్యని ఆపాదించి, ఈ దేశం వలసరావడానికి కారణమైన మేష్టర్లని, కాలేజీని నిరసించడం చూసి, ఇబ్బందిగా వాళ్ళ సంభాషణ కాస్సేపు విని, భరించలేక, లేచి నిలబడి రామకృష్ణ దగ్గరకి నడిచేడు సురేష్.

రావల్సిన వాళ్ళందరూ వచ్చేరని నిర్ధారణ య్యాక, రామకృష్ణ ప్రకటించాడు.

"టేబిల్ మీద పదార్థాలన్నీ అమర్చి ఉన్నాయి. ఎవరికి ఆకలిగా ఉంటే వాళ్ళు వచ్చి వడ్డించుకోవచ్చు"

"రామకృష్ణా, ఈ ఇల్లు చిన్నదైపోయింది. కాస్త పెద్ద ఇంటిలోనికి మారకూడదూ? ఫ్రీగా ఉంటుంది" అన్నాడు పారాల.

వాళ్ళ గ్లాసులు ఖాళీగా ఉండడం చూసి, రామకృష్ణ కొత్త డ్రింక్స్ తీసుకువచ్చి అంది స్తుంటే, "థాంక్స్" అంటూ రెండవ రౌండ్ డ్రింక్స్ అందుకున్నారు.

సురేష్ చేతులు కడుక్కోవడానికి డాక్టర్ పారాల, డాక్టర్ సంపెంగిలు కూర్చున్నచో టుకి దగ్గరగా ఉన్న రెస్ట్‌రూం లోనికి వెళ్ళాడు. బయట సందడిగా ఉన్నా, బాత్రూం తలుపు పూర్తిగా పడకపోవడంతో వాళ్ళ సంభాషణ, లోపలున్న సురేష్‌కి విని పిస్తోంది.

"ఏమిటి గురూ ఆ పేరు? ఇతను అస్మ దీయుడా? తస్మదీయుడా?"

"ఏమో గురూ, నాకూ తెలియడంలేదు. రామకృష్ణని అడిగితే తెలుస్తుంది"

"మనవాడు కాదు గురూ, కాకపోతే మరీ



అంత ముభావంగా కూర్చుంటాడేమిటి? "

శబ్దం చేసుకుంటూ తలుపు తెరిచి బైటకి వచ్చి, డైనింగ్ టేబిల్ మీదున్న ప్లేటుని అందుకుని, దానిలోనికి పదార్థాలని వడ్డించు కున్నాడు సురేష్.

సురేష్ బైటకి రాగానే, డాక్టర్ పారాల, డాక్టర్ సంపెంగిల సంభాషణ ఆగింది.

అందరూ తిండి తినడంలో నిమగ్నులవ డంతో రణగొణ ధ్వని తగ్గి, రెండవ గదిలో ఉన్న స్త్రీల సంభాషణ వినపడుతోంది.

"మేం ఆటోమేటిక్ స్ప్రింక్లర్లని పదివేల ఖర్చుతో పెట్టించుకున్నాం. మొక్కలకి, లాన్‌కి నీళ్లు పెట్టడం బెడదపోయి, ప్రాణం హాయిగా ఉంది. మేం ఉన్న పేటలో అదే మొదటిది" అని పక్కని నిలబడ్డ స్త్రీతో చెబుతూ రెండు పూరీలని ప్లేటులో వేసుకుంది ఒక స్త్రీ.

"ఏమండీ వింటున్నారా? రాధావాళ్ళు ఆటోమేటిక్ స్ప్రింక్లర్స్‌ని పెట్టించుకున్నారట, పదివేలు అయిందిట. అన్నట్టు చెప్పడం మరచిపోయాను, మధ్యాహ్నం ఆ మెర్సిడెస్ బెంజ్ డీలరు ఫోన్ చేశాడు, మీరు కొత్త కారు కొంటానన్నారటగా" అంది రెండవ స్త్రీ.

గుర్రుగా చూసింది మొదటి స్త్రీ.

రాత్రి పదిన్నరకి పార్టీ ముగిసింది. సురేష్ తప్ప ఇతరులందరూ ఇళ్ళకు మళ్లారు.

రామకృష్ణ, సురేష్‌లు సాయం చేస్తుంటే, వినుత మిగిలిపోయిన పదార్థాలని ఫ్రిజ్‌లో నికి చేర్చి, వాడిన ప్లేట్లని, ఇతర సామాన్లని కడిగి, వంటింటిని ఒక కొలిక్కి తెచ్చింది. రామకృష్ణ, సురేష్‌లు హాలులోని, బేస్‌మెం ట్‌లో ఉన్న సోఫాలని, కుర్చీలని వాటి పాత స్థానాలకి చేర్చారు.

"అమ్మయ్య, ఇంకో ఏడు ఎనిమిది వారా లవరకు ఈ గొడవలేదు" అంది వినుత చెయ్యి తుడుచుకుంటూ.

"ఒకవిధంగా నువ్వు అదృష్టవంతుడివి. ఈ దరిదాపులలో ఏడెనిమిది కుటుంబాలు, ఒకవారం ఒకరింట్లో తరువాత వారం ఇంకొకరింట్లో కలుస్తాం. నాటకం అంతా అదే. ప్రదేశం మార్పు అన్నట్లు, ఆ ఆరేడు కుటుంబాలే కలుస్తాయి. ఇది ఒక రొటీన్ అయింది. మన సంగతి ఎలాగున్నా పిల్ల లకి తన దేశపద్ధతుల గురించి తెలియా లంటే ఇది తప్పదు" అన్నాడు రామకృష్ణ.

"డాక్టర్ సంపెంగి ఇచ్చిన సలహా పాటించి ఇంతకన్నా పెద్ద ఇల్లు కొంటావే మిటి? "

"ఈ ఇంటికే మేం వాయిదాల డబ్బు కట్ట డానికి ఇరకాటంలో పడుతుంటాం. పిల్లల చదువులకి డబ్బు కావాలి. ఈ ఇల్లు మాకు చాలు. ఈ దేశంలో సుఖాలు అమర్చుకోవా లంటే భార్యాభర్త ఇద్దరూ పనిచేయాలి" అంది వినుత.

"ఇండియానుంచి వచ్చిన చాలామంది డాక్టర్లు, తాము ఇతరులకంటే ఉన్నతుల మని అనుకుంటారు. హార్ట్ స్పెషలిస్ట్, సర్జన్లు తాము ఇంకా గొప్పవాళ్ళం అనుకో వడం చూశాను. డాక్టర్ల భార్యలకి అట్టే క్వాలిఫికేషన్ లేకపోయినా, భర్తల ఆఫీ సులో చేరి, దండిగా జీతాలు లాగేస్తారు" అన్నాడు రామకృష్ణ.

"ఆయనకి నిద్ర వస్తోంది, మీరు లెక్చర్ ఆపండి" అని, "థాంక్స్ ఫర్ ది హెల్ప్ సురేష్, గుడ్‌నైట్" అంటూ లేచివెళ్ళింది వినుత.

"రేపు ఆదివారం కాబట్టి పొద్దున్నే ఉర కలూ, పరుగులూ పెడుతూ లేవనక్ఖరలేదు. ఇది నీ పడకగది" అంటూ గది చూపించి వినుత వెనకాల వెళ్లాడు రామకృష్ణ.

బట్టలు మార్చుకుని పక్కమీదకి ఒరిగిన సురేష్ ఆలోచనలో పడ్డాడు.

"అవకాశం దొరికి నేను ఈ దేశం వచ్చాను. అవకాశం రాకో, లేక ఇంకే ఇతర కారణాలవలనో చాలామంది,

నాకంటే తెలివైనవాళ్లు, మేధావులు అక్కడ ఉన్నారు. కొందరు దానిని మరచి, గురి వింద గింజలా, తామే మేధావులమని తమ నితామే మోసపుచ్చుకుంటారు. "ఈ దేశం వచ్చాక ఇండియాని విమర్శించడం ఒక ఫేషన్" అన్నాడు తండ్రి తనతో ఒకసారి.

ఇండియా గురించి తనకి ఏమైనా తెలిసి నదంటూ ఉంటే అది తండ్రి ద్వారానే సంక్ర మించింది.

తండ్రి ఊహలు నిష్పాక్షికమే అయినా కాకపోయినా, ఈ డాక్టర్ల ధోరణి తనని ఇబ్బంది పెట్టింది.

"తమ భర్తలు గొప్పలు చెప్పుకోవడానికి తప్పిస్తే, ఆ పార్టీకి వచ్చిన చాలామంది స్త్రీలకి ఇంకేమీ సంగతులు లేవు" అంది కేతరీన్ ఒకసారి, పార్టీనుంచి తిరిగివస్తూ.

"ఇండియన్ కల్చర్‌లో అది ఒక భాగమా?" అని నిలదీసింది కూడా.

తను ఏం సమాధానమివ్వగలడు?

అది అలా ఉండగా, ఆ డాక్టర్లకి తన ఇంటిపేరు వివరాలతో అంత ఆసక్తి ఎందుకు? అని ఆశ్చర్యపడుతూ నిద్రలో నికి జారేడు సురేష్.



"మరీ అవసరమైతే తప్ప నేను న్యూయార్క్‌లో కారు నడపను. తెగరద్దీ. నీ గది నుంచి జాక్సన్ హైట్స్ వెళ్ళడానికి మెట్రోలో వెళ్తే మహాఅయితే అరగంటవుతుంది. ఇప్పుడు ఈ ట్రాఫిక్‌జామ్‌నుంచి బయటపడడానికి ఎంతసేపు పడుతుందో?" అన్నాడు రామకృష్ణ.

"నేను నీతో పూర్తిగా ఏకీభవిస్తాను. నాలుగు ప్రదేశాలకి వెళ్ళవలసి ఉన్నా, బరువైన సామాన్లు ఉన్నా మెట్రోలో వెళ్ళడం సాధ్యంకానిపని. ఇండియాలో ప్రజలకి ఏం కొనాలో నాకు ఐడియా లేదు. నువ్వు ఏది చెప్తే అది కొనేయడమే. మనవాళ్ళందరూ జాక్సన్ హైట్స్ వెళ్ళేగా కొంటారు"

"జాక్సన్ హైట్స్‌లో ఉన్న ఇండియన్ దుకాణాలలో మోసాల్ని మనం పోల్చలేం. అక్కడ పాతిక డాలర్లు పెట్టి ఏదో ఒక వస్తువు ఇండియా తీసుకెళ్ళి స్నేహితునికో, బంధువుకో ఇచ్చి తిరిగి వచ్చేస్తావు. ఆ వస్తువు రెండురోజులు పనిచేసి పడుకుంటుంది. నువ్వు ఏమనుకుంటావో అని వాళ్ళు నీకు అది పాడయిపోయిన సంగతి చెప్పరు. నువ్వు బహుమతి ఇచ్చేవని తృప్తి పడతావు. నిజానికి డబ్బు దండుగయింది. ఇది నాకు మూడు నాలుగుచోట్ల అయిన అనుభవం.

ఒకసారి నేను ఒక గ్రైండర్‌ని అమెరికన్ స్టోర్‌లో కొన్నాను. దానికి ఒక సంవత్సరం గ్యారంటీ ఉంది. అది కొని వాడుతూ ఒక సంవత్సరం దాటిందేమో, ఒకరోజు కాలిపోయింది. కొన్న రసీదు ఎప్పుడో గిరవాటేశాను. అయినా ఒకసారి అడిగి చూద్దామని ఆ దుకాణానికి వెళ్ళి,

"ఈ దుకాణంలో దాదాపు సంవత్సరం క్రితం గ్రైండరు కొన్నాను. రసీదు నా దగ్గర లేదు. ఇది కాలిపోయింది" అన్నాను.

"ఈ దుకాణంలోనే కొన్నావా?" అనడిగింది రిసెప్షన్‌లో ఉన్న వ్యక్తి.

"ఇక్కడే" అన్నాను.

"అదేరకంది, దుకాణంలో వెతికి తీసుకురా. దానిని తీసుకెళ్దువుగాని" అంది.

కొత్త గ్రైండర్‌తో ఇంటికి వెళ్ళాను.

జాక్సన్ హైట్స్‌లో, అలాంటి సన్నివే

శంలో నీ ముఖమైనా చూడరు. గ్యారంటీలు ఎలాంటివీ అక్కడ చెల్లవు. సరుకుతో దుకాణంలోంచి బయటపడితే అంతే. మనవాళ్లు కక్కుర్తిపడి, చవకరకం వస్తువులు అమ్మేస్తారంటారు.

నేను నిన్ను ఒక అమెరికన్ స్టోర్‌కి తీసు కెళ్తాను. అక్కడ ధరలు చవుకగానే ఉంటాయి. తరువాత నీ ఇష్టం" అన్నాడు రామకృష్ణ.

"నాయనా, నువ్వు నా సారథివి. కాని మనం జాక్సన్ హైట్స్ దగ్గరగా ఉన్నాం కాబట్టి, అక్కడ కాస్త టిఫిన్ తిని, నువ్వు చెప్పినచోటకి వెళ్దాం"

"మనం ఈ పనులన్నీ చేసుకున్నాక, నేను ట్రెయిన్ పట్టుకుని ఇంటికి వెళ్ళేసరికి ఆలస్య మవుతుంది. వినుతకి నేను ఆలస్యంగా వస్తానని ఫోన్ చేయాలి"

"గ్లవ్ కంపార్ట్‌మెంట్‌లో ఫోన్ ఉంది, చేసేయ్ వెంటనే" అన్నాడు సురేష్.

"అమ్మయ్య ఇక ఫరవాలేదు ఎంత ఆల స్యమైనా" అన్నాడు రామకృష్ణ ఫోన్‌చేసి.

"ఈ వెధవ పార్కింగ్ లేకపోతే ఇంత బాధ ఉండదు"

"చూడు, రోడ్డుకి ఇరువైపులా ఉన్న ఇరవై నాలుగు ముప్పయి రెండు అంతస్థులున్న బిల్డింగ్‌లవి. వాళ్ళకి ఉన్న కార్లు ఎక్కడ పార్క్ చేస్తారు? కొన్ని బిల్డింగ్‌లకి భూమి కింద జాగాలో పార్కింగ్ ఉన్నా, చాలదు"

క్వీన్స్‌నిండా ఇలాంటి తేనెగూడు లాంటి కట్టడాలే. అమెరికాలో పెద్ద పెద్ద పట్ట ణాల్లో, ఇళ్ళ ఖరీదులు బాగా ఎక్కువవ డంతో, ఇలాంటి గూళ్ళలో బ్రతుకు తప్పదు. అబ్బ! సంవత్సరాల తరబడి, భూమికి నూటయాభై అడుగుల ఎత్తులో గూభ్యంగా బతుకువెళ్లిపోతుంది కొందరికి" అంటూ రోడ్డుమీదున్న ప్రజల్ని, కట్టడాల్ని చూశాడు సురేష్.

కొందరు టీనేజర్లు, గులాబీపువ్వులని అమ్ముతున్నారు. మరికొందరు కారు ముందర ఉన్న కిటికీని తుడిచి డబ్బులు అడుగుతున్నారు. రెండు రోడ్ల కూడలిలో, నడిచే బాటమీద నిలబడి డబ్బులకి ప్రాధే యపడుతున్నారు. అక్కడక్కడ కొందరు చెత్తకుండీలో ఏమైనా పనికి వచ్చే సామాన్లు కాని, తిండికాని ఉందేమోనని కెలుకుతు న్నారు.

"అమెరికాలో రోడ్డుమీద నివశించే ప్రజలు ఎంతమంది రామకృష్ణా?"

"అది మిలియన్లలో ఉంటుంది. సరిగ్గా ఇంత అని చెప్పలేం. ఒక్క న్యూయార్క్‌లో ఇళ్లు లేకుండా రోడ్లమీద నివశించే ప్రజలు డెబ్బయివేలు. వీళ్లు ముష్టివాళ్లు కారు. వాళ్ళకి వచ్చే ఆదాయంలో అద్దె భరాయిం చలేక రోడ్లమీద నివాసాల్ని ఏర్పరుచుకు న్నారు"

"ఇంత సంపద కల దేశంలో అలాంటివి ఉండడం ఎంత శోచనీయం! హృదయం లేదు. ఈ దేశంలో ప్రజలకి"

"అది నేఒప్పుకోను. ఎవరికో ఆపరేషన్ అవసరమైతే టెలివిజన్ మీద ప్రకటిస్తే విరి విగా విరాళాలు ఇవ్వడం చూశాను. కొన్నింటి గురించి ప్రజలు పట్టించుకోరు. రోడ్డుమీద నివశించే ప్రజల సమస్య అలాం టిది" అని విశదపరిచేడు రామకృష్ణ.

"మనం అదృష్టవంతులమే. ట్రాఫిక్ నడ వడం మొదలయింది" అంటూ రోడ్డుమీదకి దృష్టి నిలిపేడు సురేష్.

★ ★ ★

"ఇండియా వెళ్లడానికి ఇంకా ఇరవై రోజు లుంది" అనుకున్నాడు సురేష్ కేలెండర్ వేపు చూస్తూ. ఇండియా వెళ్లడానికి నిశ్చ యించుకున్నాడే గానీ, నిర్ధారణమైన గమ్యం లేదు.

తండ్రి డైరీలు చదివేక, అతని జ్ఞాపకాల మధురస్మృతులు, పెరిగిన ప్రదేశాల గురించి తెలుసుకోవాలని ఉన్నా, అది సాధ్యమా?

తను వెళ్లి చిన్నాన్న ఇంటిలో ఉంటాడా? లేక అత్త దగ్గరా?

ఇద్దరూ, తను ఇండియా రాబోతున్నందుకు ఉత్సాహం ప్రకటిస్తూ ఉత్తరాలు రాసేరు. అయినా తనకి బెరుకుగా ఉంది. చిన్నాన్నకి, అత్తకి, తండ్రితో ఉన్న సంబంధం వేరు! తన దగ్గరకి వచ్చేసరికి ఆ బంధుత్వం పలచబడింది.

తను అనవసరంగా వెళ్తున్నాడేమో!

వెళ్లి వాళ్లతో సరిగ్గా కాలాన్ని గడపగలడా?

అక్కడి అలవాట్లు, పద్ధతులు మరచిపోయిన తను విలక్షణంగా ప్రవర్తించి వాళ్ల మనస్సులు నొప్పిస్తాడేమో!

ఆ దేశంలో ఆనవాయితీల గురించి రామకృష్ణని, వినుతని అడిగి తెలుసుకోవాలి.

రామకృష్ణ, వినుతలు మంచిజోడీ! పెళ్లయిన పదేళ్లలో వాళ్ల మధ్య అవగాహన బాగా పెరిగింది. అనవసరపు భేషజాలకి పోకుండా ఇంటిని సరిదిద్దుతుంది వినుత!

లైటార్పి నిద్రలోకి ఒరగడానికి సన్నద్ధుడయ్యేడు.

బెడ్‌రూమ్‌లైటు వెలుతురు చాలా పల్చగా ఉంది. అసలే చిందరవందరగా ఉన్న గది, సన్నని వెలుతురులో మరీ అయోమయంగా కనిపిస్తోంది. కప్‌బోర్డ్ మీదున్న కొక్కేనికి తగిలించిన నైట్ డ్రెస్, సినిమాలలో ముసుగు వేసుకున్న మంత్రగత్తెని జ్ఞాపకానికి తెస్తోంది.

జ్ఞాపకాలు!

తండ్రి డైరీలో రాసిన వాక్యాలు జ్ఞాపకానికి వచ్చేయి. తండ్రి జ్ఞాపకాలలో సంధ్య!

సంధ్య ఇప్పుడెక్కడుందో! ఆమె ఏమయిందో! ఆమె గురించి తండ్రివర్ణన, "చలి కాలంలో గడ్డి పోచమీదున్న నీటిబిందువు, తొలి సూర్యకాంతి మీద పడడంతో వెలిగినట్లుంది" అన్నది మధురంగా ఉంది.

తండ్రి జీవితంలో సంధ్య ఒక ముఖ్యాంశం.

బతికుండగా తనతో హృదయం విప్పి మాటలాడని తండ్రి గురించి తెలుసుకోవాలంటే తండ్రిని కదిలించిన సంధ్యని కలవడం ఎంతైనా అవసరం. కాని అది వీలు పడుతుందా? లేక తను అసంతృప్తితో తిరిగి వస్తాడా?

కేతరీన్ వెళ్లిపోవడం, ఉద్యోగంలో జరిగిన అన్యాయాలు, తండ్రి ఆకస్మిక మరణం ఒకటి తర్వాత ఇంకొకటి జరిగి, తను ఈ దేశంలో ఒంటరి అయి, నిన్న గురించి తెలుసుకుందామని ఆసక్తి పెరిగి ఇండియా వెళ్తున్నాడు. తనకి ఈ ప్రయాణం ఎలాంటి అర్థాలని చెబుతుందో, అనుకుంటూ కళ్లు మూసుకున్నాడు సురేష్.

★ ★ ★

ఇరవై రెండు గంటల విమాన ప్రయాణం ముగియడానికి ఇంకా ఒక గంట వ్యవధి ఉంది.

లండన్ వరకు విమానంలో భారతీయులతోపాటు విదేశీయుల సంఖ్య ఎక్కువ. కాని లండన్ నుంచి ఢిల్లీ ప్రయాణంలో నూటికి తొంభై శాతం భారతీయులే. న్యూయార్క్ నుంచి లండన్ వరకు వచ్చిన ఎయిర్ హోస్టెస్ ప్రవర్తన చాలా సౌమ్యంగా ఉంది. కాని లండన్ నుంచి ఢిల్లీ ప్రయాణంలో ఉన్న ఎయిర్ హోస్టెస్‌లు దానికి విరుద్ధంగా ప్రజలని కసురుతూ, దూకుడుగా ప్రవర్తించడం చూసి ప్రక్కన కూర్చున్న ప్రయాణీకుని అడిగేడు.

"ఇది మీరు మొదటిసారా ఇండియా తిరిగి రావడం? ఇది సామాన్యమే. ఈ భాగంలో భారతీయుల ప్రవర్తన మారుతుంది. అలాగే ఎయిర్‌హోస్టెస్ ప్రవర్తనా! మీరు గమనిస్తూ ఉండండి, విమానం ఢిల్లీ చేరేముందు, లోపలున్న కంపు పోవడానికి ఎయిర్‌హోస్టెస్‌లు, ఎయిర్‌స్ప్రేలని ప్లేనంతా చల్లుతారు" అన్నాడు హాస్యాన్ని విషాదంలో మిళాయిస్తూ.

చుట్టూ ఉన్న జనాల్ని పరీక్షగా చూసేడు సురేష్.

ఒక సర్దార్జీ, అతని కుటుంబం బండెడు సామాన్లని, జాగ్రత్తగా పదిలపరిచి మరి కొన్ని అస్తవ్యస్తంగా కాళ్లకి అడ్డం పడేలా దార్లో ఉంచి ఏమీ పట్టించుకోవడంలేదు. ఎయిర్‌హోస్టెస్‌లు వాళ్లని పదేపదే హెచ్చరించి ఆఖరికి విసుగేసి వదిలేసేరు.

ఫ్రీగా డ్రింక్స్ ఇస్తారుగదా అని తాహతుకి మించి తాగి, బండగొంతుకతో అరుస్తూ, తొట్రుపడుతూ మాటలాడుతున్న ప్రజలని చూడగానే విచారమేసింది సురేష్‌కి.

లేచి రెస్ట్‌రూమ్‌వేపు నడిచేడు.

రెస్ట్ రూమ్ దగ్గర క్యూ ఉంది.

కాస్సేపటికి సురేష్ వంతు వచ్చినా, అతనిని దాటుకుని పిల్లవానితో లోపలికి దూరింది ఒక షిఫాన్‌చీర కట్టుకున్న స్త్రీ.

నోటమాట పెగలలేదు సురేష్‌కి.

ఆమె బయటకి వచ్చేక, రెస్ట్ రూమ్‌లోనికి ప్రవేశించిన సురేష్‌కి డస్ట్‌బిన్‌లా కాగితాలతో ఎక్కడపడితే అక్కడ చిందించిన నీళ్లతో రెస్ట్‌రూం దర్శన మివ్వడంతో ఒక్కసారి తలనొప్పి ముంచుకువచ్చింది.

బయటకి వచ్చేక, చేతిసంచీలోంచి రెండు ఏస్ప్రిన్‌లని తీసి వేసుకుని, సీటు వెనక్కి చేరగిలపడ్డాడు.

రాత్రి పది గంటలయింది. ఢిల్లీ దాదాపు పదకొండు గంటలకి చేరుతుందన్నమాట, అనుకుంటూ కళ్లు మూసుకున్నాడు.

ఒకరోజు తనూ, తండ్రీ న్యూయార్క్ జేక్సన్ హైట్స్‌లో తిరుగుతున్నారు. వీధినిండా ఇండియన్ దుకాణాలు, ఎక్కడ చూసినా ఇండియా, పాకిస్తాన్‌ల నుంచి వచ్చిన ప్రజే! డాక్టర్లు, ఇంజనీర్లు, సైంటిస్ట్‌లు, ఒక్కరేమిటి అన్ని రకాల వ్యక్తులూ అటూ ఇటూ తిరుగుతూ, ఇండియన్ దుకాణాలలోనికి దూరి సామాన్లు కొనుక్కుంటున్నారు.

రోడ్డు మధ్య నడుస్తున్న కార్లు, ఇతర వాహనాల గురించి పట్టించుకోకుండా, ఎక్కడపడితే అక్కడ ప్రజలు రోడ్లని దాటుతుంటే కొందరు కారు డ్రైవర్లు విసుగుతో హారన్ కొడుతున్నారు.

అయినా ఎవరూ పట్టించుకోవడంలేదు. నడిచే బాటమీద చెత్త ఎక్కువగా ఉంది. తను ఈ వింతని ఆశ్చర్యంగా చూస్తుంటే,

"వీళ్లందరూ ఈ వీధిలో తప్పితే ఇంకెక్కడా ఇలా ఎక్కడపడితే అక్కడ రోడ్లని దాటరు. ఒక వ్యక్తి ఇంకొకవ్యక్తితో ఇక్కడ దురుసుగా ప్రవర్తించినట్లు ఇంకెక్కడా ప్రవర్తించరు. ఈ వీధిలోనికి రాగానే ఈ వాతావరణం కనబడగానే చాలామందికి మన పాత అలవాట్లు జ్ఞాపకానికి వస్తాయి కాబోలు. కాస్సేపు మనం ఇండియాలో తిరుగుతున్నట్లు భ్రమించడంతో మనలో నిబిడీకృతమైన నిర్లక్ష్య ధోరణి బయటకి వస్తుంది. మొదట్లో నేనూ ఆశ్చర్యపడ్డాను, తరువాత మెల్లిగా నాకూ అలవాటయింది" అని వివరించేడు తండ్రి.

తండ్రి చెప్పిన దాంట్లో ఎంత నిజముందో తెలియదు కాని అప్పటికి అదే నిజమనిపించింది. ఇప్పుడు ఈ విమానంలో మన ఊరువచ్చేసేం ఇక అంతా మామూలే అన్న ధోరణి కనిపిస్తోంది. అనుకుంటుంటే కెప్టెన్ 'ఇంకొక గంటలో విమానం ఢిల్లీ చేరబోతుంది' అని తెలియచేసేడు.

నలుగురు ఎయిర్‌హోస్టెస్‌లు, చేతులని బారగావిప్పి రెండు చేతులతో రెండు స్ప్రేకేన్స్ పట్టుకుని చకచకా విమానం మొదటి నుంచి చివరివరకు నడుస్తూ అత్తరుని వెదజల్లేరు. విమానం అంతా పొగమంచుతో నిండినట్లు కనిపిస్తోంది. మోతాదుకి మించిన అత్తరు సురేష్ నాసికాపుట రంధ్రాలని తాకగానే ఉక్కిరిబిక్కిరయేడు.

ఏర్‌పోర్ట్‌లో ఇమ్మిగ్రేషన్ క్యూ పెద్ద చేంతాడులా మెలికలు తిరిగి ఉంది. నాలుగు వందల మంది ప్రయాణీకులకి మూడే కౌంటర్లు ఉండడంతో క్యూ మెల్లిగా నడుస్తోంది. దానికి తోడు క్యూలో పలుకుబడి ఉన్న వ్యక్తులకి తెలిసిన రాజకీయ

# ఏరిన ముత్యాలు

☆ జీవితమంతా నిద్రించే బదులు, పనిచేసి పరాజయం పొందటం మంచిది.

-కె. జెరోమ్

☆ తన చెవులను అరువిచ్చి, నాలుకను అణచిన వ్యక్తి వివేకంగల ప్రాజ్ఞుడు.

-తిరువళ్ళువర్

☆ విత్తనంలో చెట్టు వేచి ఉన్నట్లే మనిషికోసం ఈ ప్రపంచంలోని అన్ని అవకాశాలు ఎదురుచూస్తున్నాయి.

-శ్రీ అరవింద

☆ మనసులో వుండే దీపాన్ని ఊదేస్తుంది కోపం.

-ఇంగర్‌సాల్

☆ ప్రజల కష్టాలు నిచ్చెనగా చేసుకు ఎక్కినంతవరకూ మీ ఆశయసౌధం ఎంత ఎత్తున వున్నప్పటికి సమర్థనీయం కాదు.

-కాన్రాడ్

☆ మన పాపాలకు చాలా బలిపశువులున్నాయి. కానీ అత్యంత ప్రఖ్యాతి పొందినది దైవము.

-మార్క్‌ట్వైన్

☆ మానసిక సమదృష్టికి చిహ్నం- మంచి నవ్వు.

-మాక్సింగోర్కీ

☆ హిందువులు తమ మతాన్ని మరియు సంస్కృతిని ఒక నదీ ప్రవాహంలాగా ప్రవహించేందుకు అంగీకరించాలి. కాని ఒక నీటిగుంటవలె స్తంభించి ఉండేందుకు అనుమతించకూడదు.

-నేపాల్‌రాజు బీరేంద్ర

☆ గతించిపోయినరోజులు జీవితం కాదు. గుర్తుంచుకోదగినరోజులే జీవితం.

-పాల్‌లెంకో

☆ మానవాళి కదలికను తెలుసుకోవడమే చరిత్ర ఉద్దేశం.

-టాల్‌స్టాయ్

☆ అత్యధిక జాగరూకతగల వ్యక్తి అల్పంగానే సాధిస్తాడు.

-ష్కిల్లర్

☆ అవమానంతో జీవించటంకంటే యశస్సుతో మరణించటం మేలు.

-రుస్థవెల్లీ

☆ ప్రేమ, ఆరోగ్యం, ఆనందం- వీటిని డబ్బుతో కొనలేము.

-జేచేస

☆ పుస్తకప్రియుడు కానివాడు ఎప్పటికి బుద్ధిమంతుడు కాలేడు.

-శ్యాముల్‌జాన్‌సన్

సేకరణ: పట్నం శేషంశెట్టి




ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

మార్చి చతుర నవల నీళ్లలో చంద్రుడు

..............................................................

సమీక్షకుని పేరు : ..............................................................

చిరునామా : ..............................................................

..............................................................

..............................................................

..............................................................

నాయకుడో, పోలీసాఫీసరో వచ్చి క్యూని పట్టించుకోకుండా ముందరగా వాళ్లని తీసు కెళ్తున్నారు.

సురేష్ ముందరున్న మధ్య వయస్కుడు, "నేను చాలా దేశాలు చూసేనుకాని, ఇక్క డంత పదవీ దురుపయోగం ఇంకే ఎయిర్ పోర్ట్‌లోనూ చూడలేదు" అన్నాడు.

అవును అంతే అన్నట్లుగా చిరునవ్వు నవ్వేడు సురేష్.

కష్టమ్స్‌లోంచి బయటపడేటప్పుడూ ఇదే తంతు.

ఎయిర్‌పోర్ట్‌లోంచి బయటికి రాగానే అట్టమీద తన పేరు రాసి నిలబడ్డ చిన్నా న్నని చూడగానే ప్రాణం లేచిరాగా చిన్నాన్న ఆప్యాయంగా అందిచ్చిన చేయిని అందుకుని కరచాలనం చేసేడు సురేష్.

★ ★ ★

ఆంధ్రప్రదేశ్ ఎక్స్‌ప్రెస్ ఎ.సి. టూటైర్ కిక్కిరిసి ఉంది.

కూలీలతోను, బయటకి వెళ్లి మిత్రులని పలకరించడానికి దిగే జనంతోను నిండి ఉన్న పెట్టెలోనికి తోసుకుంటూ జొరపడ్డారు సురేష్, అతని చిన్నాన్న మాధవరావ్.

ప్లాట్‌ఫారం మీద కోచ్ కండక్టర్ చుట్టూ, బూరెల గంపమీదవాలే ఈగలకన్నా దారు ణంగా ప్రయాణీకులు అతనిని చుట్టుముట్టి ఎటు తిరిగినా కాళ్లలో అడ్డం పడుతూ టిక్కట్లని వారంట్లని అతనికి చూపిస్తు న్నారు.

జూన్‌మాసం సాయంకాలమైనా, ఎండ తగ్గినా వేడి గాడ్పులు తీస్తున్నాయి. గాలిలో తేమ ఎక్కువగా ఉండడంతో శరీరంలోంచి చమట బయటకి ఉబుకుతోంది. కండక్టర్ వేసుకున్న దుక్క యూనిఫారం చుట్టూ మూగిన జనం అతనికి ఊపిరాడకుండా చేయడంతో, "అన్నీ రిజర్వేషన్ అయిన బెర్తులే. ఏవైనా కేన్సిల్ అయిన పక్షంలో వాటిని వెయిటింగ్‌లిస్ట్ ప్రకారం ఇస్తాను. నా చుట్టూ తిరిగి ఏమీ లాభంలేదు" అంటూ పద్మవ్యూహంలోంచి బయటపడిన అర్జునునిలా, ప్రజలని తప్పించుకుని ఎ.సి. పెట్టెలోనికి వచ్చి ఊపిరిపీల్చుకున్నాడు కండ క్టర్.

"అదిసరే కాని ఖాళీ ఉన్న పక్షంలో తామ్రపత్ర ఉన్నవాళ్ల సంగతి మీరు ముందర చూడాలి" అన్నాడు సఫారి సూట్‌లో ఉన్న ఒక వ్యక్తి.

"అన్నీ చూద్దాం. అసలు ఖాళీ అంటూ ఒకటి ఉంటేగా, బండి బయలుదేరేకగాని ఏ విషయమూ తెలియదు. నన్ను నా పనిని చెయ్యనివ్వండి" అంటూ టిక్కెట్ల తనిఖీ మొదలుపెట్టేడు కండక్టర్.

తనిఖీ చేస్తూ కండక్టర్ కదులుతుంటే, రారాజు వెనకాల బలగం నడిచినట్లు, సఫారీ సూటు వ్యక్తులు, ఖద్దరు ధరించిన జనాభా, జీన్స్, టీషర్టుల ప్రజ అతని వెన కాలే నడుస్తుంటే సురేష్‌కి వింతగా ఉంది. అది గమనించి,

"మీ దేశంలో ఇలా ప్రజలు మీదపడ తారా?" అనడిగేడు మాధవరావ్ సురేష్‌ని కండక్టర్ కదిలివెళ్లేక.

"అబ్బే! రైళ్లు ఇంత కిక్కిరిసి ఉండవు. ఒకర్ని ఇంకొకరు నడిచేటప్పుడు తాకరు. తాకితే ఏదో పురుగుమీదపడి పాకుతున్నట్లు ప్రవర్తిస్తారు. రైళ్లు రద్దీగా ఉండనపుడు ఇలా ప్రాకులాడే అవసరం ఏముంటుంది?"

"ఇక్కడా రూల్స్ ప్రకారం వెళితే ఏ గొడవా ఉండదు. కాని తప్పుదారి తొక్క డాలు, ప్రిఫరెన్స్‌లు, స్పెషల్ కోటాలు అంటూ పెట్టడంలో వచ్చింది చిక్కు."

"అదేమిటి అంకుల్ అంగవైకల్యం ఉంటే ప్రిఫరెన్స్ ఇవ్వడం న్యాయమేకదా?"

"భలేవాడివే, అంగవైకల్యం గురించి ఎవరు పట్టించుకుంటున్నారు? ప్రజా ప్రతి నిధులకి కోటా, దానికి తోడు రాజకీయ



నాయకులు ఈమధ్యని ఒక కొత్త తెగని మొలిపించేరు. వీళ్లని స్వాతంత్ర సమరయోధులంటారు. కుంతీదేవికి చెవిలోంచి పుట్టుకువచ్చిన కర్ణునిలా, వీళ్లు గబుక్కున ఆవిర్భవించేరు. ఇండియాకి స్వతంత్రం వచ్చి దాదాపు ఏభైఏళ్లు అవుతోంది. గ్రామాలలో ఉన్న కొందరు, బ్రిటిష్ వాళ్లతో పోట్లాడేరని, ఇండియాకి స్వతంత్రం రావడానికి వీళ్లు కూడా కారణమని, ఉన్నట్టుండి ప్రభుత్వం కనుక్కొని కొందరికి పట్టాలు అందిచ్చేరు. మరి కొందరికి సన్మానాలు చేసేరు. వీళ్లు ఎక్కడ పడితే అక్కడకి రైళ్లలో, బస్సులలో ఉచితంగా ప్రయాణం చేయవచ్చు. ఖాళీ ఉంటే టిక్కెట్టు కొన్న వానికంటే ఆ వ్యక్తికి పక్షపాతం చూపించాలి. అదేకాదు ఇతనితో ఇంకొకవ్యక్తి కూడా ఉచితంగా ప్రయాణం చేయవచ్చు"

"అంకుల్ ఏమిటి దీనికి లాజిక్? "

"లాజిక్ అంటూ ఏమీలేదు... ఓట్లు... చాలామంది ఈ స్వాతంత్ర సమరయోధులకి చదువురాదు. వీళ్లు బ్రిటిష్‌వాళ్లు ఈ దేశాన్ని పరిపాలించిన కాలంనుంచి ఈనాటి వరకు బతికి ఉన్నారు. అది ఒక అర్హత. మహా అయితే 'వందేమాతరం' అనో, 'కాంగ్రెస్ జిందాబాద్' అనో అరిచి ఉంటారు. అందరి సంగతీ చెప్పలేంకాని చాలామంది ఇంతే. మరో విచిత్రం ఏమిటంటే ఈ పట్టాలు అందుకున్న వాళ్లలో చాలామంది, పదవిలోఉన్న రాజకీయ నాయకుల ఊర్లలోంచి అర్థాంతరంగా ఊడిపడ్డవాళ్లే"

"ఫ్రీడమ్ ఫైటర్ల సంగతి అలా ఉంచండి. కాని వాళ్లతో ఇంకొక వ్యక్తికి కూడా ఫ్రీపాస్ ఎందుకు? "

"ఏమో! ఆ పద్ధతి పెట్టిన వాళ్లకే తెలియాలి. స్వంత డబ్బేమీకాదు, ప్రభుత్వపు డబ్బు. నేను ప్రయాణం చేస్తున్నపుడు ఇంకొకటి గమనించేను. ఒక ఫ్రీడమ్ ఫైటర్ ఢిల్లీ నుంచి హైదరాబాదు ఈ పెట్టెలో ప్రయాణం చేస్తున్నాడనుకో టిక్కట్టు ఖరీదు పధ్నాలుగు వందలు. ఇంకో వ్యక్తిని తనతో తీసుకెళ్లి అతని దగ్గర వెయ్యి రూపాయలు పుచ్చుకుంటే ఉభయతారకం! ఈ దేశంలో లోక్‌సభ, రాజ్యసభ మెంబర్లకి, ఎం.ఎల్.ఏలు హైదరాబాదు వెళ్లిరావడానికి, ఇంకొక వ్యక్తి తోడు వెళ్లవచ్చు. ఆఖరికి విమానాలలో కూడా! ఈ దేశంలో రైళ్లు, బస్సులు, విమానాలు చాలా రద్దీగా నడుస్తాయి. కాని అన్ని విభాగాల్లోనూ నష్టమే. ఈ పెట్టెలో ఉన్న నలభై ఐదు మందిలో కనీసం పదేనా ఫ్రీకేసులే. ఆలోచించు ఎంత దుబారా జరుగుతోందో"

"మరి ప్రజలు తిరగబడరా? " అని ఆశ్చర్యపడ్డాడు సురేష్.

"అరాచకత్వం వలన లాభించేదెవరు? బలం ఉన్నవాళ్లు. ఈ లొసుగులని బాగా ఉపయోగించుకుంటున్నాడు తెలివైనవాడు. ఏ అండదండలూ లేనివాడు ఏం చేయగలడు? మహా అయితే గుంపులో ఉన్నప్పుడు, రైళ్లమీద, బస్సులమీద రాళ్లు రువ్వి శాంతిస్తున్నాడు" అని సమాధానమిచ్చి, చేతిలోని పత్రిక విప్పేడు మాధవరావ్.

బైట ప్లాట్‌ఫారం మీద కోలాహలం ఎక్కువైంది.

మినిష్టర్ గారి కూతురు, నిండు గర్భిణీ, పురుటికి జనం మధ్య కారులోంచి దిగి హాస్పిటల్‌లోనికి వచ్చినట్లు, ఎ.పి. ఎక్స్‌ప్రెస్ జనాలని చీల్చుకుంటూ, ప్లాట్‌ఫారం మీద నుంచి మెల్లిగా బయలుదేరింది.

★ ★ ★

ఎండాకాలం ప్రొద్దున ఐదు గంటలకే అనవసరంగా కంగారుపడుతూ లేచి, నిద్ర చాలక, కళ్లెర్రగా చేసుకుని కోపాన్ని ప్రజల మీదకి ప్రదర్శించడానికి సూర్యుడు బయలుదేరేడు.

గోదావరి ఎక్స్‌ప్రెస్ మూడు గంటలు

ఆలస్యంగా నడుస్తూ, గోదావరి స్టేషన్ దాటి రాజమండ్రి స్టేషన్‌వేపు ఉరకలు పెడుతూ పరిగెడుతోంది.

కాలకృత్యాలు తీర్చుకోవడానికి, రైలు పట్టాలకిరువైపులా ప్రజలు కూర్చుని ఉన్నారు.

పరిగెడ్తున్న రైలు కిటికీలలోంచి లోనికి వస్తున్న గాలి చెప్పలేనంత కంపుకొడ్తోంది.

"ఇక్కడకి దగ్గరగా సూయజ్ ఫార్మ్ కాని ఉందేమిటి అంకుల్?" అనడిగేడు సురేష్.

"అదేమీకాదు. రైలుపట్టాలకి అటూ ఇటూ పూరిళ్లలో ఉన్న ప్రజలకి, కాల కృత్యాలు తీర్చుకోవడానికి ఇంకే దారిలేక మన బంగారు ప్రభుత్వపు రైల్వే లైన్లుకి, ఇరువైపులా ఉన్న కాస్తంత జాగాని వాడు కుంటారు. దాని మీదనుంచి వచ్చిన గాలినే పీల్చి, సూయజ్ ఫార్మ్ అని భ్రమపడ్డావు" అని దుర్గంధపు గాలి రావడానికి కారణాన్ని వివరించేడు మాధవరావ్. నోట మాట పెగలలేదు సురేష్‌కి. ఏదో మాట్లాడబో యేంతలో,

"మగవాళ్ల సంగతి అలా ఉంచు. ఆడ వాళ్ల సంగతి మరీ అధ్వాన్నం. కొందరు అలవాట్లని మార్చుకుని, రాత్రుళ్లు ఈ బాధ తీర్చుకుంటారు. పగలయితే ఆనవాళ్లు తెలి యకుండా మొహంమీద ముసుగువేసుకుని కుంచించుకుపోతూ, దీర్ఘశంకని తీర్చుకోవడా నికి ప్రతీరోజూ బాధపడతారు" అని విచార పడ్డాడు మాధవరావ్.

"ఇండియా సాంకేతికంగా బాగా పురోగ మించిందని, రాకెట్లని ప్రయోగిస్తున్నారని, ఉపగ్రహాలని రోదసిలోనికి పంపుతున్నారని చదివేను. మరి ఈ సాంఘిక సమస్యకి పరి ష్కార మార్గం ఎందుకు కనుక్కోలేదు?"

"దేశ రక్షణకి చేయడంవేరు, దేశంలో ప్రజల గురించి పట్టించుకోవడంవేరు"

"ఇంతపెద్ద దేశాన్ని తొమ్మిది వందల యాభై మిలియన్లు ఉన్న దేశాన్ని ఆక్రమిం చేదెవరు?"

"అవన్నీ అప్రస్తుతాలు. ప్రజలు ఒత్తిడి తెస్తేగాని ఏమీ జరగవు. దీనిని నువ్వు ఒక పెద్ద సాంఘిక సమస్య అని అనుకుంటు న్నావు, కాని ఇక్కడ ప్రజలు అలా అనుకుం టున్నట్లు... కనపడదు. జనాభా తక్కువగా ఉన్న కాలంలో పల్లెలలో ప్రజలు చెంబుప ట్టుకుని తుప్పల్లోకి పోయి ఈ బాధని తీర్చు కునేవారు. అదే మన రక్తంలో జీర్ణించుకు పోయింది. పరిస్థితులు మారినా అదే ఆన వాయితీని ఇంకా పట్టుకు కూర్చున్నాం. ఆడ వాళ్లు తిరగబడడంలేదు. రోజులు వెళ్లిపోతు న్నాయి అంతే" అంటూ బ్రష్ తీసుకుని బాత్రూం వేపు నడిచేడు మాధవరావ్.

సాంప్రదాయం... అలవాట్లు! మళ్లీ తండ్రి ఆలోచనలోనికి చొచ్చుకువచ్చేడు. కేతరీన్‌తో పెళ్లి గురించి ప్రస్తావన వచ్చినపుడు, "నిన్న టికన్నా ఈవేళ భిన్నంగా చేసినంత మాత్రాన అది మంచి అవనక్ఖరలేదు. అలాగే నిన్న చేసినట్లు ఈవేళ అలా గుడ్డిగా చేయడం సాంప్రదాయం అనిపించుకోదు. కేతరీన్‌తో సంప్రదించు. ఈ దేశంలో చాలా గుడులు ఉన్నాయి. వాటిలో ఒక దాంట్లో హిందూ దేశంలో జరిగే విధా నంలో పెళ్లికి ఒప్పుకుంటుందేమో" అన్నాడు.

"సంస్కృతి! సాంప్రదాయం!" అనుకుని సురేష్ మథనపడుతుంటే, బేరర్ వచ్చి ఫ్లాస్కులలో కాఫీని టేబుల్ మీద ఉంచి వెళ్లేడు. ఫ్లాస్కులోంచి కాఫీని కప్పులోనికి వంచి దానిని చేతిలోనికి తీసుకున్నాడు సురేష్.

రాజమండ్రి ప్లాట్‌ఫారం మీద పది, పన్నెండేళ్ల పిల్లలు, మాసిన, చిరిగిన బట్ట లతో కనిపించిన వాళ్లనందరినీ డబ్బులి మ్మని వెంబడిస్తున్నారు.

ఫస్ట్ క్లాస్ పెట్టెలో పొగలు కక్కుతున్న కాఫీతో ప్రజ.

సరిఅయిన దుస్తులు లేక, చిరిగిన దుస్తు

లలోంచి కడుపు మండిపోతోందని కడుపులు చూపించి అడుక్కుంటున్న ప్రజ.

కాలకృత్యాలు తీర్చుకోవడానికి అవస్తపడుతున్న ప్రజ! అన్వయం అవని పరిస్థితులు!

కాఫీ తాగకుండా కప్పుని అసహనంగా టేబుల్ మీదుంచి కళ్లు మూసుకున్నాడు సురేష్.

"పిల్లల్ని పెంచడానికి తగినంత సమయం, ఓపిక ఉన్నప్పుడే పిల్లల్ని ఈలోకంలోనికి తీసుకురావాలి. లేకపోతే వాళ్లని మంచి పౌరులుగా మనం సరిదిద్దలేం" అని తనంటే,

"ఇలా ఏదో ఒక అడ్డు చెప్పుకుంటుంటే, నాకు పిల్లలు పుట్టే కాలం కాస్తా వెళ్లిపోతుంది" అంది కేతరీన్.

"అయితే నువ్వు ఆ బాధ్యత తీసుకోవడానికి తయారుగా ఉన్నావా?" అని తను రెట్టిస్తే కోపంతో ముక్కుపుటాలెగరేస్తూ, జేవురించిన మొహంతో బెడ్రూంలోనికి దూరి తలుపు వేసుకుంది. కేతరీన్‌ని ఒప్పించడానికి తను చేసిన ప్రయత్నం విఫలమైంది.



"అర్థాంతరంగా ఢిల్లీ వెళ్లేవని తెలిసింది. ఏమిటి? ఏదైనా ఎక్స్‌పర్ట్ క్రింద వెళ్లడానికి ప్రయత్నమా? లేక పాలు, వెన్న మస్తుగా భుజించి నిగనిగలాడుతుండే పంజాబీ పిల్లలని చూడడానికి వెళ్లేవా?" అంటూ కన్నుగీటుతూ, దాదాపు అరవై ఏళ్ల వయస్సున్న వ్యక్తి మాధవరావ్‌ని ప్రశ్నించేడు.

"చింతచచ్చినా పులుపు చావలేదన్నట్లు అరవయ్యో పడిలో పడినా ఇంకా ఆడపిల్లల మీద కాంక్ష, యావ చావలేదు నీకు. ఇతను మా అన్నయ్య సుబ్బారావు కొడుకు. ఈ దేశాన్నీ, బంధువులనీ చూడడానికి వస్తుంటే ఒంటరిగా జనాభాలో ఈదుకుంటూ విశాఖపట్నం వచ్చేసరికి అతని ఉత్సాహం అంతా చచ్చిపోతుందేమోనని అనుమానంవేసి, అతనిని కలిసి, తీసుకు రావడానికి వెళ్లేను. రా పరిచయం చేస్తాను" అంటూ మాధవరావ్ అతన్ని సురేష్ దగ్గరకి తీసుకొచ్చేడు.

"ఈయన పేరు కుమార్. మీ నాన్న, కుమార్ కలిసి చదువుకున్నారు. ఇతను సురేష్, సుబ్బారావన్నయ్య కొడుకు" అని పరిచయం చేశాడు.

సురేష్ సోఫాలోంచి లేచి నిలబడి, చాచివున్న కుమార్ చేతిని అందుకున్నాడు.

"సుబ్బారావు కొడుకువా? చాలా ఆనందంగా ఉంది. వాడు నీలాగే ఉండేవాడు యవ్వనంలో. మరేమీ అనుకోకు ఏకవచనానికి" అంటూ చేతిని నొక్కి వదిలేడు కుమార్.

తండ్రి గురించి ఇంపైన ఆత్మీయతతో నిండిన సంబోధన రాగానే కుమార్‌ని పరీక్షగా చూశాడు సురేష్.

దాదాపు ఐదడుగుల తొమ్మిదంగుళాల పొడవు, నూట ఏభై పౌనుల బరువు, షాంపూ అవసరంలేని బట్టతల, మూడు వంతులు నెరసిన గుబురైన మీసకట్టు, పెద్దమొహం, తీర్చిదిద్దినట్టున్న కనుబొమలు, చెవుల్లోంచి తన్నుకొస్తున్న నల్ల వెంట్రుకలు, చామనచాయ.

ఎందుకో కుమార్‌ని చూడగానే బలమైన మేకు జ్ఞాపకానికి వచ్చింది.

ఇది అని నిర్ధారణగా చెప్పడానికి ఏమీ లేదు కాని ఆ కరచాలనంలో ఒకసొంపు,

ఆప్యాయంగా చేయినొక్కి వదిలిన తీరు సురేష్‌ని ముగ్ధుడిని చేసింది.

"కుమార్ ఆర్మీలో కల్నల్‌గా పనిచేసి రిటైరయి, వాజరస్ కోలనీలో సెటిలయేరు" అంటూ పరిచయాన్ని పూర్తి చేసేడు మాధవరావ్.

"చూసేవా, ఇంత పెద్దవ్యక్తి ఇక్కడ ఉన్నాడని గమనించకుండానే వెళ్లిపోతోంది సావిత్రి" అని పరిహాసమాడేడు కుమార్ వంటింటిలోనికి వెళ్తున్న వ్యక్తిని చూస్తూ.

ఆ వ్యక్తి సావిత్రి. ఆగి ఆశ్చర్యంగా కుమార్‌వేపు చూసింది. ఆశ్చర్యంతో ముడిపడిన భృకుటి, ఆనందంతో విడింది.

"సుబ్బారావులాగేలేడూ. ఏదీ మీ ఆవిడ కనపడదేం? " అంటూ సురేష్, కుమార్‌ల దగ్గరకి వచ్చింది.

"మా ఆవిడ ఊరెళ్లింది, అందుకని కనబడడంలేదు" అంటూ చిలిపిగా సావిత్రి కళ్లలోనికి చూశాడు కుమార్.

ఇద్దరి చూపులూ కలుసుకున్నాయి.

తన ఊహ లేక అత్త నిజంగా సిగ్గుపడిందా? అని సురేష్ అనుకుంటుంటే,

"నువ్వు వస్తావని మాధవ్ చెప్పేడు. నీ కిష్టంకదా అని ఉల్లిపాయ పకోడీలు చేయించేను. ఉండు తెస్తాను" అంటూ వంటింటిలోనికి వెళ్లింది సావిత్రి.

"చూసేవా అక్కయ్య నీ గురించి ఎంత శ్రద్ధ తీసుకుంటోందో? " అన్నాడు మాధవరావ్.

"తనని పెళ్లి చేసుకుంటానని ముందుకు వచ్చిన పురుషుడిని స్త్రీ మరవదుట" అంటూ హాయిగా నవ్వుకున్నారు కుమార్, మాధవరావ్‌లు.

రెండు నిమిషాలు గడిచినా సావిత్రి తిరిగి రాకపోవడం చూసి,

"ఏవీ సావిత్రి ప్రకటించిన పకోడీలు? " అంటూ వంటింటివేపు నడిచేడు కుమార్.

రెండు గదులలో ఉన్న పదిమంది సభ్యులు హడావుడిగా అటూ ఇటూ తిరుగుతున్నారు. ఊరిలో ఉన్న దగ్గర బంధువులని, స్నేహితులని సురేష్‌కి పరిచయం చేయడానికి భోజనానికి ఆహ్వానించేడు చిన్నాన్న.

తనతో మగా, ఆడా కలిపించుకుని పరిచయం చేసుకుంటున్నారు. కొందరు అర్థమవుతున్నారు, మరికొందరు కొరుకుడు పడడంలేదు అనుకుంటూ ఆలోచనలో పడ్డాడు సురేష్.

అమెరికాలో డిన్నర్‌కి అతిథులు ఇంటికి వస్తే డ్రింక్ అందుకుని, చిప్స్, జీడిపప్పు నంజుకుంటూ కబుర్లలో పడతారు. కేతరీన్‌తో కలసి ఆమె పనిచేసే కంపెనీలోని సహోద్యోగుల ఇంటికి డిన్నర్‌కి వెళ్లినప్పుడు అక్కడి వాతావరణం జ్ఞాపకానికి వచ్చింది సురేష్‌కి.

సంభాషణ ప్రపంచ వ్యవహారాలు, ఆఫీసు విషయాలు, లేక వాతావరణం గురించో నడుస్తుంది. ఎప్పుడైనా "మీ అమ్మాయి ఎలా ఉంది? " లాంటి వ్యక్తిగత ప్రశ్నలు సంభాషణలోనికి దొర్లితే ఒకే సమాధానం 'అద్భుతం' అంటూ గోడకేసి కొట్టిన బంతిలా తిరిగి వస్తుంది. నిజానిజాలు వాళ్లకే తప్ప ఇతరులకి తెలియనివ్వరు.

నీటిలో మునగని బెండులా, అంటీఅంటని అన్నం మెతుకులలా సంభాషణ పొడిపొడిగా ఉంటుంది. ఇతర పార్టీల సంగతే మోకాని తన అనుభవంలో మనసు విప్పి సుఖాలు, బాధలు పంచుకోవడం గమనించలేదు. ఎవరికివారే యమునాతీరే బతుకు వాళ్లది అనుకున్నాడు సురేష్.

ఆరడుగుల దూరంలో ఇద్దరు తమతమ స్కూటర్ల గురించి చర్చించడం వినిపించడంతో రామకృష్ణ ఇంటిలో జరిగిన పార్టీలో సంభాషణ జ్ఞాపకానికి వచ్చి మెల్లగా నవ్వుకున్నాడు.

ఇక్కడ వీళ్లు స్కూటర్ల మీద చర్చ

అక్కడ ముప్పయివేల డాలర్లమీద చర్చ! ఎదుటవానికంటే తానే ఆధిక్యుడనని చెప్పుకోవడానికి అంత ఆరాటం ఎందుకో! ఇలాంటి ధోరణి తను కేతరీన్‌తో అమెరికన్ల ఇళ్లలో జరిగిన పార్టీలలో గమనించలేదు.

కేతరీన్ వెళ్లేక తనలో నిండిన అశాంతిని తనంటే ప్రత్యేకమైన ఆసక్తి చూపిస్తున్న ఈ ప్రజ, కొంత మట్టుకు పారద్రోలుతున్నారు. ఇది ఎన్నాళ్లు ఉంటుందో ఏమో! అనుకుంటుంటే వంటింటిలోంచి రెండు ప్లేట్లలో పకోడీలతో తిరిగి వచ్చిన కుమార్, ఒక ప్లేటుని సురేష్‌కి అందించి సోఫాలో ఒరుగుతూ,

"ఉల్లిపాయ పకోడీలు భలేగా ఉంటాయిలే. ఇప్పుడు చెప్పు ఈ దేశంలో ఎన్నాళ్లు ఉంటావు? " అని ప్రశ్నించేడు.

"ఏదీ నిర్ధారణగా చెప్పలేను, కాని కావలసినంత సెలవు ఉంది. చూద్దాం" అని సమాధానమిచ్చేడు. మెల్లిగా పిచ్చాపాటీలో పడ్డారు ఇద్దరూ. గతం గురించి బంధువుల గురించి తెలుసుకోవడానికి ఇండియా వచ్చేనని చెప్పేడు. అంతా ఇళ్లకి మళ్లడంతో రాత్రి పది గంటలకి సద్దుమణిగింది.

దోమతెరలోపల నిద్రపోవడానికి ప్రయత్నిస్తున్న సురేష్ రక్తం పీల్చటానికి తిరుగుతున్న దోమలకి •అతను అందుబాటులో లేకపోవడంతో కోపంగా రొదపెడుతూ దోమతెర చుట్టూ తిరుగుతున్నాయి. దోమతెరగుడ్డ గాలిని మీదనుంచి అడ్డడంతో సీలింగ్ ఫేన్ తిరుగుతున్నా లోపల ఉక్కగా ఉంది.

★ ★ ★

జూలై మొదటివారం, మృగశిర వచ్చి వెళ్ళింది. పెళ్ళి పందిరిలోంచి విడిదిలోనికి, తిరిగే యుక్తవయస్సు వచ్చిన ఆడపిల్లలలా, ఆకాశంమీద మబ్బులు హడావుడిగా కదులుతున్నాయేకాని వానకురవడంలేదు. గాలిలో కావలసినంత తేమ, దానివల్ల ఒంటినిండా చమటే,

నిద్రపట్టక, తలగడాని అటూ ఇటూ మారుస్తున్న సురేష్‌కి సాయంకాలం పార్టీలో జరిగిన విచిత్ర సంభాషణ గుర్తుకు వచ్చింది.

చిన్నాన్న ఇంటికి ఎదురు ఇంటిలో ఉన్న వ్యక్తి, ఏదో పనిమీద చిన్నాన్నని కలవడానికి వచ్చేడు. చిన్నాన్న ఆయనని ఆహ్వానించి, తనని పరిచయం చేసేడు.

"మావాడు వర్జీనియాలో ఎమ్.ఎస్. చేస్తున్నాడు. అయిపోవచ్చింది. వాడు చేస్తున్న అద్భుతమైన రీసెర్చి గురించి విని, ఐదారు కంపెనీలవాళ్ళు తమతమ కంపెనీలలో చేరమని వెంటపడుతున్నారు. నలభై ఎనిమిది వేల డాలర్లు ఇస్తామంటున్నారు. మావాడు ఇంకా ఏదీ నిశ్చయించుకోలేదు. ఎన్నాళ్లయింది మీరక్కడికి వెళ్ళి? ఇల్లూ అదీ కొన్నారా? ఏమాత్రం జీతం వస్తుందేమిటి? " అని ప్రశ్నించేడు.

తను సమాధానమీయకుండా సంభాషణని మార్చేడు.

"మావాడికి వాయిదాల పద్ధతిమీద ఇల్లు కొనడం ఇష్టంలేదు. ఒకేసారి డబ్బంతా పెట్టి కొనేస్తానంటున్నాడు. నేనే తొందరపడవద్దంటున్నాను" అన్నాడు తిరిగి, జీళ్ళపాకంలా వదలకుండా.

"మీరు చెప్పినదే సరి అయినది" అని తను అక్కడనుంచి లేచేడు.

పరిసరప్రాంతం, పట్టణంబట్టి ఇళ్ల ఖరీదులలో చాలా తేడాలున్నా, అమెరికాలో చిన్న ఇంటికైనా కనీసం లక్షడాలర్లు కావాలనీ, నెలకి పన్నెండు పధ్నాలుగు వందల స్కాలర్షిప్‌మీద అక్కడకి వెళ్ళిన వ్యక్తి దగ్గర మహా అయితే మూడు, నాలుగు వేల డాలర్లకంటే నిలవ ఉండదనీ ఎవర్కైనా అవగాహన అవుతుందే! మరి ఈ వ్యక్తి ఇలా మాటలాడడం ఎవర్ని మోసపుచ్చడానికి? అదే కాకుండా, పన్నులు తగ్గించుకోడానికి అమెరికాలో, ఇంటిని వాయిదాల పద్ధతిమీదే

కొనడం లాభసాటిదని ఎలా వివరించడం? అమెరికాలో, "మీ జీతం ఎంత?" అని ఎవరూ ఎవర్నీ అంతరంగిక ప్రశ్నలు వేయరని ఎలా చెప్పడం?

తను జీతం సంగతి చెప్పకపోవడం చూసి ఆ వ్యక్తి.

"నేనేమీ అప్పు అడగనులెండి. మావాడొకడు టెక్సాస్‌లో బాగా డబ్బు చేసుకుంటున్నాడు. వాడూ అంతే, జీతం గురించి చెప్పడు" అని నిష్ఠూరమాడేడు.

ఈ దేశంలో ఎదుట వ్యక్తి జీతం గురించి తెలుసుకోవడానికి ఉన్న ఉత్సాహం సామాన్యంలా ఉంది. కాని అది అడగకూడని ప్రశ్నని, ఎదుట వ్యక్తిని నొప్పించకుండా చెప్పేమార్గం ఉంటే బాగుండును.

ఆ దేశంలో ఎదురింటికయినా, పొరుగింటికయినా, ముందరగా వాళ్ళకి తెలియపరిస్తేగాని వెళ్ళరు. కాని ఇక్కడ ఆనవాయితీ వేరు. ఏది మంచిదన్న దాంట్లో అర్థంలేదు. దేని సాధకబాధకాలు దానికున్నాయి.

కంటికి రెప్పలా చిన్నాన్న తనని కనిపెడుతుంటే, రోజులు ఇబ్బంది లేకుండా వెళ్తున్నాయి. కేతరీన్ గురించి ఆలోచనలు తగ్గాయి. రేపు అత్త ఊరు వెళ్ళిపోతుంది. తండ్రికి అత్తంటే మంచి అభిమానం అని, తండ్రి దాచిన డైరీలనుబట్టి తెలిసింది. అత్తకి తండ్రంటే ఉన్న అపేక్ష గతవారం రోజులలో అవగాహన అయింది. సరిఅయిన అవకాశం లభించక, అత్తని, తండ్రి బాల్యం గురించి అడగలేదు. కాకినాడ వెళ్ళినపుడు అడిగి తెలుసుకోవాలి.

"సరుగుడు చెట్లమీదనుంచి వీచిన గాలి చేసే శబ్దంలా, హాయిగా వీనులవిందుగా ఉంది, ఆమె మాటల గలగల" అని డైరీలో తండ్రి వర్ణించిన సంధ్య ఎక్కడుందో? అని ఆలోచిస్తుంటే మెల్లిగా నిద్రపట్టింది సురేష్‌కి.

గాఢనిద్రలోనికి ఒరిగిన సురేష్‌కి వాన మొదలవడం తెలియదు.

★ ★ ★

"నాన్నా, నేనూ సురేష్ అన్నయ్యా అలా బజారులోనికి వెళ్ళివస్తాం. వీలయితే, ఇదివరలో పెదనాన్న అద్దెకున్న ఇల్లు సురేష్‌కి చూపిస్తాను" అన్నాడు ప్రసాదు.

"జాగ్రత్త" అంటూ పేపరులోనికి తల దూర్చేడు మాధవరావ్.

ముందరే హెచ్చరిస్తున్నాను. రోడ్లమీద నడిచేటప్పుడు క్రిందకి చూస్తూ నడవాలి. లేకపోతే బూట్లకి తరువాత అభ్యంగన స్నానం చేయించాల్సివస్తుంది" అంటూ ఖాళీగా వెళ్తున్న ఆటోని ఆపేడు ప్రసాద్. ఇద్దరూ ఆటో ఎక్కేరు.

సిరిపురం జంక్షన్ దాటుకుని గవర్నర్ బంగళా దగ్గరకి ఆటో చేరగానే, డ్రైవర్ ఇంజనుని ఆపుచేసి, ఏటవాలుగా ఉన్న రోడ్డుమీదనుంచి కిందకి దిగుతూ వేగం పుంజుకుంటున్న ఆటోని అటూఇటూ తిప్పి జనాలని తప్పిస్తూ, అప్సర హోటల్ దగ్గరకి వచ్చేక తిరిగి ఇంజన్‌ని స్టార్ట్ చేసేడు. హారన్ లేని ఆటోరిక్షా ఎవరినైనా ఏక్షణమైనా గుద్దేస్తుందేమోనని బిక్కపోయి, ముందరున్న ఇనుపకడ్డీలని పట్టుకుని, పాలిపోయిన మొహంతో ఉన్న సురేష్‌ని చూసి,

"ఏం చెయ్యమండీ, లీటర్ పెట్రోల్ ఇరవైఆరు రూపాయలు" అన్నాడు ఆటోరిక్షా డ్రైవరు.

చిరునవ్వు నవ్వేడు ప్రసాదు.

మెల్లిగా సురేష్ మొహంలోనికి రక్తం తిరిగి చోటుచేసుకుంది. ఆటో జగదాంబ జంక్షన్‌కి వచ్చేసరికి, విశాఖపట్నంలో ఉన్న జనాభా అంతా ఒక్కసారే ఈ రోడ్డుమీదకి వచ్చేరా? అనిపించేంత జనాన్ని చూడగానే సురేష్‌కి మతిపోయింది. న్యూయార్క్‌లో ఉంటున్న సురేష్‌కి, రోడ్డుమీద ఎక్కువగా జనాల్ని చూడడం సామాన్యమైనా, అస్తవ్య

స్తంగా ఉన్న పరిస్థితి చూసి నోరు వెళ్ళపెట్టేడు. రోడ్లమీద అన్నిరకాల వాహనాలూ, ఒకదానితో ఒకటి పోటీపడుతూ పరిగెడుతున్నాయి. గోడలమీదున్న వాల్‌పోస్టర్లని తిని నెమరువేసుకుంటున్న ఆవులు, ఎద్దులు, ప్రశాంతంగా రోడ్లమధ్య కూర్చుని ఉన్నాయి.

"విశాఖపట్నం జనాభా ఎంత?" అనడిగేడు సురేష్.

"ప్రజలని చూడగానే భయపడ్డావా? పదిహేనేళ్ళక్రితం మూడు లక్షలు, ఈనాటికి ఇరవై లక్షలకి చేరింది" అన్నాడు ప్రసాద్.

ప్రజ! భూమి ఈనినట్లున్న ప్రజ!

ప్రజలు ఎక్కడ పడితే అక్కడ రోడ్లని దాటుతున్నారు.

ప్రజలకి పనికివచ్చే కాలిబాటమీద దుకాణాలు,

మురికి కాలవని కప్పడానికి వేసిన రాళ్ళమీద కుళ్ళు, పీతుళ్లు.

రోడ్లమీద ఎక్కడచూసినా గతుకలే. కాలిబాటమీద నడిచే వీలులేక, ప్రజలు రోడ్లమీదే నడుస్తున్నారు.

కొన్ని రోడ్ల కూడలిలో నిలబడ్డ పోలీసు, ట్రాఫిక్‌లైటు గురించి పట్టించుకోకుండా వాహనాలు పరిగెడ్తున్నాయి.

కిక్కిరిసిన బస్సులలో తొక్కిడికి అలవాటుపడిన ప్రజలు!

ముందుకి వెళ్ళడానికి వీలులేక సురేష్, ప్రసాదులున్న ఆటో, రెండు బస్సుల మధ్య ఆగింది.

"రుమాలుతో మొహాన్ని కప్పుకో" అని ప్రసాదు సురేష్‌ని హెచ్చరించేలోగా, ముందర నించున్న బస్సులోంచి వెలువడిన నల్లని ఎగ్జాస్ట్ సురేష్ మొహాన్ని తాకి, అతనిని ఉక్కిరిబిక్కిరి చేసింది.

"ఇలాంటి గాలిని పీలుస్తున్న విశాఖపట్నంలో సగం జనాలకి కేన్సర్, మిగతా సగం జనాలకి ఊపిరితిత్తుల జబ్బులు వస్తాయి" అన్నాడు సురేష్.

"మాదేశంలో కేన్సర్, ఎయిడ్స్ చావులు లేవంటుంది ప్రభుత్వం. ఏది వచ్చి చనిపోయినా, అన్నీ సామాన్యపు చావుకిందే లెఖ్ఖ పెడతారు" అన్నాడు ప్రసాదు.

ఆటో దిగి నడక ప్రారంభించేరు.

కనకమహాలక్ష్మి గుడి చూసేక, "ఇహ చాలు, తలనొప్పిగా ఉంది, ఇంటికి వెళదాం" అన్నాడు సురేష్.

"అయామ్ సారీ. వెళ్దాం... మీడేడీ అద్దెకి ఉన్న ఇల్లు ఇక్కడకి చాలా దగ్గరే, అది చూసి వెళదాం" అంటూ సురేష్‌ని చెంగలరావు పేటలో సున్నపు వీధి దగ్గరకి తీసుకొచ్చి,

"అదిగో, ఆ తెల్ల డాబా పక్కన ఉన్న ఇంటిలో మేడమీద ఉండేవారు" అని ఆ ఇంటివేపు చూపించేడు.

నిర్వికారంగా, నిర్లిప్తంగా ఉన్న వీధిలో, వందల సంఖ్యలో ఉన్న ఇళ్ళలో అదొకటి.

ప్రసాదు చూపించిన ఇంటివేపు పరీక్షగా చూసేడు. కాని ఆ ఇల్లు పాతజ్ఞాపకాలని రేకెత్తించలేదు. వాన చినుకులు మొదలవడంతో, ఎదురుగా కనబడిన కేసెట్ సెంటర్‌లో దూరేరు ఇద్దరూ.

"ఆటో దొరకగానే వెళ్ళిపోదాం. అంతదాకా కేసెట్లు చూడు" అంటూ ఆటో కోసం చూడసాగేడు ప్రసాదు.

వాన ఉధృతం ఎక్కువైంది. ఇరవై నిమిషాలు గడిచేసరికి సున్నపు వీధిలోంచి, ఇతర సందులలోంచి నీరు వాగులా వచ్చి, దిగువ ప్రదేశమైన కొత్త రోడ్డు జంక్షన్‌వేపు ఉరకలెత్తుతూ పారుతోంది.

కొంతమంది ఇవేవీ పట్టించుకోకుండా ఆ నీళ్లలో నడిచి వెళ్తున్నారు.

ఆ దారంబటే వస్తున్న ఖాళీ ఆటోని ఆపి దానిలోనికి ఎక్కేరు. కొత్త దారంట వెళ్తున్న ఆటో దాదాపు మోకాలు లోతున్న భయంకరమైన దుర్గంధపు నీళ్లలోంచి మొరాయిస్తూ నడుస్తుంటే భయంగా ఆ నీళ్ళని చూస్తూ,

"మనం ఇందాక ఈదారంట రాలేదే" అన్నాడు సురేష్.

"అది వన్‌వే ట్రాఫిక్" అని సమాధానమిచ్చేడు ప్రసాదు.

ఇల్లు చేరేక, ఆటో దిగుతూ,

"నువ్వు అదృష్టవంతుడివే. ఆటోగాని పూర్ణా టాకీస్ దగ్గర ఆగి ఉంటే" అంటూ పకపకా నవ్వేడు ప్రసాద్.

పేలవంగా నవ్వేడు సురేష్.

"అమ్మా, రెండు కప్పుల కాఫీ. సురేష్ అన్నయ్యకి రెండు ఏస్ప్రిన్ మాత్రలు" అంటూ అరుస్తూ వంటింటిలోనికి తల్లిదగ్గరకి వెళ్ళాడు.

కాలిజోళ్ళని విప్పుకుని, కాళ్ళు కడుగుకోవడానికి బాత్రూంవేపు నడిచేడు సురేష్.

ప్రసాదు చెప్పినది నిజమైతే, ఇరవై లక్షలున్న విశాఖపట్నం కార్పొరేషన్‌కి చాలా ఆదాయం ఉంటుంది. పట్టణంలో ఎక్కువ పోలీసు సిబ్బంది కాని, అగ్నిమాపకదళం కాని కనిపించలేదు. అధ్వాన్నంగా ఉన్న రోడ్లు, పారిశ్రామిక శుభ్రత! ప్రభుత్వ పాఠశాలలు చూడడానికి ఘోరంగా కనపడుతున్నాయి. ప్రజలని ఆదుకునే సాంఘిక కార్యక్రమాలు కనబడవు. అంటే, ప్రజలు ఎన్నుకున్న కౌన్సిలర్లు, కార్పొరేషన్ అధికారులు, ప్రజల సొమ్ముని స్వంతానికి ఉపయోగించుకుంటున్నారన్న మాట!

ఇరవై లక్షల ప్రజలు!

అమ్మో! ఇదే అమెరికా అయితే ఎంత అలజడి చేసేవారో? ఎంత దుమ్మెత్తిపోస్తారో?

డెమోక్రసీ అని గర్వంగా చెప్పుకుంటున్న ఇండియాలో, దాని విలువ ప్రతినిధులని ఎన్నుకునేవరకు కాబోలు. తరువాత సామాన్య మానవుని గోడుకి విలువ సున్నా! చిన్నాన్న వివరించినట్లు అరాచకత్వంలో బాగుపడుతున్నది, మెరుగౌతున్నది బలవంతుడే.

తండ్రి నలభై ఏళ్లక్రితం డైరీలో "హిందూ దేశం బీదదేశమైనా మానవత్వానికి విలువనిచ్చే దేశం" అని రాసుకున్నాడు.

అది బహుశా ఆనాటి రోజుల్లో నిజమేమో! కాని ఈనాడు, తను చూసినంతమట్టుకు, ప్రజలకి డబ్బుంటే పడిచచ్చే ధోరణి అమెరికాలో ఉన్నదాని కంటే ఏమీ తీసిపోదు.

. ఇహ, మానవత్వం!

చూడాలి, అది ఎంత మట్టుకు నిజమో, అనుకుంటూ ఖాళీ కప్పుని కింద ఉంచేడు సురేష్.

★ ★ ★

ఫాన్ ఆగిపోవడంతో, దోమతెరలో నిద్రపోతున్న సురేష్‌కి తెలివివచ్చింది.

తెల్లవారడానికి ఇంకా చాలా వ్యవధి ఉన్నట్లుంది. బహుశా ఇప్పుడు మూడో, నాలుగో అయిఉండవచ్చు అనుకుంటుంటే ఫాన్ తిరగడం మొదలయింది.

దోమతెరలోంచి బయటకి వచ్చి లైటువేసి చూస్తే గడియారం మూడున్నర చూపిస్తోంది.

నిద్రవచ్చేసూచనలేమీ కనిపించక, బాల్కనీ తలుపు తెరచి, బయటకి వచ్చి సిగరెట్ వెలిగించేడు. తెల్లవారడానికి ఎంత లేదన్నా రెండు గంటలుంది, ఏదైనా చదువుదామని లోపలికి వెళ్ళబోతుంటే తిరిగి ఎలక్ట్రిసిటీ పోయింది.

చేసేదేమీలేక బాల్కనీలో కుర్చీవేసుకుని, ఆకాశంవేపు చూసేడు.

లెఖ్ఖలేనన్ని నక్షత్రాలు మినుకుమినుకుమని ప్రకాశిస్తున్నాయి. అంతకు తప్ప ఎక్కడా వెలుతురు లేదు.

చిక్కటి చీకటిలో దగ్గరగా కదులుతున్న సముద్ర కెరటాలు ఒడ్డుకు వచ్చి చేస్తున్న శబ్దం మెల్లిగా వినిపిస్తోంది. తొందరలేనట్టు, బద్ధకంగా ఒడ్డుకు వస్తున్నట్లుంది కెరటాలశబ్దం.

ఒక్కసారిగా వీధిలైట్లు వెలగడంతో, బాల్కనీకి ఎదురుగా ఉన్న మైదానంలో ఎదిగిన చింతచెట్టుమీద మసకమసకగా వెలుతురు పడింది.

వికృతంగా, పిచ్చిది జుత్తు విరబోసుకున్నట్లుంది చింతచెట్టు. జడలు కట్టిన బైరాగి జుత్తులా, చింతకాయల గుత్తులు చెట్టు నుంచి వేలాడుతున్నాయి. ఒక్కసారి బలంగా గాలివీచి, కొమ్మలు, కొమ్మలతో పాటు చింతకాయలు ఊగడంతో రవ్వంత భయంగా, ఆశ్చర్యంగా దానివేపు చూస్తూ ఆలోచనలోపడ్డాడు సురేష్.

"నీకు ఎవరో స్త్రీ అమెరికానుంచి ఫోన్ చేసింది. కాని పేరు చెప్పలేదుట" అన్నాడు ప్రసాదు, ముందర్ర రోజు సాయంకాలం, తను వాహ్యాళినుంచి తిరిగి వచ్చేక.

తన ఈ విశాఖపట్నం టెలిఫోన్ నెంబరు చాలా తక్కువ మందికే తెలుసు. ఎవరు ఫోన్ చేసి ఉంటారబ్బా? అని ఎంత గింజుకున్నా సరి అయిన సమాధానం దొరకలేదు. కేతరీన్ చేసిందా? కేతరీన్ తనకి ఫోన్ చేయవలసిన అవసరమేముంటుంది?

కేతరీన్‌కి సంబంధించిన ఆలోచన తనకి ఎప్పుడూ తలనొప్పి తెప్పిస్తుంది!

కలుషితవాతావరణం, దుర్గంధపూరితమైన నీళ్ళు, పరిశుద్ధతలేకుండా ఉన్న గుడి, గుడి చుట్టూ ఉన్న పరిసరప్రాంతం అలవాటులేక, తనకి ముందటిరోజు తలనొప్పిని చాలాకాలం తరువాత తిరిగి తెప్పించేయి.

చర్చికి వెళ్ళడం తనకి సరిపడేదికాదు. గుడికి రావడానికి కేతరీన్ ఇష్టపడేది కాదు. గుడికి వెళ్ళాలని ప్రత్యేకమైన ఆసక్తిలేని తను గుడి మాట మరచిపోయినా, ఆమె చర్చికి వెళ్ళినపుడు, తను కలిసివెళ్ళడం లేదని గొడవపెట్టేది. ఆ సణుగుడు భరించలేక, ఒకసారి ఆమెతో చర్చికి వెళ్ళేడు ఓ ఆదివారం ఉదయం.

తెలియని ప్రదేశం, తెలియని మతం, తెలియని వ్యక్తులు. ఆ వాతావరణంలో ఇమడలేక ఉక్కిరిబిక్కిరయేడు. అక్కడ తనని పలకరించే నాథుడేలేడు. అది జరిగేక తను చర్చికి వెళ్ళడానికి చూపించిన విముఖత, ఇద్దరి మధ్యా మరొక దట్టమైన తడకని నిలబెట్టింది.

తాము విడిపోవడానికి మతం ఒక కారణమౌతుందని తను ముందుగా ఊహించలేదు!

గాలివేగం పెరిగి, దట్టంగా ఉన్న చెట్లని కుదిపి, సముద్రపు ఒడ్డున ఉన్న సరుగుడు తోటలోనికి దూసుకెళ్ళింది. పరిసరాల ఉనికే పట్టించుకోకుండా, అందమైన యువతి సన్నజాజులని దారంతో చుడుతూ, కూనిరాగం తీస్తుంటే వెలువడిన మధురమైన శబ్దంలా, తెరతెరలుగా వీస్తున్న గాలి, సన్నని శబ్దాలని ఆకాశంలోనికి వెదజల్లుతోంది.

కూనిరాగం! తండ్రిని అంతగా ఆకర్షించిన సంధ్య ఎక్కడుందో? ఆమె కంఠం అంత శ్రావ్యంగా ఉండేదా? లేక, ఆరాధనలో మునిగిన తండ్రి ఊహేనా? కాకినాడ వెళ్ళి అత్త ద్వారా సంధ్యని తను కలవగలిగితే, తద్వారా తండ్రి గురించి మరికొంత తెలుసుకోగలడు.

వికృతంగా ఊగుతున్న చింత చెట్టుకొమ్మలులా, ఆవలకి నెట్టినా వదలని కేతరీన్ ఆలోచనలకి, ప్రత్యేకంగా ఆలోచించకపోయినా డైరీలోంచి బయటపడి, తనని చుట్టుముట్టి ఆక్రమించుకున్న సంధ్య గురించి ఆలోచనలకి ఎంత తేడా! ఒక వ్యక్తి జ్ఞాపకాలు తలనొప్పి తెప్పిస్తుంటే, తెలియని ఇంకొక వ్యక్తి గురించి ఊహలు, అర్థంకాని ఉత్సాహాన్ని కలిగిస్తున్నాయి.

దూరంగా చెట్లమధ్యనుంచి ఎరుపురంగు పొడ చూపడం మొదలయింది. రంగులో ముంచిన కుంచెకి రంగు సరిగ్గా అంటుకోనపుడు దుప్పటిమీద వేసిన రంగులా ఆకాశం

మీద ఎరుపురంగు అతి పల్చగా అద్దుకుంది. క్రమంగా, మత్తు వదిలించుకుని, గుర్రాలని అదిలించి అరగంటలో భూమిలోంచి చొచ్చుకువస్తూ గంభీరంగా, వణుకులేకుండా మీదకి లేచే గాలిపటంలా మీదకి లేస్తూ అశ్వారూఢుడు అందరినీ లేపుతున్నాడు.

రోడ్లమీద ఆవులు, గేదెలతోపాటు జనసంచారం మొదలయింది.

ఇండియాలో జీవిత విధానానికి, అమెరికాలో జీవితపు పరుగుకి ఎంత తేడా! అక్కడ, పాము వెనకాతల పడి తరిమినట్లు అన్నింటికీ పరుగులైతే, ఇక్కడ జీవితం ఇంపైన నిదురమత్తులా వెళ్తుంది అనుకుంటూ పళ్ళు తోముకోవడానికి లేచేడు సురేష్.

"రాత్రి సరిగ్గా నిద్రపట్టలేదేమిటి? కళ్ళు ఎర్రపడ్డాయి? " అనడిగింది శారద కాఫీ కప్పు సురేష్‌కి అందిస్తూ.

"నాలుగు గంటలకి తెలివివచ్చింది. బాల్కనీలో కూర్చుని సూర్యోదయాన్ని చూసేను. ఎంత బాగుందో పిన్నీ" అన్నాడు సురేష్ కాఫీ చప్పరిస్తూ.

"పీత కష్టాలు పీతవి. సూర్యోదయం గురించి ఎవడు పట్టించుకోగలడు? ఆయన లేచేసరికి ఆలస్యమవుతుంది. గానీ నువ్వు టిఫిన్ కానిచ్చేస్తావా? పదిహేను నిమిషాలలో ఇడ్లీలు తయారవుతాయి" అంది శారద.

"నేను చిన్నపుడు అద్దెకున్న ఇంటిని ప్రసాదు చూపించినా ఏమీ జ్ఞాపకానికి రాలేదు. ఈవేళ విజయనగరం వెళ్ళి మా డేడీ చదువుకున్న హైస్కూలు, కాలేజీ చూద్దాం అన్నాడు ప్రసాదు. బహుశా పది, పదిన్నరకి వెళ్తాం. కాఫీ చాలా బాగుంది, మరొక రౌండ్‌కి ఫిల్టర్ వేయి" అన్నాడు లేస్తూ.

"అవి చూసి ఆశాభంగం పొందుతావు. జాగ్రత్త"

"నేనేమైనా ఆశిస్తే కదా నాకు ఆశాభంగం అవుతుంది. ఒకసారి వెళ్ళి చూసి వస్తాం. అంతే"



"కాలంతోపాటు అన్ని పట్టణాల జనాభాలో పెరుగుదల ఉంది కాని, విజయనగరం జనాభాలో చెప్పుకోతగ్గ మార్పులేదు. దీనికి ముఖ్యకారణం ఇది విశాఖపట్టణానికి దగ్గరగా ఉండడమే. గిడసబారిన సొరకాయలా, కొమ్మలు నరకబడిన చెట్టులా, కంపనంలేకుండా నిశ్చలంగా ఉండిపోయింది, ఎంతోమందికి చదువుని ప్రసాదించిన ఈ విజయనగరం" అంటూ తెలాతెలాపోతున్న విజయనగరాన్ని చూపిస్తూ,

"ఎక్కడెక్కడికి వెళ్దాం? " అనడిగేడు ప్రసాదు, నాన్‌స్టాప్ బస్ విజయనగరం డిపోలో ఆగేక.

"నాకేమీ ప్రత్యేకమైన ఊహలు లేవు. ఈ ప్రదేశాలు నాకు పరిచితమైనవికావు. మా డేడీ అయ్యకోనేరు గురించి, తను చదువుకున్న కాలేజీ గురించి డైరీలో రాసుకున్నది చదివేను. అలా తిరుగుదాం. సాయంకాలానికల్లా విశాఖపట్నం వెళదాం. ఈ ఊరిలో అంతా నీ సారధ్యమే. నువ్వు ఎలా చెప్తే అలా చేద్దాం"

"మనం పన్నెండు- పన్నెండున్నర గంటలకి వస్తామని మామావయ్యకి ఫోన్‌చేసి చెప్పేను. వాళ్ళ ఇల్లు అయ్యకోనేటి ఒడ్డునే" అంటూ రిక్షా బేరమాడేడు ప్రసాదు.

కాలేజీ, రాజుగారి కోట చూసేక లింగ ధారి వీధి దగ్గర అయ్యకోనేరు గట్టున రిక్షా దిగి,

"మనం మెల్లిగా నడుచుకుంటూ వెళ్దాం" అని రిక్షా వాడికి డబ్బులిచ్చి పంపేసేడు ప్రసాదు.

కోనేరు నిండా తుమ్మతుప్పలు. పశువులు నేలని మొలిచిన రవ్వంత గడ్డినే కాక, తుమ్మచెట్లమీద పాకి ఉన్న పాదుల ఆకుల్ని ఒడుపుగా కొరికి తింటున్నాయి. కొందరు దానిని బహిరంగ ప్రదేశంకింద వాడుకుంటున్నారు. కోనేటికి పడమటిమూల కాస్త నీళ్ళున్న జాగాలో నీళ్ళు తక్కువై, నీరసంగా ముడుచుకుపోయిన కమలాలు. తండ్రి అయ్యకోనేరు గురించి,

"నిండు గర్భిణీలా, గట్టువరకు నిండిన నీటిలో విస్తరించి ఉన్న కమలాలు విచ్చుకుంటుంటే, వాటి అందంతో పోటీపడుతున్న సంధ్యతో నడక ఎన్ని జన్మల అదృష్టమో" అని డైరీలో రాసిన దానికి, పాడుపడి, ఎండి చిక్కిశల్యమై, పూర్తిగా తుడిచిపెట్టబడేదశలో ఉన్న ఈ కోనేరులాంటి బంజరుభూమికి మధ్య ముప్పయి ఏళ్ళు అనుకుంటుంటే,

"ఇక్కడ ఫ్లాట్లు కడతారుట. వచ్చేసారి నువ్వు వచ్చేసరికి ఇదీ కనిపించదు. అదేగా పురోగమనమంటే, అదిగో ఆ శిధిలకట్ట డాన్ని బాలాద్రి అంటారు, దాని గురించి చాలా కథలు ఉన్నాయి. రాజుగారు, వెన్నెల రాత్రుల్లలో తమ ప్రియురాలితో అక్కడకి వచ్చి కూర్చుని, కోనేటిలో కమలాల సముఖంలో, ప్రియురాలి కళ్లలో చంద్రకాంతిని చూసి తన్మయించేవారట! గత ఏభైఏళ్ళుగా ఆ కట్టడం శిధిలావస్థదశలో అలాగే ఉంది''

అంటూ ఒక పాడుపడిన ప్రాసాదాన్ని చూపించేడు ప్రసాదు. బాలాద్రివేపు, కోనేరు వేపు పరీక్షగా చూసి, "పద నడుద్దాం" అన్నాడు సురేష్.

మౌనంగా ఇద్దరూ, అయ్యకోనేరు దక్షిణగట్టున ఉన్న ప్రసాదు మామయ్య ఇంటికి నడక మొదలెట్టేరు.

"కాలం స్థంభించదు" అని అందరికీ తెలిసినదే అయినా, తండ్రి డైరీలలో ఉదహరించుకున్న ప్రపంచం తండ్రితోనే అంతరించినట్టుగా కనబడుతోంది. ఎంతో గర్వంగా తండ్రి తనలో పదిలపరచుకున్న అనుభూతుల ఛాయలు కూడా ఈనాడు కనబడ డంలేదు. ప్రదేశాలు సరే, కాని తండ్రిని ఆకట్టుకున్న సంధ్య మాటేమిటి? ఆమె కనిపిస్తే తను ఆనంద పడతాడా? లేక అక్కడా విషాదం ఎదురవుతుందా? అనుకుంటూ పరాకుగా ప్రసాదు పక్కన నడిచేడు.

"ఇది మాత్రం కాలధాటికి తట్టుకుని, చెక్కు చెదరకుండా నిలబడి ఉంది. ఆ గడియారాలు సరి అయిన కాలాన్నే చూపిస్తున్నాయి. మనరాష్ట్రంలో గంట స్థంభం అనగానే చాలామందికి ఎందుకో విజయనగరమే గుర్తుకువస్తుంది" అన్నాడు ప్రసాదు, ఎనభై అడుగుల ఎత్తులో షట్కు జాకారంలో ఉన్న ఎర్ర స్తంభాన్ని చూపిస్తూ.

స్తంభంచుట్టూ దానిని ఆనుకుని ఉన్న దుకాణాలలో మొలతాళ్ళు, పసుపు, కుంకుమ, పూసలు, నాటువైద్యానికి పనికి వచ్చే మందులు అమ్ముతున్నారు. దానిని దాటి ఇరవై ఇరవై ఐదడుగులు నడిస్తే పళ్ళ మార్కెట్.

"ఒక్కసారి రిక్షా ఆపు" అని రిక్షా దిగి పళ్ళమార్కెట్ లోనికి జొరపడ్డాడు సురేష్. ప్రసాదు ఆశ్చర్యంగా సురేష్‌ని గమనిస్తున్నాడు.

ముక్కులకి, చెవుల తమ్మెలకి రింగులతో, రవికెలు వేసుకోకుండా ఆడవాళ్ళు, తాటిరేకు గొడుగుల కింద కూర్చుని వివిధ రకాల

పండ్లని. అమ్ముతున్నారు. నిరంతరంగా మీదపడుతున్న ఎండకి, వానకి తట్టుకున్న వాళ్ళ శరీరాలు నల్లపడ్డాయి.

"పుసినాగపళ్ళు దొరుకుతాయా? " అనడిగేడు సురేష్, వయస్సు మళ్ళిన ఒక స్త్రీని.

"పుసినాగపళ్ళా బాబూ? మచ్చకొండ మీద పొదలే లేకపోతే పుసినాగపళ్ళు ఎలా వస్తాయి? అవి ఏనాటిమాట" అంటూ గుండెమీద చేతిని ఉంచుకుంటూ ఆశ్చర్యంగా చూసింది ఆ స్త్రీ.

రోడ్డు దాటి రిక్షా ఎక్కేడు సురేష్.

విశాఖపట్నంకి నాన్‌స్టాప్ బస్ విజయనగరం పొలిమేర్లని దాటి వేగం పుంజుకుంటుంటే, చీకటిని హత్తుకోవడానికి సంధ్య తొందరపడుతోంది. దట్టంగా ఉన్న మబ్బులు పడమటిని ఉన్న వెలుగుని మింగి అరిగించుకుంటున్నాయి. సూర్యుడు తూర్పుని అస్తమించేడనిపించేలా, పడమట కంటే తూర్పు దిశనే వెలుతురు ఎక్కువగా ఉంది.

తండ్రి పదిలంగా తన గుండెలో దాచుకున్న అనుభూతుల్ని, డైరీలలో రాసి పదిలపరుచుకున్నాడు. తండ్రిని అర్థంచేసుకుందామన్న తన తపనలో, ఆ అనుభూతుల చరిత్రని తను స్పృశించబోయేడు. కాని తండ్రి, తండ్రితోపాటు ఆ అనుభూతులు, ఏనాడో కాలపుపరుగులో కరిగిపోయేయి. అమెరికాలో పదహారు పదిహేడేళ్ళు వచ్చేక, తండ్రి కొడుకులమధ్య బాంధవ్యం స్నేహంగా మారుతుంది. కాని తను చూసినంతమట్టుకు ఇండియాలో అలా కాదు. ఇండియాలో పెరిగిన తండ్రి, అప్పుడప్పుడు దానికి ప్రయత్నించినా, తనతో స్నేహాన్ని పెంచలేకపోయేడు, అనుకుంటూ చీకటిలోనికి చూసేడు సురేష్.

★ ★ ★

"మనం కాకినాడ చేరేసరికి పన్నెండవుతుందా? " అనడిగేడు సురేష్, సూట్‌కేస్‌ని మీద ఉంచుతూ.

"ఆ! అవుతుంది. అక్కడ దిగేసరికి ఎండలు పేల్చకుండా ఇక్కడలా ఆకాశంలో మబ్బులు ఉంటే బాగుంటుంది. లేకపోతే నీకు కష్టం" అన్నాడు ప్రసాదు.

కిటికీని ఆనుకుని ఉన్న సీటులో కూర్చుని పేపర్లని తిప్పేడు సురేష్.

మూడవనంబరు ప్లాట్‌ఫారంమీద సింహాద్రి ఎక్స్‌ప్రెస్ నిలుచునుంది. ప్లాట్‌ఫారంమీద ప్రజలు హడావుడిగా తిరుగుతున్నారు.

ఉదయం ఏడున్నర అయింది.

మబ్బులు కమ్మిన ఆకాశం, ఎండరాకపోయినా చిటచిటలాడిస్తోంది. కొందరు పురుషులు అన్నిటికన్నా పై ఉన్న చొక్కా బొత్తాలని ఊడతీసి, కాలర్‌ని వెనక్కి తోసి ఫాన్‌కింద నిలుచుని గాలిని ఆస్వాదిస్తున్నారు.

ఏదో సినిమాలో సంజయదత్ ఛాతీని ప్రదర్శించినట్లు, మీదనున్న నాలుగైదు గుండీలని పెట్టుకోకుండా, బనియన్ లేని ఇరవై ఎనిమిదంగుళాల ఛాతీని, దానిమీదున్న రుద్రాక్షమాలలని, అటూఇటూ పరిగెడుతున్న ఆడపిల్లలకి చూపించడానికి అవస్థ పడుతున్నారు కొందరు కాలేజీ కుర్రకార్లు.

మరికొందరు మైకేల్ జాక్సన్, మైకేల్ జోర్డాన్ బొమ్మలున్న బనియన్లని ధరించి, సిగరెట్లని కాలుస్తూ, "మేన్, డిడ్ యు సీ దట్ ఫెంటాస్టిక్‌మూవీ" అంటూ జగదాంబలో నడిచే ఇంగ్లీషు సినిమా గురించి చర్చిస్తూ, జడ్డివాళ్లలా పదేపదే భుజాలెగరేస్తున్నారు.

రెండవ తరగతి పెట్టెలన్నీ నిండి ఉన్నాయి. మొదటి తరగతి పెట్టెలో సురేష్, ప్రసాదులే కాకుండా మరి నలుగురు మాత్రమే ప్రయాణీకులు ఉన్నారు.

బండి బయలుదేరడానికి ఇంకా ఇరవై నిమిషాలుంది. ఒకటవ నంబర్ ప్లాట్

ఫారం గేటులోంచి జొరబడి, ఓవర్‌బ్రిడ్జీ మీద ఒకర్ని ఇంకొకరు తోసుకుంటూ, సింహాద్రి ఎక్స్‌ప్రెస్ అందుకోవడానికి పరిగెత్తుకు వస్తున్న జనాభాని చూస్తుంటే వింతగా ఉంది సురేష్‌కి.

ఎంత జనాభా!

ఇంతమందికి వనరులు, వసతులు కలిగించాలంటే సామాన్యంకాదు. ఇప్పుడున్న జనాభాలో సగమే ఉంటే, ఈదేశం ఎంత సుభిక్షంగా ఉండేదో!

ప్లాట్‌ఫారంమీద అడుక్కుంటున్న పిల్లలు. ఆలోచించకుండా భగవంతుడిచ్చేడని కనేసిన పిల్లలు! పున్నామనరకం నుంచి తప్పిస్తాడని మొగపిల్లవాని కోసం అర్రులు చాస్తుంటే బిలబిలా పుట్టుకొచ్చిన ఆడపిల్లలు!

ఎంత జనాభా!

పోలియో వచ్చి ఒక కాలు పూర్తిగా చచ్చుపడిపోయిన వ్యక్తి ఈడ్చుకుంటూ రైలుపెట్టెలోనికి ఎక్కడానికి కష్టపడుతుంటే ఎవరూ పట్టించుకోవడంలేదు.

ప్రజలలో ఈ ఉదాసీనతకి కారణమేమిటి? ఆ వికలాంగునికి కాస్త చేయూతనిస్తే ఎవరికీ ఏమీ నష్టం రాదే!

మరి ఎందుకు జనం పట్టించుకోవడం లేదు?

తండ్రి డైరీలో ఉదహరించిన మానవత ఉన్న ప్రజ ఏదీ? ఓ మానవతా ఎక్కడ దాక్కున్నావు? అని బాధపడుతూ కళ్ళు మూసుకున్నాడు సురేష్.

ప్రజలని గమనిస్తున్న సురేష్ మొహంలో మారుతున్న రంగుల్ని చూసి ప్రసాదుకి అర్ధమైంది సురేష్‌బాధ. "ఇదంతా నీకు కొత్త కాబట్టి అలా అనిపిస్తుంది. ప్రొద్దున్న లేచిన దగ్గరనుంచి, రాత్రి నిద్రపోయేవరకు ఈ బీదరికాన్ని, వైపరీత్యాలని చూసి చూసి మేం మొద్దుబారిపోయేం" అన్నాడు ప్రసాదు.

"కాని...." అంటూ ఏదో చెప్పబోయాడు సురేష్.

"ఎదురుగా కనిపించేదాన్ని గురించి నువ్వు బాధపడుతున్నావు. కాని కనిపించని కథలెన్నో? ఎం.ఏ. పాసయి, మూడు సంవత్సరాలుగా ఉద్యోగం కోసం నేను ఎక్కని గడపలేదు, పట్టుకోని కాళ్ళు లేవు. ఉద్యోగాలే తక్కువ. ఆ ఉన్న అతి తక్కువ ఉద్యోగాలనీ రిజర్వేషన్ల పేరిట ఎవరెవరికో కట్టపెడుతున్నారు. ఆడవాళ్లకి, వికలాంగులకి, ఇలాంటివాళ్ళ గురించే ఆలోచిస్తోంది ప్రభుత్వం. కాని చదువుండి సంవత్సరాల తరబడి ఉద్యోగం లేకుండా తిరుగుతున్నవాళ్ళ సంగతేమిటి? ఉద్యోగాలులేక, పెళ్ళవక, కుమిలి బ్రతుకుతున్న స్త్రీల సంగతేమిటి? బలహీనవర్గాల గురించి పట్టించుకునే ప్రభుత్వం ఆర్ధికంగా బలహీన వ్యక్తుల గురించి కూడా పట్టించుకోవాలి. పోలీసు సబిన్స్‌పెక్టర్‌కి, ఎలిమెంటరీ స్కూలు మేస్టర్ల ఉద్యోగాలకి లంచం లక్ష! ఎక్కడనుంచి తేగలరు? ప్రభుత్వం బలహీనవర్గాలకంటూ స్కాలర్‌షిప్పులు తెగ ఇస్తోంది. ఒకసారి నిన్ను ఆ హాస్టల్‌కి తీసుకెళ్తాను. నీ అంతట నువ్వే చూద్దువుగాని. ప్రభుత్వం ఇచ్చిన డబ్బుతో తాగుడు, వ్యభిచారం. ఎంత దురుపయోగమో! ఓట్లు ఎక్కడ ఉంటే అక్కడ ప్రజలని దువ్వి, రాజకీయనాయకులు వాళ్లని చదరంగంలో పావులలా వాడుకుంటున్నారు. నాలాంటి దిగువ మధ్యతరగతి గురించి పట్టించుకోనవసరం లేదు ప్రభుత్వానికి" అన్నాడు ప్రసాదు జేవురించిన మొహంతో.

"ఆ యామ్ సారీ" అన్నాడు సురేష్.

"తలనొప్పి తనదాకా వస్తేకాని తెలియదుట. నేనొక అమ్మాయి అంటే మనసు పడ్డాను. ఉద్యోగం వస్తేకాని ఆమెని పెళ్ళి చేసుకోవడానికి అర్హతరాదు. ఈ పరిస్థితులలో ఆమె నా గురించి ఎన్నాళ్లు నిరీక్షిస్తుంది? త్వరలో ఆమెకి పెళ్ళయిపో

తుంది. ఎండ్రిన్ కొనుక్కుని చద్దామన్నా డబ్బులు కావాలి, నాన్నని అడిగి కొనుక్కుని చావాలి" అంటున్న ప్రసాదు కళ్ళలో నీళ్ళు చూసి విచారపడ్డాడు సురేష్. మాటలాడ కుండా పరీక్షగా ప్రసాదుని గమనించేడు.

ఐదడుగుల తొమ్మిదంగుళాల పొడవు, నూటనలభై పౌనుల బరువు, చామన ఛాయ, విశాలమైన నుదురు, చిన్ననోరు, బలమైన శరీరభాగాలు, ఏ లోపమూలేని ఈ యువకునికి, ఏ ఉద్యోగమైనా చేయడా నికి తయారుగా ఉన్న వ్యక్తికి పనిలేదు. ఎంత దారుణం అనుకున్నాడు సురేష్.

"పెదనాన్న ఈ దేశం వదిలి, నిన్ను అక్కడకి తీసుకెళ్ళేడు. హాయిగా అక్కడే ఉండు. ఇక్కడ గొడవలకి నీ దగ్గర పరిష్కా రమార్గాలు ఏమీలేవు" అంటూ సురేష్‌వేపు చూడకుండా, ఎర్రపడినకళ్ళు కనిపించకుండా పేపరు తిప్పి దానిలో తలదాచుకున్నాడు ప్రసాదు.

మాటలు పెంచడానికి ఇష్టంలేక బయ టకి చూడసాగేడు సురేష్.

కొబ్బరి పచ్చడితో తిన్న ఇడ్లీలు, సగం తెరచి ఉన్న కిటికీలోంచి తోసుకొస్తున్న చల్ల గాలి చేతులు కలపడంతో, సింహాద్రి ఎక్స్ ప్రెస్ వాల్తేరు స్టేషనునుంచి బయలుదేరిన అరగంటలో, సురేష్ కళ్ళు మెల్లిగా మూత పడ్డాయి.

"టికెట్ ప్లీజ్" అన్న టికెట్ కలెక్టర్ మాట వినగానే తెలివి వచ్చింది. ప్రసాదు జేబులోంచి రెండు టిక్కెట్లు తీసి అతనికి అందిచ్చేడు. టిక్కట్లు మీద సంతకంలాంటి దేదోపెట్టి, టిక్కెట్లని తిరిగి అందిస్తూ, మీద ఉంచిన సురేష్ సూట్‌కేసువేపు పరీక్షగా చూసి, ముందరకి కదిలి వెళ్ళేడు టికెట్ కలెక్టర్.

యలమంచిలి స్టేషన్‌నుంచి రైలు బయ లుదేరి వేగం పుంజుకుంది. రైలు పట్టాలకి ఇరువైపులా, కనుచూపు మేర వరకు పచ్చని పొలాలు లేదా చెరకు తోటలు ఉన్నాయి. ఒకపెద్ద చేదని ఇద్దరు పట్టుకుని, చెరువుల లోంచి కాలవలలో ప్రవహిస్తున్న నీళ్ళని పొలాలలోకి వంచుతున్నారు.

దూరంగా, గోచీ తప్ప ఇంకే ఆచ్ఛాదనా లేని కొందరు, నూతిలోంచి ఏతాముని ముంచి, కాలవలలోనికి నీటిని లాగుతు న్నారు.

ఆడా, మగా, పొలాలలో నారుమడిలోంచి తీసిన వరి మొకలకలని నీరు నిలవున్న మడులలో నాటుతున్నారు.

ఇంత కష్టపడుతున్నారని, వాళ్ళ ఇబ్బంది పెంచడానికి ఇష్టంలేక కాబోలు, సూర్యుడు మేఘాల వెనక దాక్కొన్నాడు. పొలాల మీద నుంచి వస్తున్న పసరుగాలి, సురేష్ మొహాన్ని తాకి, మీదకి లేచి జుత్తుని అస్త వ్యస్తం చేస్తోంది.

పచ్చని పొలాలు! కనుచూపుమేర వరకు మచ్చలులేని పచ్చని పొలాలు! రైలు పరిగె డ్తుంటే, పది పన్నెండేళ్ళున్న కుగ్రామాలని దాటి వెళ్తుంటే, చిన్నపిల్లలు, దిసమొలలతో, పొట్టిలాగులతో పరిగెత్తుకుంటూ బయటికి వచ్చి కేరింతలు కొడుతూ, చేతులు ఊపుతు న్నారు. కలుషితమవని వాతావరణం ఎంత బాగుందో! అనుకుంటూ కిటికీలోంచి వస్తున్న గాలి ఉధృతంగా ఉండడంతో, కళ్ళని చికిలిస్తూ, బయటకి చూస్తూ గుండె లనిండా ఊపిరి పీల్చుకున్నాడు సురేష్.

మత్తుగా గాలి పీలుస్తున్న సురేష్‌వేపు దృష్టి సారించేడు ప్రసాదు.

దాదాపు ఆరడుగులు పొడవు, నూట ఏభై పౌనుల బరువు, కోల మొహంమీద బల మైన ముక్కు, సన్నని పెదిమలు, కండ పట్టిన చెక్కిళ్ళు, రెండు కనుబొమ్మల మధ్య జాగా. కాస్సేపు నిద్రపోవడం వలన ఎర్రప డిన కళ్ళు కనురెప్పల క్రింద నల్లని చారి కలు. చుండ్రులేని శుభ్రమైన జుత్తు గాలికి అటూఇటూ ఊగిసలాడుతోంది.

"ఆ పరిగెడుతున్న పక్షులని చూడు,

చాలా బాగుంది వాతావరణం" అని సంభాషణ అందుకున్నాడు సురేష్.

"అవును ఈ కోస్తా ప్రాంతం పంటలతో పచ్చగా ఉంటుంది. ఆహారం సమృద్ధిగా దొరుకుతుంది కాబట్టి పక్షులు కనిపిస్తాయి ఇక్కడ. మనం సామర్లకోటలో రైలు దిగేంతవరకూ ఇలాగే పొలాలని చూస్తావు" అన్నాడు ప్రసాదు.

కాస్సేపాగి, "నువ్వున్న ప్రదేశం ఎలా ఉంటుంది" అనడిగేడు.

న్యూయార్క్ జనాభా పది మిలియన్ల పైనే ఉంటుంది. న్యూయార్క్, న్యూజెర్సీ రాష్ట్రాలలో అన్ని రకాల ఇండస్ట్రీలు ఉన్నాయి. వాటిల్లో ఎక్కువ శాతం కెమికల్ కంపెనీలు. ఈ దేశమంత కాకపోయినా రాష్ట్రాలలో జనాభా దట్టంగానే ఉంటుంది. పట్టణాలలో పనిచేయడానికి, వాటికి దూరంగా నివసిస్తూ, రైళ్ళలోకాని, కార్లలోకాని ప్రతీరోజూ ప్రయాణం చేస్తారు. అక్కడ రైళ్ళన్నీ ఎయిర్ కండిషన్డ్. బయటవున్న గాలి పీల్చం. కెమికల్ కంపెనీలు న్యూజెర్సీ ప్రాంతంలో ఎక్కువగా ఉండడంతో కలుషితమైన వాతావరణం కనిపిస్తుంది. మీదకి లేచే పొగలు, రైలుపట్టాల పక్కన కనిపించే గుంటలలో చిన్నచిన్న చెరువులలో, నాచురంగుతో వున్న కెమికల్స్ అట్ట కట్టి తేలుతూ కనిపిస్తాయి. కాని న్యూయార్క్ వదిలి, దూరంగా ప్రయాణం చేస్తుంటే రోడ్లకి, రైలుమార్గానికి ఇరువైపులా ఏపుగా ఎదిగిన చెట్లు, దాదాపు నూరు-నూట ఇరవై అడుగులు ఎత్తున్నవి కనిపిస్తాయి. ఒకేదశలో, ఒకేసారి, ప్రక్కప్రక్కన ఐదు కార్లు ప్రయాణం చేసే రోడ్లు కొన్నే అయినా, కనీసం మూడుకార్లు ప్రయాణం చేసే రోడ్లు అతిసామాన్యం. ఈ పెద్ద రోడ్ల మీద మనుష్యులు కనబడరు. వ్యవసాయం ఎక్కువగా చేసే రాష్ట్రాలలో, వందల వందల ఎకరాలకి నీళ్ళు పెట్టడానికి, కన్నాలున్న పెద్ద పెద్ద ప్లాస్టిక్ పైపులని వాడతారు. వెయ్యి, పన్నెండువందల అడుగులు పొడవున్న ఈ పైపు చక్రాలమీద నడుస్తూ నీళ్ళని వెదజల్లుతుంది. అన్నింటికీ భారీపని ముట్లని వాడతారు. కేలిఫోర్నియాలో పంటలు పండించేవిధానం చూడాల్సిందే. ఆశ్చర్యం ఏమిటంటే చాలామంది అమెరికన్లు, వ్యవసాయం లాభసాటికాదని చెయ్యడానికి ఉత్సాహం చూపించరు" అని వివరించేడు సురేష్.

"ఇక్కడ కూడా అదే ధోరణి వస్తోంది. వ్యవసాయం వదిలి ఆక్వాకల్చర్ అంటూ రొయ్యల వ్యాపారం లోనికి దిగుతున్నారు"

"ప్రసాద్, నీకు స్కూటర్ రిపేర్ వచ్చా?"

"రాదు... చేతులనిండా నూనె, దుమ్ము, మరకలు. ఎవడు పడతాడు ఆ బాధలన్నీ? మెకానిక్ దగ్గరికి తీసుకెళ్తే వాడే సరిచేస్తాడు"

"మనకీ, అమెరికాలో ఉన్న వ్యక్తులకీ ఉన్న ఒక తేడా అదొకటి. మనం దినదిన అవసరాలకి కావలసినదానికన్నా, ఇతరుల మీద ఎక్కువ ఆధారపడతాం. ఇంటికి సున్నం వేయడం, ఇంటి ముందు, వెనకా జాగాలని శుభ్రంగా ఉంచడం, మనం వాడే పనిముట్లకి, పరికరాలకి వచ్చే రిపేర్లు చేయడం అక్కడ ప్రతి ఒక్కరూ నేర్చుకుంటారు. అది మనిషికి మంచి ధైర్యాన్ని కలుగచేస్తుంది. ఇండియాలో చాలా శాతం మనుష్యులు పొలాలలో పనిచేస్తారు. కాని చూడు, మనం సమర్థతగల పనిముట్లని వాడుతున్నామా? సమర్థత గురించి మనం ప్రత్యేకంగా పట్టించుకోం. పని జరుగుతోంది. రోజువెళ్ళింది అనే ధోరణి ప్రబలింది. కొత్తమార్గాలు తొక్కడానికి ఆసక్తి లేదు. కొన్నిచోట్ల సాంప్రదాయం, ఆనవాయితీ అంటూ అనవసరంగా వెనకపడుతున్నాం"

"నువ్వు చెప్పిన దాంట్లో నిజమున్నా దానిలో సాధకబాధకాలున్నాయి. నువ్వు

చెప్పినట్టు చేస్తే కొన్ని వృత్తులు మూలపడతాయి. కొందరికి జీవనోపాధి పోతుంది. ఈ మధ్యన పాత సినిమా చింతామణి చూసాను. దానిలో హీరోయిన్ భానుమతి, హీరో రామారావు. భానుమతి, సకలకళా పారంగతుడైన రామారావుని, " ప్రపంచంలో అన్నిటికన్నా సులభమైనదేమిటి? " అని ప్రశ్నిస్తుంది. దానికి రామారావు తడుముకోకుండా "ఉచిత సలహా" అని సమాధానమిస్తాడు. చెప్పడం చాలా తేలికే"

"నేను కాస్త మదుపు పెడతాను. బేంక్ దగ్గర ఇంకాస్త అప్పు పుచ్చుకుని ఏదైనా వ్యాపారం చేయగలవేమో ఆలోచించు. నీ ఉద్యోగ సమస్య తీరుతుంది" అని ప్రతిపాదించేడు సురేష్.

"వ్యాపారామా? దాని గురించి నాకేమీ తెలియదే! బేంక్ దగ్గరనుంచి అప్పు తెచ్చుకోవడం సామాన్యంకాదు. లంచాలు ఇవ్వాలి. చూద్దాం. వచ్చేనెల మొదటి తారీకునాడు ఒక ప్రవేట్ కాలేజీలో లెక్చరర్ ఉద్యోగానికి ఇంటర్వ్యూ ఉంది. ఎవరితోనో, రాజకీయనాయకునితో చెప్పించానులే. అది వస్తే నా బాధలు తీరిపోతాయి. ఇంటావంటాలేని వ్యాపారం, లాభాలు రాకపోతే నేనేమవుతాను? "

తుని స్టేషనులో రైలు ఆగింది. రైలు దిగి కొబ్బరి బొండాల నీళ్లని తాగి దాహం తీర్చుకున్నారు. ప్రసాదుకి తెలిసిన వ్యక్తి ఎవరో కనిపించి చేయి ఊపగా "నేను వచ్చే స్టేషనులో కలుస్తాను" అని సురేష్‌తో చెప్పి రెండవ తరగతి పెట్టెలోనికి వెళ్ళేడు.

రైలు బయలుదేరింది.

సాంప్రదాయం! ఆనవాయితీ! అనుకుంటూ, గింజుకుంటూ సురేష్ తిరిగి ఆలోచనలో పడ్డాడు.

ఆర్థికసహాయం చేస్తానని ముందుకు వచ్చి, తను జీవనోపాధి చూపించబోతే ప్రసాదు ఉత్సాహం కనబరచకపోవడానికి కారణమేమిటి? అతని దృష్టిలో ఎమ్.ఏ. చదివిన తనకి లెక్చరర్, బేంక్ ఉద్యోగం లేక. ఏదోఒక ఆఫీసు ఉద్యోగమో, అదే ఉద్యోగం. వ్యాపారం జీవనోపాధికాదు. సాహసం చేయడానికి అతను తయారుగా లేడు. ప్రసాదు అన్నట్లు, ఎవరు ఏంచేయాలో, ఏనాడో, సమాజం వృత్తులని, ప్రజలని విభజించింది. అదే సాగుతోంది తరతరాలుగా. మార్పంటే భయం. లేని ఉద్యోగాలకోసం పరిగెత్తేకంటే ప్రజలు నూతనదారులు ఎందుకు వెతకడంలేదు?

ఒక్క భయమేనా? లేక నిన్నని పట్టుకు వేళ్లాడే అలవాటా?

చటుక్కున తండ్రి మదిలోనికి వచ్చేడు.

అరెరె! తను మరచిపోయేడు! "ఈనెలు కట్టని తుని తమలపాకుసంధ్య" అని తండ్రి డైరీలో రాసుకున్న వాక్యం చదివినపుడు, తునిలో తమలపాకులు కొందామనుకున్నాడు, కాని ఆలోచనలోపడి మరచిపోయేడు. తిరుగు ప్రయాణంలో జ్ఞాపకం ఉంచుకుని కొనాలి అనుకుంటూ బయట పరిగెడ్తున్న ప్రపంచాన్ని గమనించసాగేడు సురేష్.

ఈవేళో, రేపో, అత్తని అడిగి సంధ్య గురించి తెలుసుకోవాలి.

సంధ్య!

ఎంత చక్కటి పేరు!

రెండు సమయాల సరిహద్దు సంధ్య. తీక్షణత తగ్గిన సూర్యకిరణాలు వెళ్ళనని మొరాయిస్తుంటే, బయటపడడానికి వెనకాడుతున్న చంద్రకిరణాలు సిగ్గుపడుతుంటే మధ్య దశ సంధ్య!

అవ్యక్త రంగుల మిశ్రమంలా సంధ్యలో ఒక వింతకాంతి ఉంది. విశిష్టతవుంది.

తండ్రి ఊహలో సంధ్య అంత అందంగా ఉంటుంది సంధ్య.

"ఒకవేళ సంధ్య గురించి అత్తకి ఏమీ తెలియకపోతే? " అన్న ప్రశ్న ఉదయించగానే, ఇబ్బందిగా కదిలేడు సురేష్.

రైలు వేగం తగ్గి గొల్లప్రోలులో ఆగింది. ప్రసాదు పెట్టెలోనికి ఎక్కి సురేష్ దగ్గ రికి వచ్చి,

"మహా అయితే ఇంకొక నలభై నిమిషా లలో సామర్లకోట వస్తుంది" అంటూ సీటులో సర్దుకున్నాడు.

★ ★ ★

దొండకాయలు కడుగుతూ,

"విశాఖపట్నంతో పోల్చి చూస్తే కాకినాడ కుగ్రామంలా కనిపిస్తోంది కదూ? " అనడి గింది సావిత్రి.

వంటింట్లో కుర్చీ వేసుకుని కాఫీ తాగు తున్న సురేష్ తల ఊపేడు.

"ఇక్కడ స్ట్రాంగ్ ఫిల్టర్ కాఫీకి, అక్కడ కాఫీకి రుచిలో చాలా తేడా కనిపిస్తుంది"

"అదే మీ నాన్న వచ్చినప్పుడు కాఫీ తాగి నపుడల్లా అనేవాడు. మీ నాన్నకి కాఫీ అంటే చాలా ఇష్టం" సురేష్ ఏదో అడగ బోయి ఆగిపోతే సావిత్రి,

"నీకు ఇంతకాలం తరువాత ఇండియా వద్దామన్న ఊహ ఎందుకు వచ్చింది? " అన డిగింది.

"ఏదో అవాంఛనీయమైన సంఘటన జరిగి ప్రజలని కుదిపితేతప్ప, అమెరికా ప్రజలు నిన్న గురించి ఆలోచించడానికి ఇష్ట పడరు. నేనూ అంతే. ఆ దేశంలో ఏకాకిన యేక, వెనక్కి తిరిగి చూస్తే ఏమీ కనిపించ లేదు. మా డాడీ గురించి కొంతైనా తెలుసు కుందామనిపించింది. ఒకచోట ఉద్యోగం మాని, ఇంకోచోట చేరేముందు, ఒకసారి ఇండియా వచ్చి మిమ్మల్ని చూద్దామనిపిం చింది. చనిపోయేముందు ఒకసారి మా డాడీ....

ఒకసారి ఇండియా వెళ్లి చిన్నాన్ననీ, అత్తని చూసి రాకూడదూ? " అన్నారు.

"మీనాన్న నాకంటే మూడేళ్ళు పెద్ద. ఇంటిలో తప్ప, బయట ప్రజలు బాగా తెలిస్తే తప్ప కలుపుగోరుతనంగా మాటలా డేవాడుకాదు. బేడ్మింటన్, క్రికెట్ ఆటలంటే ఇష్టం. అందులో బేడ్మింటన్ అంటే మరీను. మంచి ప్రావీణ్యం ఉండేది. ఇంజ నీరింగ్ అవగానే ఉద్యోగానికి ఢిల్లీ వెళ్ళేడు. మీనాన్న ఇంజనీరింగ్ చదివేరోజుల్లో నాకు పెళ్లయింది. మాధవ్ మీ నాన్నకంటే పదేళ్ళు చిన్న. మానాన్న చనిపోయేనాటికి, మాధవ్ చదువు పూర్తవలేదు. అప్పుడే బి.యస్.సికి వచ్చేడు. మధ్యతరగతి కుటుంబం. మీ నాన్నకి ఇంకా పెళ్ళవలేదు. ఢిల్లీ ఉద్యోగం వదలి, విశాఖపట్నంలో ఉద్యోగం చూసుకున్నాడు. మాధవ్ చదువు పూర్తయ్యేక తిరిగి ఢిల్లీలో ఉద్యోగం వస్తే వెళ్లి చేరేడు.

తండ్రి చనిపోతే కుటుంబ బాధ్యత ఇంటి పెద్ద కొడుకు నిర్వహిస్తాడు ఈ దేశంలో మీనాన్న అదే చేసేడు. ప్రతీ సంవత్సరం నాకు మీనాన్న డబ్బు పంపేవాడు. అది నీకు తెలుసా? "

"తెలియదు. ఎందుకేమిటి? "

"సంక్రాంతికి ఆడపిల్లలు పుట్టింటికి వస్తారు. వాళ్లకి బట్టలు పెట్టడం సాంప్ర దాయం. ఇది తండ్రి చేస్తాడు, లేకపోతే ఇంటి పెద్ద చేస్తాడు"

"మా డాడీకి నువ్వంటే చాలా ఇష్టం"

"అవును, నాతో చాలా విషయాలు చర్చిం చేవాడు. నాకు మీ నాన్న అర్థమయేడను కుంటుంటే రెండుసార్లు నన్ను పూర్తిగా బోల్తా కొట్టించేడు"

సురేష్ ఏమీ మాట్లాడలేదు.

"ఇంజనీరింగ్ చదివేరోజుల్లో, ఒక అమ్మాయి అంటే ఇష్టపడేవాడు. ఆమెని ఖచ్చితంగా పెళ్ళిచేసుకుంటాడనుకున్నాను. కాని అది జరుగలేదు. ఆ పిల్ల తరపునుంచి అభ్యంతరం ఏమీ ఉన్నట్టు నాకు తెలి యదు. ఎందుకు వెనుకంజవేసేడో! నాకిప్ప టికీ అది శేష ప్రశ్నే" "రెండవది? "

"గ్రహాలూ, తంత్రాలూ వగైరా అంటే నమ్మకంలేదు. ఐనప్పటికీ, మానాన్న చనిపోయినపుడు, వచ్చి యథావిధిగా కర్మకాండ చేసేడు"

"అవును, డాడీ, ప్రత్యేకంగా బయలుదేరి గుడికి వెళ్లడం నే చూడలేదు"

"మీనాన్న అంత సులభంగా అర్ధమయే మనిషికాదు"

తల్లి సంతృప్తికోసం, తన నమ్మకాలని ఆవలకి నెట్టి తండ్రికి కర్మకాండ యథావిధిగా చేసేడని తనకి తెలుసు. అలాగే, తండ్రి తను ప్రేమించిన స్త్రీని ఎందుకు వివాహమాడలేకపోయేడో డైరీలలో రాసినది చదివేక తనకి తెలిసింది. అయినా, తండ్రి డైరీలలో ఉన్న సమాచారాన్ని తను బట్ట బయలుచేయకూడదని, "మా నాన్న పెళ్లిచేసుకుందామనుకున్న వ్యక్తి ఎక్కడ ఉంది? నేను ఆమెని కలవడానికి వీలవుతుందా? " అనడిగేడు సురేష్.

"ఆమె ఈ ఊరిలోనే ఉంది, నాకు బాగా పరిచయమే. కాని ఆమెని కలిసి సంవత్సరంపైనే అయింది. ఇప్పుడు నువ్వు ఆమెని కలవడంలో ఉద్దేశ్యమేమిటి? "

"మా డాడీ చరిత్రలో ఆమె ఒక భాగం. మా డాడీ మనసుపడ్డ స్త్రీని చూద్దామని కుతూహలం అంతే"

"ఆవిడ ఏదో చిట్ ఫండ్ కంపెనీలో పని చేసేది. పనిచేస్తోందేమో, వివరాలు నాకు పూర్తిగా తెలియవు. సాయంకాలం ఐదు దాటేక వెళ్తే ఆమె ఇంటి దగ్గర ఉంటుంది. నేను వంట త్వరగా పూర్తిచేస్తాను, ఉల్లిపాయలు తరుగు" అంటూ ఉల్లిపాయల బుట్టని అందించింది సావిత్రి.

★ ★ ★

ప్రొద్దున్నుంచీ కురుస్తున్న సన్నని వాన జల్లు, వాతావరణాన్ని చల్లబరిచింది. గేటు తలుపు తీసి, సావిత్రి, సురేష్‌లు ఇంటి ఆవరణలోనికి జొరపడ్డారు.

గులాబీ, క్రోటన్స్, నల్లగోరింట, గోరింటాకు మొక్కలతోపాటు, పందిరిమీద గుబురుగా పెరిగిన సన్నజాజి, సంపెంగ మొక్కలు ప్రాంగణంలో విస్తరించి ఉన్నాయి. ఆకులు మీద పేరుకున్న దుమ్ముని వర్షపుజల్లు కడిగేక, ఆకులు సాయంకాలపు సంధ్య వెలుగులో కూడా మెరుస్తున్నాయి. మూడు పైరెక్కలు, మూడు లోపలి రెక్కలతో, పూర్తిగా విచ్చుకున్నపుడు, పలకబారిన జాంపండు రంగుని దాల్చి, పల్ల సంపెంగ పూవు ఒకే ఒక సాయంకాలం మాత్రం పరిమళాలని, గాలి అదిరిపోయేలా వెదజల్లుతుంది. చెట్టుమీద విచ్చుకున్న ఐదారు సంపెంగపూలు, తీయని మత్తెక్కిన సుగంధాన్ని పరిసరప్రాంతాల్లో నింపేయి. సిమెంట్ అరుగులు మెట్లెక్కి సావిత్రి తలుపుమీద తట్టిన అరనిమిషానికి తలుపు మెల్లగా తెరచుకుంటుంటే, సురేష్ గుండె వేగం హెచ్చింది.

దాదాపు ఏభైఐదేళ్ళ స్త్రీ బయటకి చూచి, "సావిత్రీ, ఏమిటి ఇలా దారితప్పేవు? " అంది.

వెన్వెంటనే సావిత్రి వెనకాతల నిలబడ్డ సురేష్‌ని చూసి ఆమె కళ్ళు మెరిసేయి. కనుబొమ్మలు కిందికి ఒరిగి, చెక్కిళ్ళు రవ్వంతమీదకి లేచేయి.

"మా సుబ్బారావన్నయ్య కొడుకు అమెరికానుంచి ఈమధ్యనే వచ్చేడు" అంటూ లోపలికి ప్రవేశించింది సావిత్రి.

సురేష్ ఆమెని అనుసరించేడు.

"కూర్చో మీనాన్న ఎలా ఉన్నారు? " అనడిగింది సురేష్ వేపు తిరిగి.

సావిత్రి ఏమీ మాటలాడకపోవడం చూసి, "మాడేడీ కారు ప్రమాదంలో చనిపోయి దాదాపు ఒక సంవత్సరమైంది" అని బలహీనమైన గొంతుకతో సమాధానమిచ్చేడు సురేష్.

బలమైన కొరడాదెబ్బ తగిలినట్లు, రక్తం

ఇంకిపోయిన ఆమె మొహం పాలిపో యింది.

ఏ శిధిల మధురస్మృతులు నేలమట్టం అయేయో, ఏ ఆశల దారాలు పుటుక్కున తెగేయో ఆమెకే తెలియాలి. విడిన నోరు, లేచిన చెక్కిళ్ళు, కనుబొమ్మల్ని మీదకి కది లించి లేని ముడుతలని నుదుటమీద సృష్టించేయి. తెరిచిన నోటికి అడ్డంగా కుడి చేతిని అడ్డుపెట్టుకుని, కళ్ళు మూసి తల వంచగానే కనుకొలకులోంచి ఒక కన్నీటి బొట్టు కిందకి జారింది. చీరచెంగుతో మొహాన్ని, కళ్ళని ఒత్తుకుని, అరనిమిషం తరువాత కళ్ళు తెరిచి,

"ఇది చాలా అన్యాయం సావిత్రీ" అంది నీరసంగా.

చూడాలని ఉన్నా, ఆమె మొహంలోనికి చూసే ధైర్యంలేక, తల వంచుకుని, శూన్యంలోనికి చూడసాగేడు సురేష్.

"పని కట్టుకుని వచ్చి ఈ వార్తని చెప్పడా నికి ఇష్టంలేక ఇన్నాళ్ళూ రాలేదు సంధ్యా. సురేష్ వచ్చి నిన్ను కలుస్తానంటే తీసుకు వచ్చేను" అని సంజాయిషీ ఇచ్చింది సావిత్రి.

సురేష్‌వేపు తిరిగింది సంధ్య. ఇద్దరి కళ్ళూ కలుసుకున్నాయి.

ఒక నిమిషం క్రితం ఆనందంతో మెరిసిన కళ్ళు, విషాదంతో వెలాతెలా పోతున్నాయి. బలవంతాన ఆపుకోవడానికి ప్రయత్నం చేస్తున్నా, కంటిలో ఊరుతున్న నీటితెర, క్రింది రెప్పల్నిదాటి, సగం కనుపాప వరకు వచ్చింది. మెల్లిగా నిలబడి, గోడమీదున్న ఒక గ్రూప్ ఫొటోని తీసి, కొంగుతో ప్రేమగా అద్దం మీదున్న ధూళిని తుడిచి, దానివేపు పరీక్షగా ఒకసారి చూసి, సురేష్‌కి అందిస్తూ, "ముప్పయి అయిదేళ్ళక్రితం మీడాడీ ఎలా ఉండేవారో చూడు" అంది.

సీనారేకు వెనకాతల వేసి బిగించిన ఫ్రేమ్, ఫొటోలో ముగ్గురు కూర్చుని, ఇద్దరు నిలబడి ఉన్నారు. బ్లాక్ అండ్ వైట్ ఫొటో, కాలంతోపాటు క్రమంగా రంగుమారి, గోధుమరంగు ఛాయకి చేరుకుంది.

"బాల్ బాడ్మింటన్ చాంపియన్ షిప్ గెలుచుకున్నపుడు తీయించుకున్న ఫొటో అది. మీ డాడీ బేడ్మింటన్ బాగా ఆడేవారు నీకు తెలుసా? " అనడిగింది సంధ్య.

నోటమాట పెగలలేదు సురేష్‌కి. అడ్డంగా తల ఊపేడు.

"ఫిల్టర్ వేసి వస్తాను" అంటూ లేవబో యింది.

"వద్దు ఇప్పుడే కాఫీ తాగి బయలుదేరేం" అని వారించబోయింది సావిత్రి.

సావిత్రి అభ్యంతరాన్ని లెఖ్ఖ చేయకుండా వంటింటిలోనికి వెళ్ళి, స్టౌ వెలిగించింది సంధ్య. రెండు నిమిషాలలో ట్రేలో, సగం నిండి ఉన్న చిన్న కాఫీ కప్పులతో తిరిగి వచ్చి, చెరొక కప్పు అందిచ్చి, తనొకటి తీసు కుంది.

"మీ డాడీ ఈ దేశం వచ్చి మా ఇంటికి వస్తే, అప్పటికప్పుడు తాజాగా ఫిల్టర్ వేయడం మామూలే నాకు" అంటూ బొంగురు పడిన గొంతుని సరిచేసుకుంది. పడిశం పట్టినప్పుడు ఎగపీల్చినట్టు ముక్కుని ఎగపీల్చింది.

బరువుగా వుంది గదిలోని వాతావరణం.

బయట నల్లని మబ్బులు దట్టంగా పేరు కోవడంతో వెలుతురు తగ్గింది. సంధ్యలేచి లైటుని వెలిగించింది.

"వాన మొదలయితే దట్టంగా కురిసేలా ఉంది. మరి మేము వెళ్తాం" అని లేచింది సావిత్రి ఖాళీ కప్పుని క్రింద ఉంచుతూ.

"అమ్మాయి ఉంటే నీకు బొట్టు పెట్టేది" అంటూ, నొచ్చుకుంటూ సంధ్య నిలబడింది. సురేష్‌వేపు తిరిగి, "ఆది వారం మధ్యాహ్నం భోజనానికి రాగలవా సురేష్? కాస్సేపు కబుర్లు చెప్పుకుందాం. మా అమ్మాయిని కూడా చూసి వెళ్దువుగాని" అంది సంధ్య.

"దాదాపు పదకొండున్నర, పన్నెండు మధ్య వచ్చేదా? " అనడిగేడు సురేష్.

సావిత్రి ఆశ్చర్యంగా సురేష్ వేపు తిరిగింది. తలూపింది సంధ్య.

ఇద్దరితోపాటు బయట గేటువరకూ వచ్చి సాగనంపింది సంధ్య. సన్నని తుంపర మొదలయ్యింది. ఖాళీ ఆటో రిక్షా కనిపించగానే ఆపేరు. సురేష్ ఆటో ఎక్కబోతూ వెనక్కి తిరిగి చూసేడు. మీద పడుతున్న వానజల్లుని లెఖ్ఖ చేయకుండా గేటుదగ్గరే దిగాలుగా నిలుచుంది సంధ్య.

"పాపం సంధ్య" అంది సావిత్రి తనలో తను గొణుక్కుంటూ.

"ఎంత బాగా వ్యక్తపరిచేవు అత్తా" అనుకున్నాడు సురేష్.

"విజయనగరంలో, హైస్కూల్ రోజులలో, నేనూ మీనాన్నా, సంధ్య తండ్రి దగ్గరికి లెఖ్ఖల ప్రైవేట్‌కి వెళ్ళేవాళ్ళం. ట్యూషన్‌కి, అక్కడకి వచ్చేవాళ్ళలో నేనొక్కర్తినే ఆడపిల్లని. అప్పటినుంచే మాకు సంధ్య పరిచయం. ఇంటర్మీడియట్‌లోనికి వచ్చేసరికి లెఖ్ఖల మాస్టారు కాకినాడ వచ్చేరు. బి.యస్.సి చదువుతున్నపుడు నాకు పెళ్ళయి, మీ మామయ్య ఈ ఊరిలో పనిచేస్తుంటే, ఈ ఊరు వచ్చిన నాకు సంధ్య కనిపించేది అప్పుడప్పుడు. ఇంజనీరింగ్ చదువుకి ఈ ఊరు వచ్చిన మీ నాన్న తిరిగి మాస్టారింటికి వెళ్తుండేవాడు, తద్వారా సంధ్యతో చనువు పెరిగింది.

మీనాన్న, ఆ ఫోటోలో ఉన్న మిగతా నలుగురూ బేడ్మింటన్ స్నేహితులు, మీనాన్న, అప్పడప్పుడు నాతో వ్యక్తపరచిన ఉద్దేశాలు బట్టి, సంధ్యని మీనాన్న పెళ్ళిచేసుకుంటాడనే అనుకున్నాను. ఏమయిందో ఏమో, సంధ్య పెళ్ళి ఆ ఫొటోలో ఉన్న రమేష్‌తో ఒరిగింది" అంటూ గతంలోనికి వెళ్లింది సావిత్రి. సురేష్ ఏమీ మాటలాడలేదు.

"ఆమె నిన్ను భోజనానికి పిలిస్తే, ఏమీ తటపటాయించకుండా నువ్వు ఒప్పేసుకోవడం నన్ను రవ్వంత ఆశ్చర్యపరచింది" అంది తిరిగి.

"డాడీకి పరిచయం ఉన్న మిత్రులని, బంధువులని ప్రదేశాలని చూద్దామనే ఈదేశం వచ్చేను, అందుకే ఆమెతో తీరికగా మాటలాడడానికి వీలవుతుందని ఒప్పుకున్నాను" అన్నాడు సురేష్.

ఆటోరిక్షా ఇంటి ముందర ఆగింది. సావిత్రి, వెనకాతల సురేష్ ఇంటిలోనికి నడిచేరు. హాలులో మూర్తి, వెంకటేశ్వర్లు మావయ్య కూర్చుని టి.వి. చూస్తున్నారు. కేబిల్‌లో హిందీ సినిమా నడుస్తోంది. హీరో, సన్నిడియోల్‌కి బాగా డబ్బు పలుకుబడి ఉన్నా, బట్టలు వేసుకోవడం ఇష్టంలేదన్నట్లు బనియన్ లేకుండా నెహ్రూ జాకెట్ లాంటిది ఒకటి వేసుకుని, ప్రతీ రెండునిమిషాలకీ, గోడలనీ, అడ్డంగా ఉన్న బల్లలనీ, వాటితోపాటు ఐదారుగురు వస్తాదులలా ఉన్నవాళ్ళని బాదేస్తుంటాడు. సన్నీ ఒంటిమీద అక్కడక్కడా గెడ్డం గీసుకుంటున్నపుడు గెడ్డం తెగినట్లు, రక్తపుచారలు మాత్రం కనిపిస్తున్నాయి.

ఎర్రపడినట్లున్న కళ్లతో, ప్రతీక్షణమూ గండ్రగొడ్డలిని పట్టుకుని రాజుల తలలు నరకడానికి బయలుదేరిన పరశురామునిలా మండిపడుతూ కనిపిస్తున్నాడు. ఎవర్నీ కొట్టకుండా ఉన్నప్పుడు, ఎండనక, వాననక, సన్నీ కోసమే కళ్లలో ఒత్తులు వేసుకుని కాచుకున్న ఓ గర్ల్‌ఫ్రెండ్‌తో యుగళగీతాలు పాడుతూ, రంగురంగుల దుస్తులలో ప్రపంచంలో వివిధ ప్రదేశాలలో కనిపిస్తాడు. అరగంట చూశాక, అది భరించలేక లేవబోతుంటే,

"ఎక్కడకి లేచేవు బావా? ఈ వచ్చే సీన్‌లో వీడు ఆ విలన్‌ని ఏం వాయించేస్తాడూ, చూడాల్సిందే. కథ క్లైమాక్స్‌కి వచ్చేసింది" అన్నాడు మూర్తి ఉత్సాహంగా.

"ఇప్పుడే వస్తానని" లోపలి గదిలో దూరి బట్టలు మార్చుకోనారంభించేడు సురేష్.

అమెరికన్ సినిమాలలో హింస, నగ్న అంగప్రదర్శన ఉంటుందని, అలాంటి సినిమాలు చూస్తే మన ప్రజలు మానసికంగా మొద్దుబారిపోయి, హింసాధోరణికి అలవాటుపడిపోతారని, మన ప్రభుత్వం బాగా సెన్సార్ చేస్తేగాని అమెరికన్ సినిమాలని భారతదేశంలో ప్రదర్శించడానికి అనుమతించదు. కాని ఈ దేశంలో తయారయ్యే సినిమాల మాటేమిటి? ఇంగ్లీషు సినిమాలో పిస్తోల్‌తో చంపడం చూపిస్తే, ఇక్కడ ముమ్మరంగా ముష్టియుద్ధాలు, కత్తిపోట్లు. ప్రతీ సినిమాలోనూ మానభంగాలు, అసభ్యకర దృశ్యాలు. స్త్రీలు బాడీ వేసుకున్నా, వేసుకోనట్టే శరీరప్రదర్శన, మరి వీటి సంగతి ఎందుకు పట్టించుకోవడంలేదు? ఆ సినిమాలు హాని చేస్తాయి. కాని ఇవి చేయవా? హింస ఎక్కువగా ఉన్న సినిమాలు వచ్చినా, సాంఘిక సమస్యలమీద కూడా అక్కడ సినిమాలు, టెలివిజన్ ప్రోగ్రాంలు ఉంటాయి. ఇక్కడ అలాంటివేవీ తనకి కనిపించలేదు, అనుకుంటూ బట్టలు మార్చుకుని, మొహం కడుక్కుని అరగంట గడిచేక హాలులోనికి వచ్చేడు సురేష్. అదృష్టవశాత్తూ అప్పటికి ఆ సినిమా ముగిసింది.

"మిస్ అయిపోయావు బావా" అంటూ టి.వి.ని ఆపుచేశాడు మూర్తి.

ట్రేలో నాలుగు కప్పులతో టీ తీసుకువచ్చి టేబిలుమీద వుంచింది సావిత్రి.

"టీ నీకు అభ్యంతరం లేదనుకుంటాను" అంటూ ఒక కప్పుని అందిచ్చింది సురేష్‌కి.

"చక్కెర వేయకపోతే ఫరవాలేదు" అంటూ కప్పు అందుకున్నాడు సురేష్.

"మీ అమెరికన్లు విచిత్రమైన వాళ్ళయ్యా. కేక్‌లు, ఏపిల్ పైలు, డోనట్లు అంటూ పంచదార ఉన్న పదార్థాలు తెగతింటారు. కాఫీ, టీల దగ్గరకి వచ్చేసరికి, అమ్మో! చెంచాడు పంచదారలో నూరు కేలరీలు ఉన్నాయని భయం నటిస్తారు" అన్నాడు వెంకటేశ్వర్లు.

"వాళ్ళ మాటేమోకాని, నాకు టీలో పంచదార వేసుకోకపోతేనే బాగుంటుంది. అవునుగాని ఇది చెప్పు మావయ్యా, ఎడతెరిపి లేకుండా పొద్దున్ననుంచి సాయంకాలంవరకు డాన్సులు, కురుక్షేత్రయుద్ధంలా ఆ కుమ్ములాటలు చూస్తుంటే విసుగేయడం లేదా? ఈ దేశంలో ప్రబలిఉన్న మూఢనమ్మకాలమీద, సాంఘిక సమస్యల మీద ఎందుకు విరివిగా సినిమాలు తీయడంలేదు? " అనడిగేడు సురేష్.

"భలేవాడివే. తీయకేం, తెగతీశారు. కట్నం తీసుకోవద్దని తెగ సినిమాలు వచ్చాయి. ఇరవైఏళ్ళక్రితం కట్నం వేలసంఖ్యలో ఉంటే, ఈనాడు అది లక్షలలోనికి పెరిగింది. కులాలు కూలిపోవాలంటూ సినిమాలు తీసి ప్రజలు దివాలాలు తీశారు. ఇప్పుడు ఏపని కావాలన్నా, ఒక్క అడుగు ముందుకు వెళ్ళాలంటే, కులంపదం వాడకుండా జరగనిస్థితికి చేరాం. ఆ సమస్యలు ఎప్పుడూ ఉన్నవే. టి.వి. చూసే ఆ కాస్సేపయినా మమ్మల్ని ఊహాలోకంలో బ్రతకనీ, నీ పిచ్చిగాని, సినిమాలవల్ల నినాదాలవల్ల దేశం మారుతుందా? " అన్నాడు వెంకటేశ్వర్లు.

నిన్నటి తరానికి, ఈనాటి తరానికి వారధిలాంటి వెంకటేశ్వర్లు మావయ్య అలా నీరసపడి చెడు పరిస్థితులతో రాజీపడడం చూసి విచారమేసింది సురేష్‌కి.

ఏ ఒక్కమనిషివలనా ఏమీ జరగదని, ప్రతీవ్యక్తీ అనుకుంటే చెడు, సమాజంలో త్వరగా చోటుచేసుకుంటుందని చెప్పాలని ఉంది సురేష్‌కి.

మనిషి టెలివిజన్‌కి బానిస అయినప్పుడు సమాజానికి మంచి జరగలేదన్న సత్యాన్ని పశ్చిమదేశస్థులు గ్రహించారనీ, ఇంకొకరు

చేసిన తప్పే మనం చేయనవసరంలేదనీ చెబుదామని ఉంది సురేష్‌కి.

కాని ఎలా చెప్పాలో తెలియకా, వాదన పెంచితే మావయ్యా, మూర్తి నొచ్చుకుంటారేమోననీ మౌనంగా టీ చప్పరిస్తూ ఆలోచనలో పడ్డాడు సురేష్.

"సురేష్, మనిషికి మంచి ఊహలు, ఆలోచనలు ఉండగానే సరికాదు. వాటిని వ్యక్తపరచి, ఇతరులని మలచగలిగినప్పుడే వాటికి విలువ. నీలో ఏదైనా సామర్థ్యం ఉన్నా, వ్యక్తపరచకపోతే అది ఎవరికీ ఉపయోగపడదు" అంది కేతరీన్ తనతో ఒకరోజు.

కేతరీన్!

తన బలహీనతమీద కసితో ఎప్పుడూ దెబ్బకొట్టేది. ఆమెతో వాదనకిదిగి, నొప్పించడానికి ఇష్టంలేక ఊరుకోవడంతో మరింత విజృంభించేది.

ఎవరో ముక్కూ, మొహం తెలియని వ్యక్తిని పెళ్లి చేసుకునేకంటే పరిచయాలు పెరిగి, అభిరుచులు కలిసిన వ్యక్తిని పెళ్ళి చేసుకుంటే మంచిదని, తను అర్థం చేసుకున్నాననుకున్న అందమైన కేతరీన్‌ని పెళ్ళి చేసుకున్నాడు.

కేతరీన్ తనకి ఒక సంవత్సరం జూనియర్. తను ఎమ్.ఎస్. పూర్తిచేసి ఉద్యోగంలో చేరాడు. ఒక సంవత్సరం ఆలస్యంగా డిగ్రీ తెచ్చుకున్న కేతరీన్, తను పనిచేసే ఊరిలో, తనకి సరి అయిన ఉద్యోగం దొరకడంలేదని విసుగుకునేది.

"సంసారమన్నా, జీవితమన్నా కొంత రాజీ తప్పదు" అని తనంటే,

"ఇద్దరు వ్యక్తులు పరిగెడుతూ ఒక కూడలి దగ్గరకి వస్తారు. ఒకర్ని ఇంకొకరు పలకరించుకున్నాక, ఒకేదిశలో పరిగెత్తడానికి నిశ్చయించుకుని పరుగు మొదలెడతారు. ఆ ఇద్దరిలో ఏ ఒక్కరు వెనుకపడినా, అది కలిసి పరిగెత్తడం అనిపించుకోదు. వాళ్ళ మధ్య దూరం ఎక్కువవుతుంది, కాలం గడుస్తుంటే" అంది కేతరీన్.

ఇద్దరికీ ఆమోదకరమైన ప్రదేశాల గురించి వెతికేడు తను, కాని ఏవీ సాధ్యపడలేదు. అసంతృప్తి బీజం మెదడులో పడకపోవాలేకాని, ఒకసారి ఆ విత్తుపడితే, అది పెరిగి మహావృక్షమవడానికి అట్టే కాలం పట్టదని తను గ్రహించేసరికి ఇద్దరి మధ్యా దూరం ఎక్కువయింది. తను ఇతర ఇండియన్లతో మాట్లాడే తీరు, డబ్బు ఖర్చుపెట్టే విధానం ఒకటేమిటి అన్నింటిలో తప్పులు పట్టడం ఎక్కువయింది.

కేతరీన్‌కి ఇష్టమని, తనకి నచ్చకపోయినా, రాజీకి ఆమెకి నచ్చేలా చేయబోతే,

"నా గురించి నీ పద్ధతి మార్చుకోకు. వ్యక్తిత్వం లేని వ్యక్తులంటే నాకు అసహ్యం" అంటూ నిరసించేది.

నాలుగు సంవత్సరాల వైవాహికజీవితం తరువాత ఎవరిదారులు వారివయ్యాయి. కేతరీన్ చికాగో వెళ్ళిపోయింది.

"రేపు మీ నాన్న చదివిన ఇంజనీరింగ్ కాలేజీ చూసివద్దామా? " అనడిగేడు మూర్తి.

వాస్తవంలోకి వచ్చాడు సురేష్.

"ఇక్కడకి ఎంత దూరం? వానపడకుండా ఉంటే పెందరాళే బయలుదేరుదాం" అన్నాడు సురేష్.

"ఇంకా కాలేజీలు తెరవలేదు. నాకు తెలిసిన లెక్చరరు ఒకతను ఉన్నాడు. అతను ఉంటే సరే, లేదా వెంటనే వచ్చేద్దాం. వెళ్ళి రావడానికి మహా అయితే రెండు, రెండున్నర గంటలకంటే అవసరంలేదు. తొమ్మిదికి బయలుదేరుదాం" అని మర్నాటి కార్యక్రమాన్ని నిర్ణయించాడు మూర్తి.

★ ★ ★

సోమర్సెట్ మామ్ 'ట్రేవలర్ గైడ్' కథల పుస్తకం ముగించేసరికి రాత్రి పన్నెండయింది. అందరూ నిద్రలోకి ఒరగడంతో ఇల్లంతా నిశ్శబ్దం. బయట సన్నని తుంపర. ఇంటిమీద కురిసిన వాననీరు గొట్టాల్లోంచి

మెల్లిగా శబ్దం చేసుకుంటూ కిందకి జారుతోంది. తాత్కాలికంగా దాహంతీరిన భూమి, ఆవిర్లు కక్కడం ఆపి, గాలి భీభత్సంతో భిన్నం అయిన నీటి అణువులని, రెండు నెలల పసికందుని తనలో ఇముడ్చుకున్న తల్లిలా, కళ్లు మూసుకుని చేతులు విప్పి ఆప్యాయంగా అందుకుంటోంది.

రంగులు మారిన సంధ్య కళ్లు వెంటనే జ్ఞాపకానికి వచ్చాయి.

తనని ఆశ్చర్యంతో చూసిన ఆ కళ్లు తండ్రి మరణవార్త వినగానే విచారంతో కన్నీళ్ళని వెదజల్లాయి. ఒక్కసారి ఆ కళ్లలోనికి చూడగానే, మిలమిల మెరిసి విలవిలలాడిన ఆ కళ్లు అయస్కాంతంలా తనని ఆకట్టుకున్నాయి. వాత్సల్యపూరిత భావం ఉన్న కళ్లతో ఆమె అందిచ్చిన ఆహ్వానాన్ని ఎవరు కాదనగలరు? ఆమెది సామాన్యపు పొడవు, ఆ కళ్లు తప్పిస్తే ఇంకేమీ తన దృష్టిలోనికి రాలేదు.

ఆమె ఎలా ఉందో?

"ఎండలో అలసిపోయిన బాటసారికి, ఆమె సాన్నిహిత్యం, నీడలో వీచే వింజామరలాంటిది" అని ఆమె గురించి తండ్రి వర్ణించేడు.

యవ్వనంలో తండ్రి ప్రేమలో పడినప్పుడు అంత రమ్యమైన అనుభూతిని పొందేడా? ప్రేమించి పెళ్ళిచేసుకున్న తమ దాంపత్యంలో అంత తీవ్రమైన భావం తనలో ఏనాడూ రేకెత్తలేదు, అనుకుంటూ పరుపుమీదకి చేరాడు సురేష్.

ఆకాశంనిండా అలుముకున్న చల్లదనం, మనసుని సాంతం ఆక్రమించుకున్న మగువ గురించి తండ్రి డైరీలో రాసుకున్న వాక్యాలు మెల్లిగా సురేష్‌ని నిద్రపుచ్చేయి.

★ ★ ★

బయట సన్నని జల్లు!

చీకటి ఆకాశంమీద పల్చగా పేరుకున్న మేఘాలు నిర్వీర్యంగా వానచినుకులని కురిపిస్తున్నాయి.

'చీదరగా ఉంది' అనుకుంది సంధ్య, పరుపుమీద అసహనంగా కదులుతూ. సుబ్బారావు చనిపోయాడంటే నమ్మలేకుండా ఉంది.

సుబ్బారావు!

ఇలాంటి వానరోజునే, విచిత్రంగా సుబ్బారావుతో పరిచయమైంది.

తండ్రి దగ్గరకి, లెఖ్ఖలు ప్రైవేటుకి వచ్చేవాళ్ళలో సుబ్బారావు ఒకడు.

ఒక సెలవురోజున తండ్రి అర్జంటుగా ఊరెళ్ళాల్సివచ్చింది. కుర్రాళ్లు వచ్చి తండ్రి లేడని తెలిసి తిరిగివెళ్ళారు. ఆకాశంమీద పేరుకుపోయిన బూడిదరంగు మేఘాలు ఒక్కసారి జడివానని కురిపించ మొదలుపెట్టాయి.

వాన మొదలయిన రెండు నిమిషాలకి, సైకిల్ మీద, సాంతం తడిసిపోయి, బట్టల నుంచి నీళ్లు కారుస్తూ సుబ్బారావు లోపలికి వచ్చాడు.

"నాన్నగారు అర్జంటుగా ఊరు వెళ్ళారు. రేపు సాయంకాలానికి వస్తారు" అంది తను.

సుబ్బారావు తలకి దట్టంగా నూనె రాసే అలవాటుంది కాబోలు, తలనుంచి మొహం మీదకి కారుతున్న నీళ్లు మొహానికి జిడ్డుని ఆపాదించాయి. శరీరానికి అతుక్కుపోయిన బనియన్ చొక్కాలోంచి బయటకి కనిపిస్తోంది. తెల్లని చొక్కాకింద నల్లని తాడుతో కట్టిన తాయెత్తు కనీకనిపించకుండా కనిపిస్తోంది.

సైకిల్ వెనకాతల ఉంచిన పుస్తకం, న్యూస్‌పేపరు చుట్టినా, వాననీళ్లకి తడిసింది. చదువుకోసం వానలో తడిసి వచ్చిన సుబ్బారావుని పరీక్షగా చూస్తూ...

"గొడుగు వేసుకురాకుండా, ఏమీ చూసుకోకుండా వచ్చేయడమేనా? వాన వస్తోందని తెలియదా?" అని తను దబాయించింది.

నోటమాట పెగలలేదు సుబ్బారావుకి. బట్టలనుంచి నేలని కారుతున్న నీళ్ళవేపు బెరుకుగా చూస్తూ, తిరిగి సైకిల్ వేపు వెళ్ళబోతుంటే,

"మళ్ళీ వానలో సైకిల్ తొక్కేస్తారా? వాన తగ్గేవరకు ఆగండి" అంటూ లోపలి నుంచి పొడితువ్వాలు తెచ్చి అందిస్తూ "తల తుడుచుకోండి" అంది.

బుద్ధిగా తల తుడుచుకోవడం మొదలెట్టాడు సుబ్బారావు.

గుండ్రటి బల్లమీద టేబిల్ చుట్టూ ట్యూషన్‌కి వచ్చే కుర్రాళ్లు సర్దుకుని కూర్చునేవారు. తండ్రి చుట్టూ తిరుగుతూ వాళ్ళ చేత లెఖ్ఖలు చేయిస్తుండేవాడు.

తల తుడుచుకుని బల్ల దగ్గర కుర్చీలో కూర్చుని ఏంచేయాలో తెలియక బైట కురుస్తున్న వానవేపు చూస్తున్నాడు సుబ్బారావు.

వాన ఉధృతం పెరుగుతోందే కాని తరగడంలేదు.

అరగంట గడిచేక ట్యూషన్ గదిలోకి వచ్చింది తను.

సుబ్బారావు లేచి నిలబడి "మీ దగ్గర గొడుగు ఒకసారి నాకు ఇస్తే, ఇంటికి వెళ్ళి తిరిగివచ్చి మీ గొడుగు మీకు ఇస్తాను. వాన ఇప్పటిలో ఆగేలా లేదు" అన్నాడు.

"ఇంటిలో ఉన్న గొడుగు నాన్నగారు తీసుకెళ్ళారు. ఒకవేళ ఇంకో గొడుగు ఇంట్లో ఉన్నా, అది మీకిచ్చినా, మీరు ఇంటికి వెళ్ళి తిరిగి గొడుగుతో రాలేరు" అంది.

"అదేం? "

"మీ ఇంటిలో గొడుగు లేదు కనుక" అంటూ ఆటలు పట్టించింది.

ఆశ్చర్యంగా తనవేపు చూశాడు సుబ్బారావు.

తల తుడుచుకున్నప్పుడు, తలమీదున్న వెంట్రుకలు, అడ్డదిడ్డంగా నిలుచున్నాయి. జేబులో దువ్వెన లేదు కాబోలు. అప్పుడే మొలుచుకువచ్చిన లేతమీసాలు, మొహంమీద మొటిమలు. కిశోరదశనుంచి యవ్వనంలోనికి వెళ్తున్నప్పుడు మారుతూ నిగారింపు తెచ్చుకుంటున్న శరీరాకృతి.

తన పదహారేళ్ళ వయసుకి ఆకర్షణీయంగానే కనిపించేడు ఆనాడు!

వాన ఎప్పుడు ఆగుతుందా? అని ఆతృతతో బైటకి చూస్తున్న సుబ్బారావుతో,

"ఈ ఇల్లు పులిబోను కాదు. కూర్చోండి. వాన తగ్గేక రంయిమని ఇంటికి వెళ్దురుగాని'' అంటూ లోపలకి నడిచింది.

బల్లమీద సర్దుకుని ఆవేళ్టి పేపరు తిప్పేడు సుబ్బారావు.

కాస్సేపయ్యాక వాన అలాగే కురుస్తుంటే అరకప్పు కాఫీ కలిపి ఇచ్చింది. బెరుకు తగ్గిన సుబ్బారావులో ధైర్యం పెరిగింది కాబోలు, మెల్లిగా కబుర్లు చెప్పడం మొదలెట్టాడు.

ముభావత్వపు మనిషని తను ఆనాడే గ్రహించింది.

రెండురోజులు తరువాత మళ్ళీ ప్రైవేటుకి వచ్చినా తనవేపు ధైర్యంగా చూడలేదు. ఏరో జైనా, లెఖ్ఖలు సరిగ్గా చేయకపోతే తండ్రి చీవాట్లు వేస్తే, తలవంచి భరించి, ట్యూషన్ నుంచి బయటకి వెళ్ళేముందు తన కళ్ళలోనికి చూసేవాడు, తన మొహంలో భావం పసికట్టడానికి ప్రయత్నించేవాడు.

గమ్మత్తుగా ఉండేవాడు సుబ్బారావు.

ఆ దశలో సుబ్బారావుతో ఒంటరి సన్నివేశాలు రెండో, మూడో! అవీ రెండు నిమిషాలు మాత్రమే.

మూడేళ్ళక్రితం తనని పలకరించడానికి వచ్చినప్పుడు, అతని కళ్లలో దిగులుని తను గ్రహించినా, అతని జీవితం అలా అర్ధాంతరంగా ముగుస్తుందని ఎవరూ ఊహించలేదు. ఏపుగా ఎదిగి, బలమైన అరటి చెట్టులా ఉన్న ఆ ఆరడుగుల మనిషి 'తిరిగి కనిపించడు' అన్న నిజం తనని చింతాక్రాంతురాల్ని చేస్తోంది.

నాన్నకి ట్రాన్స్‌ఫర్ అవడంతో సుబ్బారావు కనుమరుగయ్యాడు. కాలం మెల్లిగా

అతని జ్ఞాపకాలని పలచబరచిందనుకుం టున్న సమయంలో...

"హలో బాగున్నారా?" అంటూ గాంధీన గరం కూరల మార్కెట్‌లోంచి సావిత్రితో బయటకివస్తూ రోడ్డుమీదున్న తనని పలక రించాడు.

"ఏమిటీ సర్‌ప్రైజ్ సావిత్రీ?" అంది తను, అతని ప్రశ్నకి సమాధానాన్ని దాట వేసి.

"ఈమధ్యనే పెళ్ళయింది, ఆయన ఇక్కడే పనిచేస్తారు"

మరోసారి ఆశ్చర్యాన్ని ప్రకటించింది తను.

"నాలుగేళ్ళ తరువాత కలిసేం, మాస్టారు ఎలా ఉన్నారు? ఎక్కడ ఉంటారు"న్న ప్రశ్న లకి సమాధానమిచ్చింది తను.

"నీకు తెలుసో తెలియదో, మా సుబ్బా రావు ఇక్కడే ఇంజనీరింగ్ చదువుతు న్నాడు. రెండవ సంవత్సరంలో ఉన్నాడు"

అంది సావిత్రి.

ఉబుకుతున్న ఉత్సాహాన్ని అదిమిపెట్టి సుబ్బారావువేపు చూసింది.

కళ్ళు కలుసుకున్నాయి.

ఒళ్ళు చేసిన సుబ్బారావులో నిండుతనం చోటుచేసుకుంది. కాకినాడ నీళ్ళు ఒంటపట్టా యనడానికి నిదర్శనంగా సుబ్బారావు మొహం, రంగు దిద్దుకుంది. ఎప్పటిలా కళ్ళ లోనికి చూడడానికి భయపడే కళ్లు.

"మీరు ఎక్కడుంటారో ఇన్నాళ్ళూ తెలి యదు" అన్నాడు తను కలవకపోవడానికి సంజాయిషీలాంటివి ఇస్తూ. కాకినాడలో ఉంటూ తనని కలవడానికి ప్రయత్నించలే దని ఒళ్ళుమండి, "మరేం ఫరవాలేదు" అని సంభాషణని తృంచింది. తలవంచుకున్నాడు సుబ్బారావు.

అనవసరంగా అతనిని బాధ పెట్టానే అని తను బాధపడింది ఆ రాత్రి.

సుబ్బారావు వచ్చి తనని కలుస్తాడను కుంది, కాని అలా జరగలేదు.

నెల్లాళ్ళ తరువాత ఒకరోజు, "సంధ్యా నాతో బాడ్మింటన్ ఆడే ఇతను మాస్టారి పాతవిద్యార్థి అని తెలిసి తీసుకువచ్చేను" అంటూ దూరపు బంధువైన రమేష్ సుబ్బా రావుని ఇంటికి తీసుకువచ్చేడు. చిరునవ్వు నవ్వేడు సుబ్బారావు.

సుబ్బారావులో బాడ్మింటన్ ఆడేటప్పుడు బయటకి కనిపించిన ఉత్సాహం, ఇంకేచోటా ప్రదర్శనమయ్యేది కాదు. రమేష్‌కంటే నాలు గంగుళాలు పొడవవడంవలన, సుబ్బారావు బాడ్మింటన్ ఆటలో సెంటరు, రమేష్ రైట్ ఫ్రంట్ ఆడేవారు. ఒకసారి సుబ్బారావు కుడిచేతిమీద గాయమై ఆటలోంచి తప్పుకో వలసి వచ్చినప్పుడు ఎంత విసుక్కున్నాడో. ఆరోజు రమేష్ సెంటర్ ఆడేడు. రమేష్ సెంటర్ ఆడినందుకు బాధపడకపోయినా, తన అజాగ్రత్తవలన అయిన దెబ్బని చూసి, తననితాను తిట్టుకున్నాడు. అది జరిగాక, రమేష్, సుబ్బారావులు అడపాదడపా తమ స్థానాలని మార్చుకునేవారు. చాలాకాలంగా పరిచయమున్న రమేష్, సుబ్బారావులతో తను ఫ్రీగా కాలం గడపడం కొందరిని ఇబ్బంది పెట్టినా, తల్లిదండ్రులు పట్టించుకో లేదు. దాదాపు ప్రతీరోజూ కలుసుకునే వారు. రమేష్‌లో ఆ ఉద్వేగాన్ని తను ఎప్పుడూ గమనించలేదు. సంభాషణలో ఎక్కువభాగం రమేష్‌దీ, తనదీ. సుబ్బారావు తూచినట్టు ఎక్కువ మాటలాడేవాడు కాదు. ఇద్దరూ తనతో చనువుగా మసలినా, సుబ్బా రావు చూపులో భావాన్ని అర్థం చేసుకోవడా నికి తనకి అట్టేకాలం పట్టలేదు.

"నీకేం ఈ ఊరిలోనో, దగ్గర్లో మరో ఊరి లోనో ఉద్యోగం చూసుకుంటావు. నాకా అదృష్టంలేదు. పొట్టచేతపట్టుకుని ఎంత దూరం పోవాలో" అని రమేష్‌తో నిష్టూర మాడేవాడు సుబ్బారావు.

"మంచి ఉద్యోగం కోసమేగా ఆ ఇంజనీ

రింగ్ చదువు, మరి దాన్ని గురించి ఇంత బెంగపడతావేమిటి?" అని తను వేసిన ప్రశ్నకి ఏం సమాధానం చెప్పాలో తెలియక అవస్థ పడుతుంటే, అతని ఆంతర్యం తెలిసిన తను లోలోపలే నవ్వుకునేది.

ఒకరోజు రమేష్ రావడం ఆలస్యమైనప్పుడు,

"నేను దూరంగా వెళ్ళిపోవడం నీకు ఇష్టంలా ఉంది" అన్నాడు సుబ్బారావు.

తనకి బాధవేసింది. తన కంటిలో తిరిగిన నీటితెరని చూసి, అరనిమిషం చలించి, వెంటనే చిరునవ్వు నవ్వాడు.

లీలగా తిరిగిన నీటితెర అతనికి తనని పట్టించింది.

కబుర్లలో పడినపుడు, రమేష్‌లా కాకుండా, తనని ప్రత్యేకంగా పృచ్ఛించి చూసేవాడు సుబ్బారావు.

తన కళ్లలో ఏవైనా భావాలు కదలాడతాయేమోనని వెతికేవాడు పిచ్చి సుబ్బారావు!

పరీక్షలు ముగిసినా, తల్లితండ్రుల దగ్గరకి వెళ్ళకుండా, సావిత్రి దగ్గరే ఉండి, ఉద్యోగానికి దరఖాస్తులు పంపాడు.



కంటినిండా దిగులుతో, "నాకు ఢిల్లీలో ఉద్యోగం వచ్చింది, నెల్లాళ్లలో వెళ్ళిచేరాలి" అన్నాడు ఒకరోజు.

అతని దిగులు గురించి పట్టించుకోకుండా బోంబే హల్వాహౌస్‌నుంచి కలాకండ్, సమోసాలు ఖర్చు అతనితో పెట్టించేరు.

"ఇంటికి వెళ్ళి పదిరోజుల తరువాత వస్తాను. ఇక్కడనుంచే ఢిల్లీ వెళ్తాను" అన్న వ్యక్తి పదిరోజుల తరువాత రాకపోయేసరికి, 'ఎందుకు రాలేదా?' అని తను వ్యాకులపడింది.

ఇరవైరోజుల తరువాత పదిపన్నెండు కిలోగ్రాముల బరువు తగ్గి, నీరసంగా వచ్చిన సుబ్బారావుని చూడగానే, 'ఏమయింది? ఒంట్లో బాగులేదా?' అని తను ఆతృతగా ప్రశ్నించడం చూసి, లోతుగా వెళ్ళిన అతని కళ్ళు మెరిశాయి.

"పదిరోజులు జ్వరం పడ్డాను. దానికి తోడు ఈ దగ్గొకటి" అంటూ దగ్గుతూ రుమాలుతో నోటిని కప్పుకున్నాడు. ప్రస్ఫుటంగా కనిపిస్తున్న అతని దిగులు తనలో కూడా చోటుచేసుకుంది.

రమేష్ ఊరు వెళ్ళడంతో, అతనికి వీడ్కోలు చెప్పడానికి తను ఒక్కర్తే కాకినాడ స్టేషనుకి వెళ్ళింది. సర్కార్ ఎక్స్‌ప్రెస్ బయలుదేరడానికి సిద్ధంగా ఉంది.

ఎప్పుడూ తననితాకని అతను, ఒక్కసారి తన చేతిని నొక్కి, కదులుతున్న రైలులోకి ఎక్కాడు. తను చేయి ఊపింది. అతను తిరిగి చేయి ఉపేడో లేదో తెలియకుండా కంటిలో తిరిగిన నీటిపొర అడ్డు!

మార్దవంగా సంకేతాన్ని వివరిస్తూ అతను తన చేయి నొక్కిన తీరు ఎన్నో అర్థాలని చెప్పింది.

రైలు వెళ్ళాక మధ్యాహ్నం మూడు గంటలకి, తీక్షణమైన వేడికి కిరణాలు, వడదెబ్బ కొట్టే గాడ్పులు, శబ్దం చేసుకుంటూ పరిగెత్తే వాహనాలని పట్టించుకోకుండా సిమెంట్ రోడ్డు మీద భారంగా అడుగులు వేసుకుంటూ పరధ్యానంగా ఇంటికి చేరింది.

"ముభావత్వాన్ని జయించలేని మనిషి" అని పదేపదే అనుకుంటూ ఇంటిప్రాంగణంలో పచార్లు చేసింది ఆరోజు సాయంకాలం.

రోజులు దొర్లాయి, అది జరిగి చాలాకాలమైంది.

"సుబ్బారావు తిరిగి కనిపించడు, అతని మనస్సులో ఉన్నది తనకి ఎప్పటికీ తెలియదు" అనుకుంటూ రాని నిద్రకోసం అవస్థపడింది సంధ్య.



రెండురోజులుగా ఆకాశాన్ని అంటిపెట్టుకున్న మబ్బు విశ్రాంతికి వెళ్ళింది. సూర్యరశ్మి వేడికి, తారురోడ్డు మీదున్న చెమ్మలోంచి ఆవిర్లు లేస్తున్నాయి. ఆటోదిగి మొహంమీద పట్టిన చమటని రుమాలుతో తుడుచుకుంటూ తలుపు మెల్లిగా తట్టేడు సురేష్.

"రా సురేష్" అంటూ గాజుపూసలు వ్రేలాడుతున్న లేసుల కర్టెన్‌ని పక్కకి తొలగించి, లోపలికి ఆహ్వానించింది సంధ్య. తెల్లని వెంకటగిరి చీరకి కరక్కాయ సిరా రంగు పువ్వుల బోర్డరు. తీరుగా అమర్చికట్టిన చీరకుచ్చెళ్ళు, చీరకుచ్చెళ్ళకింద ఎర్రని చెప్పులు. గుండ్రటి మొహం, నుదుటన ఎర్రని కుంకుమబొట్టు. రవ్వంత సూదిగెడ్డం. "రా సురేష్" అని పిలిచినప్పుడు పెదిమల చివరలని ఆనుకుని లీలగా కనిపిస్తున్న బుగ్గమీద సొట్ట. చామనచాయ. పెద్ద చెవితమ్మెల మీద ఏడు చిన్నపొడులున్న

దుద్దులు. పలచబడ్డ జుత్తుకి బన్. సామాన్యమైన శరీరసౌష్టవం. వయస్సు ఏభైఏడో, ఏభైఎనిమిదో అని తనకి తెలిసినా, దానికి పదేళ్ళు తక్కువగా అనిపిస్తుంది.

లోపలికి వచ్చి ఫేన్ కింద సోఫాలో కూర్చున్నాడు సురేష్.

ఆమె కళ్ళు తనని అంత ఎందుకు ఆకర్షించేయో అవగాహన అయింది సురేష్‌కి.

పూర్తి నలుపుకాని కనుగుడ్లు. వెలిసిన నలుపు, గచ్చకాయ రంగు కలిసిన నలుపు. బజారులో నలుగురిలో కనిపిస్తే, పదేపదే చూడాలనిపించే అందం కాదు ఆమెది. కాని, నఖశిఖపర్యంతం హుందాతనం ఉట్టిపడుతోంది అనుకుంటుంటే,

"ఏమిటి అంత పరీక్షగా చూస్తున్నావు నన్ను? అబ్బ! ఫేన్ ఇంత మెల్లగా తిరుగుతోందేం?" అంటూ ఫేన్ స్పీడ్ పెంచి, కొంగుతో, మొహానికి పట్టిన చమటని తుడుచుకుంటూ, సురేష్‌కి ఎదురుగా కుర్చీలో సర్దుకుంది సంధ్య.

సిగ్గుపడిన సురేష్‌ని చూస్తుంటే చిరునవ్వు వచ్చింది సంధ్య పెదవులమీదకి.

కనీకనిపించకుండా కనిపించిన తెల్లని పలువరసతో బయటపడిన చిరునవ్వు.

"క్షమించాలి సంధ్యగారూ, మా డేడీ డైరీలలో ఏదో రాస్తే..." అనేంతలో,

"నన్ను ఆంటీ అని పిలు, ఇదిగో మా అమ్మాయి వాహిని" అంటూ సంభాషణని మార్చి, గదిలోనికి వచ్చిన ఇరవైమూడేళ్ళ ఇరవైనాలుగేళ్ళ యువతిని పరిచయం చేసింది.

"సురేష్ డేడీ, మీ డేడీ కలిసి బాడ్మింటన్ ఆడేవారు. సుబ్బారావు అంకుల్‌ని ఇదివరలో చూశావు"

"హలో" అంటూ తల్లిపక్కని చతికిలపడింది వాహిని.

యవ్వనపు తళతళతో, నేవళీకత ఉట్టిపడుతూ, చూపరులని ఆకట్టుకునే అందం ఉన్న వాహినికి శాంతంగా, హుందాగా, నిశ్చలంగా ప్రవహించే నదిలా కనిపిస్తున్న సంధ్యకి తేడా కొట్టొచ్చినట్టు కనిపిస్తోంది.

"బాడ్మింటన్ గురించి వినడమేకాని, ఆడుతుంటే చూడలేదు. కాకినాడలో ఎక్కడైనా ఎవరైనా ఆడుతున్నారా?" అనడిగేడు సురేష్.

"అది బి.సి. నాటి గేమ్. దటీస్ ఎ డెడ్ గేమ్. ఇప్పుడంతా క్రికెట్, షటిల్‌కాక్. మమ్మీ లంచ్ తినేద్దాం. ఒంటిగంటకి నేను మాధవి దగ్గరకి వస్తానని చెప్పాను" అంది వాహిని.

"వాష్‌బేసిన్ దగ్గర సబ్బు, టవల్ ఉన్నాయి. చేతులు కావాలంటే కడుక్కో" అంది సంధ్య.

టేబిల్‌మీద వండిన పదార్థాలు స్టీలు గిన్నెలలో అమర్చబడి వున్నాయి. రెండు స్టెయిన్‌లెస్ పళ్ళాలు, వాటిని ఆనుకుని రెండు కప్పులు, ఒక చిన్న ప్లేటు ఉన్నాయి. వాహిని, సురేష్ కుర్చీలలో సర్దుకున్నారు.

"మీరు మాతో కలిసి భోంచేయరా?" అనడిగాడు సురేష్ సంధ్యని.

"మమ్మీ పద్ధతులు వేరు. ఓల్డ్ ఫేషన్డ్. మనతో తనూ తింటే వడ్డించడానికి వీలవదంటుంది" అని విశదపరచింది వాహిని.

కూరల్ని, ఇతర పదార్థాలని కప్పులలోనికి వడ్డించేక, సెగలు కక్కుతున్న అన్నాన్ని ప్లేట్లలో వడ్డించి, చల్లారడానికి గరిటతో దానిని విస్తరించి,

"పప్పు అన్నంలో వేసేదా? వేరే కప్పులో ఉంచేదా?" అనడిగింది సంధ్య.

"అన్నం మీద వేయండి ఆంటీ"

జీలకర్ర, ఆవాలు, రవ్వంత ఇంగువ, నెయ్యి తాలింపుతో ఘుమఘుమలాడుతున్న పప్పుని కలిపి నోటిలో ఉంచుకోగానే జిహ్వా లేచివచ్చింది సురేష్‌కి.

"చింత చిగురు పప్పులోనికి నంజుకోవడానికి మజ్జిగ మిరపకాయలు బాగుంటాయి. కారం అభ్యంతరం లేకపోతే ట్రై

చేయి" అంటూ రెండు మిరపకాయల్ని ప్లేటు లోనికి వేసింది సంధ్య.

"నీకు వంట బాగా వచ్చునా వాహినీ" అనడిగేడు సురేష్.

"బాగారాదు, ఊరినిండా చచ్చేన్ని హోటల్స్ ఉంటుంటే వంటింటిలో టైమ్‌వేస్ట్ బాబూ, బోరు" అంది కాటిక ఎడ్వర్టయిజ్ మెంట్ మోడల్‌లా కళ్లని అటూ ఇటూ, తిప్పుతూ.

చిరునవ్వు నవ్వేడు సురేష్.

ఫాన్ ఒక్కసారి ఆగింది. "మళ్లీ మధ్యాహ్నం మూడయితేగాని సప్లయిరాదు, ఛస్తున్నాం" అంటూ బొడ్డునదోపి ఉన్న రుమాలుని చేతిలోనికి తీసుకుంది వాహిని. చిరుచమట వెంటనే వాహిని నుదుటమీద కనిపించింది.

సంధ్యలేచి, వంటింటిలోకి వెళ్లి, తాటిఆకు విసనకర్రతో తిరిగి వచ్చి, సురేష్ వాహిని లకి విసురుతుంటే, "థాంక్స్ మమ్మీ"అంటూ ప్లేట్‌లో పెరుగు వడ్డించుకుంది వాహిని.

సంధ్య అలా విసరడం ఇబ్బందిగా ఉంది సురేష్‌కి. "ఫరవాలేదు ఆంటీ" అన్నాడు ఒక సారి వారిస్తూ.

అయినా సంధ్య పట్టించుకోలేదు.

భోజనం కానిచ్చి ముందర గదిలోకి వచ్చేడు సురేష్.

రెండు రోజులు వాన మబ్బులముందు ఓడిన సూర్యుడు తెప్పరిల్లి ప్రకాశిస్తున్నాడు. గాలిలో తేమ ఎక్కువై శరీరంలోంచి చెమట బయటపడి, సురేష్ టీ షర్ట్‌ని తడిపి కిందకి దిగుతోంది. విసనకర్రతో విసురు కుంటున్నా చెమట తడి ఆరడంలేదు.

అధునాతనమూ, పురాతనమూకాని ఇల్లు. హాలులో కర్రతో చేయబడిన సోఫా లకి ప్లాస్టిక్‌పేము. దానిమీద రోజారంగు తొడుగులతో సన్నని ఫోమ్‌లు. సోఫాకి ఎదురుగా అండాకారంలో ఉన్న టీపాయ్ మీద లేసుల గుడ్డ పరచి ఉంది. గదిలో ఓ మూల తెరచి ఉన్న చెక్కబీరువా, దాని నిండా పుస్తకాలు. రెండు కిటికీలకీ సగభా గానికి తెల్లని పరదాలు.

ఏ ఆర్భాటమూ, ఏ అవలోపమూలేని ఇల్లు. భేషజాలకి పోకుండా వీలున్నంతలో సరిదిద్దిన ఇల్లు. విసనకర్రతో విసురు కుంటూ బీరువావేపు నడిచేడు సురేష్.

రెండు అరలలో ఇంగ్లీషు పుస్తకాలు, ఒక అరలో తెలుగు పుస్తకాలు, కింద మిగిలిన నాల్గవ అరలో పేపర్లు అమర్చబడి వున్నాయి. దుమ్ము లేని పుస్తకాలని చూడ గానే వాటిమీద శ్రద్ధ తెలియవస్తోంది. పుస్త కాల్లోంచి బెర్నార్డ్‌షా 'పిగ్మేలియన్' తీసి సోఫాలో కూర్చుని పేజీలని తిప్పనారంభిం చేడు.

మోతాదుకి మించి తిన్న అన్నం ప్రభా వంవలన రెండు నిమిషాలు గడిచేసరికి సురేష్ కళ్లు మూతలుపడ్డాయి. ఎంతసేపు నిద్రపోయేడో తెలియదుకాని, ఒక్కసారి శబ్దం చేసుకుంటూ ఫాన్ తిరగడం మొదల యేసరికి తెలివివచ్చింది.

ఎదురుగా సంధ్య, ఏదో పుస్తకం చదు వుతూ సురేష్‌వేపు తిరిగి,

"ఏమిటీ, రెండు నిమిషాలలో నిద్రపో యేవు? నువ్వు వచ్చిన వేళావిశేషమేమోకాని ఈ రోజు తొందరగా ఎలక్ట్రిక్ సప్లయి వచ్చే సింది" అంది నవ్వుతూ.

"సారీ, నిద్రపట్టేసింది. దానికి కారణం మీరు పెట్టిన అద్భుతమైన లంచ్"

"రవ్వకేసరి తినకుండా అన్నం ముందర నుంచి లేచేవు, తెస్తాను" అంటూ లేవబో యింది సంధ్య.

"అయ్యబాబోయ్! కడుపులో ఖాళీలేదు. తరువాత చూద్దాం"

"ఫిల్టర్ వేసేను. కాఫీ ఎప్పుడు కావా లంటే అప్పుడు ఇస్తాను"

"ఫిల్టర్ దిగగానే ఆలస్యం చేయకుండా కాఫీ తాజాగా ఉన్నపుడే తాగేయాలి" అన్నాడు సురేష్ నవ్వుతూ.

"మీ నాన్నలాగే నువ్వూ కాఫీ ప్రియుడివి. ఊ! ఇప్పుడు చెప్పు. ఇన్నాళ్ల తరువాత ఒక్కసారి ఈ దేశం అంటే ఆసక్తి ఎందుకు కలిగింది? నన్ను కలవాలని నీకెందుకు అనిపించింది?" అంది కాఫీ కప్పు అందిస్తూ.

"మా డాడీ చనిపోయేక డాడీ స్నేహితుడు తన దగ్గర డాడీ వదిలిన సామాన్లని నాకు ఈమధ్యనే పంపేడు. దానిలో పాత ఫొటో ఆల్బంలు, ఇతర సామాన్లు ఉన్నాయి. మా డాడీ డైరీలు రాసేవారని అప్పుడు నాకు తెలిసింది. యవ్వనంలో పది సంవత్సరాలు పాటు డైరీలు రాసి తరువాత రాయడం మానివేశారు. ఆ డైరీలు చదివేను, ఆ ఆల్బంలని చూసేను. మిమ్మల్ని, డాడీకి పరిచయమున్న వ్యక్తుల్ని చూడాలనిపించి బయలుదేరి వచ్చేను" అన్నాడు సురేష్.

"చిన్నప్పుడు మనం ఏవేవో ఆలోచిస్తాం. మనల్ని మలుపులు తిప్పుతుంది జీవితం. కొన్ని ప్రశ్నలకి సమాధానాలు తెలుసుకోకుండానే జీవితం ముగుస్తుంది. మీ డాడీ ఇంజనీరింగ్ చదివే రోజుల్లో నేనూ వాహినీ వాళ్ల డాడీ, మీ డాడీ కలిసి కబుర్లు చెప్పుకునే వాళ్లం. రమేష్ మంచి మాటకారి, మీ డాడీ అట్టే మాటలాడేవాడుకాదు" అని లేచి గోడమీదున్న ఫొటోని చేతిలోనికి తీసుకుని ఆప్యాయంగా తడిమింది సంధ్య.

"మా డాడీ మీ గురించి తన డైరీలలో వర్ణించి రాసుకున్నారని, మీరు ఏ పనిచేసినా దానిలో అందాన్ని చూసేవారన్న సంగతి మీకు తెలుసో, లేదో?!"

"అదెందుకు ఇప్పుడు? అది గతం. దానిని తిరగతోడి ఏం ప్రయోజనం? ఆ వ్యక్తే లేనపుడు తన ఆనందం కోసం డైరీలలో రాసుకున్న దాని గురించి సంవత్సరాలు గడిచేక ఇప్పుడు ఆలోచించి ఎందుకు మథనపడడం? పిరికివాళ్లు ప్రేమకి అర్హులు కారు. ఎంత ప్రేమించినా, ఎందుకూ పనికి రాని అడవిపూలే. రమేష్ బతికి ఉన్నపుడు ఐదేళ్లక్రితం మీ డాడీ ఈ దేశం వచ్చినపుడు కేతరీన్‌తో నీ పెళ్లి గురించి చెప్పేరు" అంటూ సంభాషణని మార్చబోయింది సంధ్య.

"నా వైవాహిక జీవితం నాలుగేళ్ల తరువాత ముగిసింది. ప్రేమించేమనుకుని చేసుకున్న పెళ్లి, జీవితపు సామాన్యపు ఒడిదుడుకులకే తట్టుకోలేక విచ్ఛిన్నమైంది. మా డాడీ ఊహలలో మీరు చాలాకాలం ఉన్నారన్న దానికి ఆయన భద్రంగా ముప్పయ్యేళ్లు దాచిన పాత డైరీలు. అవి చదివినపుడు ఎవరికైనా ఆ డైరీలో ఉదహరించిన వ్యక్తిని చూడాలన్న ఉత్సుకత జనిస్తుంది. మిమ్మల్ని ఆయన పెళ్లి చేసుకోలేక పోవడం ఎంత విచారకరం!"

"డైరీల సంగతి వదిలిపెట్టు సురేష్. మేం కలిసి కబుర్లు చెప్పుకున్న కొళాయి చెరువు ఇక్కడకి చాలా దగ్గిరే చూపిస్తాను" అంటూ లేచింది సంధ్య.

సంధ్యద్వారా తండ్రి గురించి తెలుసుకోవాలని ఉన్నా ఆమె దాన్ని గురించి చెప్పడానికి సుముఖంగాలేదు అనుకుంటూ ఆమె వేపు చూసేడు.

సంధ్య మొహంలో అలజడి స్పష్టంగా కానవస్తుంటే, మౌనంగా ఆమెతో కొళాయి చెరువువేపు నడిచేడు. సాయంకాలం ఐదయింది. ఎండ తీవ్రత తగ్గలేదు. సిమెంట్ రోడ్ల ప్రక్కని గతుకులలో నీళ్లు ఉన్నాయి. రోడ్డువారగా నడుస్తున్నపుడు సంధ్య చెప్పులు చెమ్మగా ఉన్న ఇసుకలో దిగబడితే చీరకుచ్చెళ్లని ఎత్తి, మెల్లిగా చెప్పులని లాగుకుని మందంగా అడుగులు వేస్తోంది. ఎండిన రోడ్డుమీదున్న దుమ్ముని, పరిగెత్తే వాహనాలు, నడుస్తున్న సంధ్య, సురేష్‌ల మీద ఎగరకొడుతుంటే నోటికి రుమాలుని అడ్డం పెట్టుకుని హుందాగా ముందర నడుస్తున్న సంధ్యకి, తండ్రి డైరీలో వర్ణించిన

సంధ్యకి పోలికలు కనిపించేయి.

★ ★ ★

"ఎలా ఉంది భోజనం? ఏఏపదార్థాలు వండింది సంధ్య?" అనడిగింది సావిత్రి.

"చింత చిగురు పప్పు, బంగాళాదుంపలవేపుడు, కొబ్బరి పచ్చడి, మజ్జిగపులుసు, రవ్వ కేసరి. నువ్వు చేసినట్టే ఆంటీచేసిన వంటకాలు బాగా రుచిగా ఉన్నాయి"

"మీ నాన్నకి లేని ఈ అనవసరంగా పొగిడే గుణం నీకు ఎక్కడనుంచి వచ్చింది? వాళ్ల అమ్మాయి ఎలా ఉంది?"

"వాహిని, పేరుకు తగ్గట్టుగానే ఉరకలెత్తుతూ ఉంది. నేవెళ్లిన కాస్సేపటిలోనే ఎవర్నో కలవాలంటూ వెళ్లింది"

"ఆ అమ్మాయిని పెళ్లి చేసుకుంటావేమిటి? నేను కదిపిచూస్తాను"

"వద్దు అత్తా ప్లీజ్. నాకు అలాంటి ఆలోచనలేదు. దాని గురించి కలలో కూడా ఆలోచించకు. ఇలా అయితే నేను తొందరగా ఊరెళ్లాల్సివస్తుంది"

"నువ్వు వద్దంటే నేను అనవసరంగా ఎందుకు కలగచేసుకుంటాను?"

"దాని మాట అలా ఉంచు. ఈ ఊరు వచ్చినపని పూర్తయింది. రెండుమూడు రోజుల్లో విశాఖపట్నం వెళ్లిపోదామనుకుంటున్నాను"

"అక్కడకి వెళ్లి మాత్రం చేసేపనులు ఏమున్నాయి? దాని గురించి తరువాత ఆలోచిద్దాం. మూర్తిని, ఆయనని రానీయ్, నేను వంట ప్రయత్నం చేయాలి" అంటూ వంటింటిలోనికి వెళ్లింది సావిత్రి.

సోఫాలో చతికిలపడి ఆలోచనలో పడ్డాడు సురేష్.

తండ్రి డైరీలలో వర్ణించినట్లు సంధ్య ఆంటీ విశిష్టమైన వ్యక్తే!

పళ్లెంలో అన్నం ఎంత పొందికగా వడ్డించింది.

ఫాన్ ఆగిపోగానే విసనకర్రతో విసరడం లాంటివి చిన్నచిన్న విషయాలే కావచ్చు. ఆ రకం ఆప్యాయతకి అలవాటులేని తను కాస్సేపు ఉక్కిరిబిక్కిరి అయినా ఎంత బాగుందో! తొందరపడకుండా, శాంతంగా, శ్రావ్యంగా ఆమె మాటలాడే తీరులో ఒక మార్దవత్వం ఉంది. ఆమెని భార్యగా పొందిన రమేష్ అదృష్టవంతుడు! అచంచలమైన విశ్వాసంతో, ధైర్యంతో ఆ బాహువులు ఎన్ని అండదండలు ఇచ్చేయో రమేష్‌కి. డాడీ ఎంత దురదృష్టవంతుడు? అనుకుంటుంటే,

"మా ఊరిలో దొరికే కలాకండ్" అంటూ ప్లేటులో స్వీటుని అందిచ్చింది సావిత్రి. చెంచాతో స్వీటుని నోటిలోనికి ఉంచగానే పాలు, పంచదార, నెయ్యిల మిశ్రమం కమ్మగా తగిలింది.

కలాకండ్! గత ముప్ఫయి ఐదేళ్లలో దీని రుచిలో ఏమీ మార్పు రాలేదేమో, కాని తండ్రి చదివిన కాలేజీలలో, అక్కడి వాతావరణంలో చాలా మార్పు తనకి కనిపించింది. తండ్రి డైరీలలో ఉదహరించిన దానికి ఈనాటి దానికీ ఎక్కడా పోలికేలేదు. మార్పు నచ్చినా రాకపోయినా కాలం మార్పుని తెస్తుంది. ప్రజలు ముసలివాళ్లు అవుతారు. కొందరు కనుమరుగవుతారు శాశ్వతంగా. అయినప్పటికీ తండ్రి పెరిగిన ఇంజనీరింగ్ హాస్టల్ కాలేజీ వాతావరణానికి, తను చూసిన వాతావరణానికి పొంతనేలేదు. ఉత్సాహంలేనట్టు కనబడిన విద్యార్థులు, ఉన్నత విద్య నభ్యసించే విద్యార్థులు నివశించే ప్రదేశాలులా కాకుండా పారిశుధ్యం లేని హాస్టల్స్ దిగజారుడుని స్పష్టంగా తెలియజేస్తున్నాయి. అవాంఛనీయమైన ఈ మార్పు ఈనాడు తండ్రి చూస్తే చాలా బాధపడతాడు. అదృష్టవంతుడు! చనిపోయి బతికిపోయేడు! అనుకుని మధనపడుతుంటే లోపలికి వచ్చిన వెంకటేశ్వర్లు మావయ్య,

"సురేష్, ఈయన పేరు పద్మనాభం. బ్యాంక్‌లో పని. నిన్ను చూద్దామని వచ్చేరు"

అంటూ తనతో వచ్చిన ఆగంతకుని పరిచయం చేసేడు. ఆగంతకుని వయస్సు బహుశా ఏభై ఉంటాయేమో!

కబుర్లలో పడ్డారు. కాసేపయ్యేక పద్మనాభం,

"మావాడు ఎమ్‌సెట్ రెండవసారి రాసేడండీ, కాని ఈమారూ మంచి రేంక్ రాలేదు. ప్రైవేటు ఇంజనీరింగ్ కాలేజీలో సీటు వస్తుందేమో! దాని విషయం మీతో సంప్రదిద్దామని వచ్చేను. వెంకటేశ్వర్లుగారు మాకు చాలాకాలంగా తెలుసును" అన్నాడు.

"మీవాడి ఇంటరెస్ట్ ఏమిటి?"

"వాడికి ఇది అంటూ ప్రత్యేకంగా దేని మీదా ఇంటరెస్ట్‌లేదు. అయినా వాడికేం తెలుస్తుంది? మనం పెద్దలు ఏదిమంచిదో, ఏది మంచిదికాదో చూడాలి"

"ఈ దేశంలో ఏ ఇంజనీరింగ్ విభాగాలలో ఉద్యోగాలు వస్తున్నాయి?"

"ఉద్యోగాలు చాలా తక్కువ. ఏదో ఆ ఇంజనీరింగ్ చదివేస్తే, మా బావమరది ఒకడు అమెరికాలో ఉన్నాడు చాలాకాలమై. అక్కడకి వీడిని తోలేస్తే వాళ్ల బాధలు వాళ్లు పడతారు"

"అమెరికా వెళ్లిపోవడం అంత తేలికా?"

"అదేమిటండీ, వెంకటేశ్వర్లుగారు, మీకు తెలిసే ఉంటుంది అప్పారావు, అదేనండి ఆంధ్రాబ్యాంక్‌లో ఎకౌంటెంట్. వాళ్ల అబ్బాయి బి.యస్.సి చేసేక అమెరికా వెళ్లేడు"

వెంకటేశ్వర్లు సంభాషణలో కలగచేసుకుంటూ, "ప్రైవేటు ఇంజనీరింగ్ కాలేజీకి ఫీజు ఎంత?" అనడిగేడు.

"దాదాపు ముప్పయివేలు సంవత్సరానికి"

"అంటే మీరు మీ అబ్బాయి చదువుకి అతని ఇంజనీరింగ్ డిగ్రీకోసం దాదాపు లక్షన్నర నుంచి రెండు లక్షలు ఖర్చుపెట్టడానికి సిద్ధంగా ఉన్నారు. ఇంజనీరింగ్ పాసయేక ఉద్యోగాలు లేవంటున్నారు. ఒకవేళ అతను వీసా చిక్కులలో అమెరికా వెళ్లలేకపోతే ఇక్కడ ఉద్యోగం దొరకకపోతే, మీరు ఖర్చుపెట్టిన రెండు లక్షలు ఎందుకూ పనికిరాకుండా పోతుందేమో! దాని సంగతి మీరు ఆలోచించేరా?" అనడిగేడు సురేష్.

"మీరు చెప్పినదంతా నిజమేననుకోండి. కాని అలా ఆలోచిస్తే ఏమీ చేయలేమండి. అదీ కాకుండా ఏదైనా వాడి అదృష్టం మీద ఆధారపడి ఉంటుందికదండీ. మెకానికల్‌లో చేర్పించేదా? లేక కంప్యూటర్స్ కోర్సులో చేర్చేదా?" అని సంభాషణ చివరకి వచ్చేడు పద్మనాభం. వాదన పెంచడానికి ఇష్టంలేక,

"ఈ రోజుల్లో అమెరికాలో కంప్యూటర్, కెమికల్ ఇంజనీరింగ్‌లకి హెచ్చు గిరాకీ వుంది. మెకానికల్ కూడా పరవాలేదు" అన్నాడు సురేష్.

"మళ్లీ మిమ్మల్ని కలుస్తానండి" అంటూ లేచేడు పద్మనాభం.

గేటువరకూ తోడువెళ్లి పద్మనాభాన్ని సాగనంపి తిరిగివచ్చిన వెంకటేశ్వర్లు, "నాయనా సురేష్, ఇక్కడ ఎవరికీ నిజమైన సలహా అవసరంలేదు. తమకి అయోగ్యకరమైన సలహాలే కావాలి. నువ్వు తర్కంవాడి ఏదో చెప్పబోయేవు.

ఆంధ్రప్రదేశ్‌లో దాదాపు ముప్పయి ఇంజనీరింగ్ కాలేజీలు ఉన్నాయేమో. సంవత్సరానికి నాలుగువేల మంది కుర్రాళ్లు డిగ్రీలు పుచ్చుకుని బయటకి వస్తుంటే పట్టుమని నాలుగు వందల ఉద్యోగాలు కూడాలేవు"

"మరి ఎందుకు ప్రజ ఇంజనీరింగ్ అంటే పడిఛస్తోంది?"

"ఎలాగోలాగ ఇంజనీరింగ్ అయిందనిపించి, వాడిని అమెరికాలోవేయగలిగితే కోటలోపాగా వేసినట్లే అనుకోవడం ఒకటి. రెండవది కట్నంమీద ఆశ.

ఆవు పొదుగు చూసి దాని ధర నిర్ణయించినట్లు, ఇంజనీరింగ్ ఆఖరి సంవత్సరంలో ఉండగా వాని ధర నిర్ణయమౌతుంది. పాలకోసం ఆవు దగ్గరకి వెళ్తే మూతిపళ్లు విరి

గేలా తన్నవచ్చు, కాని అప్పటికి డబ్బులు వలుచుకుని వెళ్లిపోతాడు అమ్మినవ్యక్తి. ఇంజనీరింగ్ పాసయేక వాడికి ఉద్యోగం దొరకకపోతే వాడి ధర సున్నా. అందుకే ముందరే అన్ని ఒడంబడికలు కుదిరిపోతాయి. ఈ కట్నాలు, కొన్నిచోట్ల ఏభయి అరవై లక్షలకి వెళ్లింది. రాజకీయ నాయకులని కొనుక్కుని, నలుగురు ధనవంతులు చేరి ఒక ఇంజనీరింగ్ కాలేజీ తెరవడం, సున్నుండల కోసం చీమలు ఎగిరిపరిగెత్తినట్లు ఎమ్‌సెట్‌లో రేంకు తక్కువ వచ్చిన వాళ్లు ఈ ప్రైవేటు కాలేజీలలో చేరుతారు. చాలా కాలేజీలలో లేబరేటరీ వసతులు సరిగ్గా ఉండవు. ఎంత చదువు వస్తుందో వాళ్లకే తెలియాలి, కాని యాజమాన్యానికి కావలసినంత కీర్తి, డబ్బు వస్తాయి. కట్నం మీద ఆశ ఉన్న తల్లితండ్రులు, బాగా పుష్కలంగా డబ్బున్న ప్రజ, డబ్బు పెట్టి ఇంజనీరింగ్‌సీటు కొనుక్కుని చదివేస్తున్నారు. వాళ్ల గురించి మనం బాధపడకూడదు, ఆలోచించనవసరంలేదు. కాని దురదృష్టవశాత్తూ ఉన్న ఇళ్లమీద అప్పులు తెచ్చి, ప్రావిడెంట్ ఫండ్‌లోంచి డబ్బులాగి, బంగారం అమ్మి కొంతమంది మధ్యతరగతి కుటుంబీకులు ఈ చదువులలో పెడతారు. కుర్రాడి ఇంజనీరింగ్ చదువు ముగిసేసరికి ఇల్లు గుల్లవుతుంది. వాడికి ఉద్యోగం రాకపోతే ఇహ చూడు వాళ్ల బాధలు. ఇంటిలో ఆడపిల్ల పెళ్లికి కాని ఉందా ఇక గోవిందే. ఎలాగోలాగ ఆడపిల్ల పెళ్లి చేసేస్తే మిగతా శేషజీవితం చాలా దుర్భరంగా గడుస్తుంది.

ఎవరిది తప్పు అని అడగకు. ఇది అందరిదీ! నాకు తెలిసిన కుటుంబంలో ఇంటిలో ఉన్న ఆస్తంతా పెట్టి ఇంజనీరింగ్ చదివించేక వాడు డిగ్రీపుచ్చుకుని ప్రేమలోపడి ఆమెతో దూరంగా వెళ్లిపోయేడు. బీద పక్షులు చావు ఎప్పుడు వస్తుందా? అని ఎదురు చూస్తున్నారు. మనం తొందరగా దిగజారుతున్నాం" అన్నాడు వెంకటేశ్వర్లు.

వెంకటేశ్వర్లు వేపు విచారంగా చూసేడు సురేష్.

★ ★ ★

సురేష్ వెళ్లేక సంధ్య ఆలోచనలో పడింది.

సుబ్బారావు తన గురించి ముప్ఫయి ఏళ్ల క్రితం డైరీలలో ఆరాధనా పూర్వకంగా రాసుకున్నాడని సురేష్ చెప్పినపుడు గుండె అంత తీవ్రంగా కంపించినా సురేష్ వివరాలు చెప్పబోతే తనెందుకు వారించింది? ఒక పట్టాన అర్థమవదు ఈ మనస్సు!

సుబ్బారావు పరాయి వ్యక్తి కావడం ఒక కారణమా? తన గురించి డైరీలో రాసినవి బయటకి వెల్లడి చేయడం ఇష్టంలేకా? సరి అయిన సమయంలో వెనుకంజవేసిన సుబ్బారావు మీద దాగుకొని ఉన్న కోపమా?

తనంటే ఉత్సాహం చూపించిన సుబ్బారావు ఢిల్లీ వెళ్లేక నిశ్శబ్దతకి కారణం ఏమిటి? ఆ డైరీలలో ఉందేమో! సురేష్‌ని అడిగితే? దానిగురించి అతను ప్రస్తావించబోతే అది చర్చించడం ఇష్టంలేదని తను విముఖత చూపించేక ఇప్పుడెలాసాధ్యం?

ఆ డైరీలలో ఏమైనా తన గురించి ఉంటే అది తనకీ సుబ్బారావుకీ పరిమితం. ఇతరులకి అందులో జోక్యంలేదు.

రమేష్‌తో జీవితం ముడిపడ్డాక అంతకు ముందర తన మనసులో ఉన్న ఊహలని ఆవలకినెట్టి, అంతరాత్మ తనని ప్రశ్నించే అవసరం ఎప్పుడూ రానివ్వకుండా, చిత్తశుద్ధితో రమేష్‌తో చేతులు కలిపింది. గతం ఒక పగటికల అనుకుని దానిని మరుగున తోసి తల్లిగా, గృహిణిగా ఏ వెలితీలేకుండా జీవితపు చివరి అంచుకు చేరుకుంటుంటే ఈనాడు సురేష్ వచ్చి తను కట్టుకున్న కట్టడాన్ని కదిలించేడు. రమేష్‌తో పెళ్లి అయేక, సుబ్బారావు వచ్చి కలిసినపుడు గతం

ఎప్పుడూ చర్చించలేదు, గతంలేనట్టే ప్రవర్తిం చేరు ఇద్దరూ!

యవ్వనంలో ఇద్దరిమధ్య ఆకర్షణలో ఎక్కువభాగం శారీరకమే కావచ్చు కాని ముప్ఫయి ఏళ్లు గడిచినా కనుమరుగైనా తన గుండెలో ఒక మూల అజ్ఞాతవ్యక్తిలా ఆవగింజమేర సుబ్బారావు దాగిఉన్నాడని ఈమధ్య గతించిన రోజులు చెబుతు న్నాయి.

స్త్రీ తన మొదటిప్రేమని మరచిపోదా మన్నా సాధ్యపడదు కాబోలు!

ఏభై ఎనిమిదేళ్ల తనకి ప్రేమ గురించి ముప్ఫయి ఏళ్ల క్రితం సంఘటనల గురించి ఈ అనవసరపు వ్యాకులపాటేమిటి? అని సముదాయించుకోబోయింది సంధ్య.

మరోసారి మనస్సు విననడంతో అసహ నంగా సోఫాలోంచి లేచి చేతికి దొరికిన పుస్తకాన్ని అందుకున్నా తెరిచిన పేజీమీద దృష్టి నిలవకుండా ఉండడంతో అలసట వచ్చి పరుపుమీదకి చేరి కళ్లు మూసుకుంది.

★ ★ ★

"నేను ఈ దేశం వచ్చి చాలాకాలమైంది. మా డాడీ చదువుకున్న చోట్లకి వెళ్లేను. ఆయన పనిచేసిన ప్రదేశాలు కూడా చూసేస్తే చాలా మట్టుకు నేచేద్దామనుకున్న పనులు పూర్తయినట్లే. ఢిల్లీలో ఒక వారం రోజులు ఆగి, అలా అమెరికా వెళ్లిపోతాను" అన్నాడు సురేష్.

"రాబోయే రోజులన్నీ పండుగ రోజులే. దసరా, దీపావళి చాలా కోలాహలంగా ఉంటాయి. ఇదివరలో విజయనగరంలో మందుగుండు సామాను కాల్చినట్టు ఇంకె క్కడా కాల్చేవారు కాదుట. టపాకాయలు, తారాజువ్వలు, దట్టించిన వెలంకాయలు, తాటిబుండీలు ఇళ్లలో తయారుచేసేవారు. ఒక పేటకి ఇంకొకపేటకి హోరాహోరి టపాకాయల పోరాటం జరిగేదని, కాని ఈ రోజుల్లో ఆ ఉత్సాహం అంతా ఇగిరిపోయిం దని, ఇప్పుడు రాత్రి తొమ్మిదయేసరికి చలి చలి అంటూ పక్కెక్కి ముసుగు పెట్టేస్తున్నా రని నాన్నారంటారు" అన్నాడు ప్రసాదు. సురేష్ ఏమీ వ్యాఖ్యానించలేదు.

"విజయనగరంలో దీపావళి ఎలా ఉంటుందో చూడడానికి వెళ్దామేమిటి? "

"చూద్దాం" అన్నాడు సురేష్.

"సింహాచలం గుడి చూస్తావా? "

"చూద్దాం"

"కాకినాడ వెళ్లి వచ్చిన దగ్గరనుంచి నీలో మార్పు కనిపిస్తోంది. ఏమయింది అక్కడ? "

"ఏమీ అవలేదు"

"మరి? "

"నాకు ప్రత్యేకంగా దేముడంటే నమ్మకం లేదు. కాకతాళీయంగా ఇప్పటివరకు నేచూ సిన గుడులు నాలో ఉత్సాహాన్ని రేకెత్తించ లేదు. గుడి ప్రార్థన కోసమైతే అక్కడ వాతా వరణం దానికి అనుకూలంగా ఉండాలి. నేచూసిన గుడులన్నీ చాలా గలీజుగా ఉన్నాయి. గుడి ప్రజలు కలిసేచోటు అంటే అవి రోడ్డుమీద ఉండకూడదు. మాటవర సకి నిన్న మనం స్టేషనుకి వెళ్లేటప్పుడు కని పించిన గుడి సంగతే తీసుకో, చిన్న పిల్ల లతో ప్రార్థనకోసం రోడ్డుదాటి వెళ్లే ప్రజ, వేగం పరిగెత్తే వాహనాలు. ఏ ప్రమాదం జరుగుతుందోనని భయంవేసింది. రోడ్డు మీద వాహనాలు ఆపి ప్రార్థించే సమయం లేని కొందరు, రెండు సెకన్లుపాటు స్టీరింగ్ వీల్‌ని వదిలి కళ్లు మూసుకుని భగవం తుని తలచుకుంటే ఆ రెండు సెకన్లలో ఏక్సి డెంటయి కొంతమంది అకస్మాత్తుగా ప్రాణాలు కోల్పోయే అవకాశం లేదం టావా? ఒకరి ప్రార్థన ఇంకొకరికి హాని, ఇబ్బంది కలగచేయకూడదు.

"ప్రజలు అలవాటు పడిపోయేరు, ఏమీ అవదు అని నువ్వు వాదించవచ్చు కాని

ఏక్సిడెంట్ అవడానికి అరసెకను చాలు" అన్నాడు సురేష్.

"వాళ్ల కర్మ! ఎలా రాసి పెట్టిఉంటే అలా జరుగుతుంది. మన చేతిలో ఏముంది?" అన్నాడు ప్రసాదు.

"మతం, దేముని విషయాలలో వాదనతో ఒకర్ని ఇంకొకరు మార్చలేరు, ఆ టాపిక్ వదిలేద్దాం. బీచికి వెళ్దామా?"

"ముందు దశపల్లాలో ఒక స్ట్రాంగ్ కాఫీ పట్టించేక అలా బీచికి వెళ్దాం" అన్నాడు ప్రసాదు.

★ ★ ★

"చూసేవా ఆటోవాడు గవర్నర్ బంగళా నుంచి ఇంజను ఆపుచేసి బండిని నడిపినా ఇప్పుడు నీకు భయం వేయడంలేదు. ఏదైనా అంతే. అలవాటు లేకపోతే కొత్తలో ఏదైనా అలాగే భయపెడుతుంది" అంటూ ఆటో డ్రైవరుకి డబ్బులిచ్చి హోటల్ దశపల్లాలోనికి సురేష్‌తో నడిచేడు ప్రసాదు.

"ఆ మూలకి వెళ్లి కూర్చుందాం" అంటూ వెలుతురు తక్కువగా వున్న ప్రదేశాన్ని చూపించేడు ప్రసాదు. ఇద్దరూ వెళ్లి కుర్చీలలో ఆసీనులయేరు. ప్రసాదు, సురేష్‌లు కూర్చున్న బల్లకి దగ్గరగా ఉన్న పెద్ద టేబిల్ మీద ఎనమండుగురు కాలేజీ కుర్రాళ్లు బిగ్గరగా అందరికీ వినిపించేంత శబ్దంచేస్తూ మాటలాడుతున్నారు. దాదాపు ఇరవై ఏళ్ల వయస్సువాళ్లే అందరూ.

"ఈ సర్వర్ నాకొడుకు ఎక్కడ చచ్చేడురా? దోశెకి ఆర్డరిచ్చి అరగంటయింది" అన్నాడు ఆ గుంపులో ఒకతను. ప్రసాదు వేపు ఆశ్చర్యంగా చూసేడు సురేష్. ఏమీ పట్టించుకోకుండా వాళ్ల మాటలని వినసాగేడు ప్రసాదు. ఇతర ప్రజలు అదే గదిలో దగ్గరగా కూర్చున్నారన్న ఇంగితం లేకుండా దురుసుగా సంభాషణ సాగుతోంది. సర్వర్ వచ్చి ఆర్డరిచ్చిన పదార్థాలని అమరుస్తుంటే అతనిని దుయ్యపడుతూ వాటిని అందుకుంటున్నారు.

"గట్టి చట్నీ తెమ్మంటే ఇది తెచ్చేవేమిటి?" అని సర్వర్‌ని కసిరేడు ఒకడు.

మెల్లిగా కోలాహలం తగ్గింది.

దగ్గరగా వచ్చిన సర్వర్‌తో, "రెండు బాసుందీ, రెండు స్ట్రాంగ్‌కాఫీ" అని ఆర్డరిచ్చేడు ప్రసాదు.

"రేపు ప్రొద్దున్న లేబరేటరీకి వెళ్లాలా? లేక రావడం లేదని చెప్పేసారా?" అనడిగేడు ఆ గుంపులో ఒక వ్యక్తి దోసెని నోట్లో ఉంచుకుంటూ.

"లేబరేటరీ క్లాసుకి వెళ్లేదేమిటి ఛీ?!"

"ఒరేయ్ ఎటెండెన్సు తీసుకుంటే తరువాత చిక్కులలో పడతాం"

"క్లాసులు నడిపి, ఎటెండెన్స్‌లో ఆబ్సెంట్ వేయ ప్రయత్నిస్తే ఆ రంగాగాడిని ఏం చేసేం? కుర్చీతో సహా వాడిని బయటకి విసిరేయలేదూ?"

"నాకు ఒక చిన్న పని ఉంది. ఆరున్నరకి గురుద్వారా దగ్గర కలుద్దాం. బోసూ, నా బిల్ నువ్వు ఇచ్చేయరా, సాయంకాలం నీకు డబ్బు ఇచ్చేస్తాను" అంటూ ఆ గుంపులోంచి ఒక కుర్రాడు ఆదరాబాదరాగా లేచి వాచీ వేపు చూస్తూ, తలుపు తీసుకుని స్కూటర్ వేపు పరిగెత్తేడు.

"ఏమిటి గురూ మనవాడి పని?"

"పద్మ దగ్గరకి ఎటెండెన్స్ వేయించుకోవడానికి వెళ్తున్నాడు"

"ఎవరు ఆ బోటనీ పద్మే? ఎలా పట్టేడు గురూ?" అంటూ తాగడానికి తెచ్చి టేబిల్ మీదున్న గాజుగ్లాసు నీళ్లలోనికి ఎంగిలి చేతిని ముంచేడు అతడు.

సర్వర్ తెచ్చిన బిల్ తీసుకుని బిలబిలా అందరూ తరలివెళ్లేరు.

బాసుందీ తిని, కాఫీ తాగుతున్న సురేష్ ప్రసాదు వేపు చూసేడు.

"వీళ్లు కాలేజీ కుర్రాళ్లు. క్రికెట్ మేచ్ అయితే ఈ దేశంలో క్లాసులు నడవవు.

రేపు క్రికెట్ మేచ్ ఉందిగా. దాని గురించే ఆ చర్చంతా" అన్నాడు ప్రసాదు.

"మరి పాఠాలు? "

"పాఠాలు ఎవడికి కావాలి? డిగ్రీ కావాలి కాని. అట్టే ఆలోచించకు సురేష్. ఒకసారి నీకు చెప్పేను. ఇక్కడ కల్చర్ వేరు. ఇక్కడున్న సమస్యలకి నీ దగ్గర పరిష్కారం లేదు. చూసేవా, వాళ్లు డబ్బుని ఎంత సునాయాసంగా ఖర్చుపెడుతున్నారో! ఎవరన్నారు ఇండియా బీదదేశమని? "

బిల్ చెల్లించి సురేష్, ప్రసాదులు బయటపడ్డారు.

ప్రక్క టేబిల్‌మీద కూర్చుని గలాభా చేసిన కుర్రాళ్లు స్కూటర్‌స్టేండ్‌లో నిలబడి కబుర్లు చెప్పుకుంటున్నారు. మంచి దుస్తులతో, చేతికి ఉంగరాలతో, నోటిలో సిగరెట్లతో జులాయి కబుర్లు చెప్పుకుంటున్న వాళ్లని చూసేసరికి ఏం అనిపించిందో ఏమో, రెండవవేపు మొహం తిప్పుకున్నాడు ప్రసాదు.

బీచిలో కూర్చుని శూన్యంగా సముద్రం వేపు చూస్తున్న ప్రసాదుని చూసి జాలివేసింది సురేష్‌కి. అతను ఎందుకు మధనపడుతున్నాడో అర్థమయింది.

"వీళ్లకి అంత డబ్బు ఎక్కడనుంచి వస్తోంది? వీళ్ల తల్లితండ్రులు అంత ధనవంతులా? జీతంమీద ఆధారపడే వ్యక్తులెవరూ ఇంత ఆర్జించడం కష్టం" అని ప్రసాద్‌ని సంభాషణలోనికి దించ ప్రయత్నించేడు సురేష్.

"వీళ్ల దగ్గర ఉన్నదంతా నల్లధనం. వాళ్ల బాబులు బిజినెస్‌లో మోసాలు చేసి పన్నులు ఎగవేయగా ఆర్జించిన డబ్బది"

"మరి ప్రభుత్వం ఏం చేస్తోంది? "

"నీకు ఈ దేశం సంగతి ఏమీ తెలియదు. లంచగొండితనం నరనరాల్లో జీర్ణించుకు ఉంది. వ్యాపారంలో పద్దులు సరిగ్గా ఉండవు. ఇన్‌కమ్‌టాక్స్ ఆఫీసరుని డబ్బు ఇచ్చి కొనేస్తారు. ఐదు లక్షల ఆదాయం ఉంటే ఏభై వేలే అని రాయడానికి ఒప్పుకుంటాడు ఆ ఆఫీసరు"

సురేష్ ఆలోచనలో పడడం గమనించి, "ఇక్కడ నల్లధనం ఎలా పెరుగుతుందో నీకు చెప్తాను. ఉదాహరణకి ఫ్లాట్ల సంగతి తీసుకుందాం. ఒక ఫ్లాట్ ఖరీదు మూడు లక్షలనుకో. రెండు లక్షలు నల్లధనం ఇచ్చి మిగతా లక్షకే ఫ్లాట్‌ని నమోదు చేయిస్తారు. మూడు సంవత్సరాల తరువాత దానిని అయిదు లక్షలకి అమ్మితే, దానిలో నాలుగు లక్షలు నల్లధనం కింద అందుకుంటారు. అంటే మూడు సంవత్సరాలలో వాళ్ల దగ్గర ఉన్న నల్లధనం రెట్టింపయిందన్న మాట"

"దీనివల్ల నష్టపోయేదెవరు? "

"ప్రభుత్వానికి లక్ష రూపాయలమీదే ఆస్తి విక్రయం పన్ను ముడుతుంది. అందుచేత ప్రత్యక్షంగా నష్టపోయేది ప్రభుత్వం"

"కూరల బజారుకి వెళ్లి చూడు. డబ్బుంటే ఖాతరులేని వాళ్లు ధరలని ఎలా పెంచేస్తున్నారో! నువ్వు చూస్తానంటే నల్లధనం ఎంత సునాయాసంగా ఉత్పన్నమౌతుందో చూపిస్తాను. పూర్ణా మార్కెట్‌లో దొండకాయలు అమ్మేవ్యక్తిని ఉదాహరణగా తీసుకుందాం. ప్రొద్దున్నే ఆమె దగ్గర మదుపుకి డబ్బు ఉండదు. కళ్లీలాల్చీ, బంగారు ఉంగరాల వ్యక్తి ఆమెకి ఏభై రూపాయలు అప్పుగా ఇస్తాడు.

అయితే సాయంకాలమయేసరికి ఆమె అతనికి ఏభైఐదు తిరిగి ఇవ్వాలి. అంటే ఒక ఏభై రూపాయలని వాడి ఆ వ్యక్తి నెలలో నూటఏభై సంపాదిస్తున్నాడు. పన్నులేదు, మన్నులేదు ధానిమీద ఇలాగే చిన్నచిన్న కొట్లవాళ్ళకి డబ్బు అప్పు ఇచ్చి నల్లధనం సంపాదిస్తున్నాడు డబ్బున్న వ్యక్తి. ఇది ఉభయతారకం!

"కాని పరోక్షంగా, సామాన్యప్రజ రెండువిధాల నష్టపోతోంది. ఒకటి ప్రభుత్వానికి

పన్ను తక్కువ రావడం, రెండు ధరలు పెరగడం. ఈ నల్లధనంతో ఓట్లని కొని రాజకీయనాయకులవుతున్నారు. చూసేవుగా, హవాలా కేస్‌లలో, ఇంకా ఇతర కేసులలో ఎంతెంత నల్లధనం చేతులు మారిందో! ఇదంతా నాలాంటి సామాన్య వ్యక్తికి తెలిసినది. ఇహ కంట్రాక్ట్స్‌లో చెప్పనక్ఖరలేదు" అన్నాడు ప్రసాదు.

"నల్లధనంలేని దేశంలేదు. అమెరికాలోనూ ఉంది. కాని ఇలాంటి దారుణం కాదు. ఎందుకూ పనికిరాని షేర్లని, బాండ్లని అమ్మడం, బ్యాంకులో అప్పులు పుచ్చుకుని ఎగేయడంలాంటి మోసాలు ఎక్కువ" అన్నాడు సురేష్.

"అది ఇక్కడా మొదలయింది. ఈమధ్య ప్రావిడెంట్ ఫండ్‌లోంచి డబ్బు లాగి, బంగారాలు అమ్మి, మధ్యతరగతి కుటుంబీకుడు డబ్బుని షేర్ మార్కెట్‌లో పెట్టి ధనవంతుడవుతామని ప్రయత్నిస్తున్నాడు. మాటవరసకి ఆల్విన్ షేర్ల గురించి తీసుకుందాం. నీదగ్గర రెండువందల షేర్లు ఉన్నాయి. షేర్ విలువ ముప్పయి అని పేపరులో చూడగానే, ఆ రెండువందల షేర్లని అమ్మమని బ్రోకరుకిస్తావు. వాడు దానిని వాడికి ఇష్టంవచ్చిన ధరకి అమ్ముకుంటాడు. నెల్లాళ్ళతరువాత, ఈ నెల్లాళ్ళలో అన్నిటికన్నా తక్కువ ధర ఉన్న రోజున అమ్మాల్సివచ్చిందని, అమ్మేనని, దానిలో తన బ్రోకరేజి తీసుకుని మిగతాది నీకిస్తాడు. ఎంతకి అమ్మినా వాడికి లాభమే. అదొకటేకాదు, నీ డబ్బు నీకు ఇవ్వడానికి నిన్ను పదిసార్లు తిప్పుతాడు. ఎంతోకొంత ఇస్తే చాలు దేముడా! అనే దశకి నువ్వు వచ్చేక వాడు ఇచ్చిన దానిని ప్రసాదంలా అందుకుని ఇంటికి వెళ్తావు"

"ప్రభుత్వం ఇలాంటి చిన్న విషయాలు ఎందుకు పట్టించుకోదు. అమెరికాలో టెలిఫోన్ చేస్తే చాలు, ఆటోమేటిక్‌గా బ్రోకరు షేర్లని అమ్మేస్తాడు" అన్నాడు సురేష్.

"ఈదేశంలో ఏ మార్పు తేవడానికి ప్రయత్నించినా, అన్యాయాన్ని అరికట్టప్రయత్నించినా బలం ఉన్నవాళ్ళు స్ట్రైక్. ఈ బ్రోకర్లందరూ కూడబలుకుకుని ఏదీ సాధ్యపడకుండా అడ్డుపడతారు. ఆ దేశంలో ఏం జరుగుతుందో తెలియదు కాని, ఈ దేశంలో ఒకసారి ప్రభుత్వ ఉద్యోగంలో కాని బేంకులలో కాని, పెద్దపెద్ద ప్రైవేట్ కంపెనీలలో కాని చేరేక ఆ వ్యక్తిని ఉద్యోగంలోంచి తీసివేయడానికి వీలులేదు. ఉద్యోగంలోంచి తీసివేయడం వరకు ఎందుకు? వాళ్ళ ఇంక్రిమెంట్ కూడా నిలిపివేయడానికి ఎవరికీ అధికారంలేదు. యూనియన్, ప్రతీ దానికీ యూనియన్. వాళ్ళ పనిచేయరు, ఇతరులని నియోగించడానికి ఒప్పుకోరు.

"గో స్లో" అన్నదొకటి ఉద్భవించింది. అంటే ఆఫీసుకి వస్తారు. ఇరవై ఫైళ్ళని చూసేబదులు పది ఫైళ్ళనే చూస్తారన్న మాట. గాంధీగారు మాకు ఉగ్గుపాలతో నేర్పిన విద్య ఇది. ఎనిమిది దాటింది, ఇంటికి వెళ్దాంపద" అంటూ లేచేడు ప్రసాదు.

దశమినాటి చంద్రకాంతిలో నీలంగా కనిపిస్తోంది సముద్రం.

ఒడ్డుకి దూరంగా ఉన్న నీళ్ళలో, అలలు లేనిచోట చంద్రకాంతి నిశ్చలంగా ఉంది.

ప్రజలకి దూరంగా నీటిలో చంద్రుడు అందాలని ప్రదర్శిస్తున్నాడు. ఒడ్డున దగ్గరగా కొట్టుకువస్తున్న కెరటాలలో చంద్రకాంతి ఛిన్నాభిన్నమై విస్తరిల్లి ఒడ్డుకు ఢీకొంటోంది. తెల్లని నురగ కాస్సేపు కనిపించి, లోపలికి వెళ్తున్న కెరటంతోపాటు సముద్రం లోనికి నిష్క్రమిస్తోంది.

అలల తాకిడికి నీటిలో తునకలౌతున్న చంద్రుడు!

తరతరాలుగా, నిర్విరామంగా ఒడ్డుకు వస్తున్న అలలు. ఒకరిని మోసం చేద్దామని గాని, హాని కలిగిద్దామన్న ఊహగాని లేని సముద్రం, ఏమీ ఆశించని సముద్రం! అను

కుంటూ ప్రసాదు అందిచ్చిన చేతి సహా యంతో లేచి అతని వెనకాలే నడిచేడు సురేష్.

రామకృష్ణా మిషన్‌వరకు నడిచి, ఖాళీగా వస్తున్న ఆటో ఎక్కి ఇల్లు చేరేరు.

"డిసెంబర్ ఇరవైరెండుకి అమెరికా తిరిగి వెళ్ళడానికి రిజర్వేషన్ చేయించుకున్నాను" అన్నాడు సురేష్ పూరీని కూరలో ముంచుతూ.

"మీ నాన్న డైరీ ప్రభావంవలన ఈ దేశం వచ్చేవు. చాలా సంతోషం. స్నేహాలూ, బంధుత్వాలూ కలకాలం నిలవాలంటే, ఇలా రావడం, పలకరించుకోవడం అవసరం. లేక పోతే బంధుత్వం పరిచయంకింద మారి క్రమేణా మరుగున పడిపోతుంది" అన్నాడు మాధవరావ్.

"అన్నట్టు నీకు ఉత్తరం వచ్చింది. ఇందాక ఇవ్వడం మరచిపోయేను. టేబిల్ మీద ఉంది" అంది శారద, సురేష్ పళ్లెంలోనికి ఆవుపాల పెరుగుని వడ్డిస్తూ.

"ఎక్కడనుంచి ఆ ఉత్తరం?" అని ఆశ్చ ర్యపడుతూ పెరుగులో మీగడని అందుకు న్నాడు సురేష్.

"ఆవు పాల పెరుగు ఫెంటాస్టిక్" అంటూ వేళ్లని నాకి చేతులు కడుక్కుని హాలులోనికి వచ్చి ఉత్తరాన్ని అందుకు న్నాడు సురేష్.

పరిచయంలేని దస్తూరి! మరోసారి పరీ క్షగా రాసిన ఎడ్రసువేపు చూసి, కవరు చించి లోపలి ఉత్తరాన్ని విప్పేడు.

"సురేష్‌గారికి,

నమస్కారాలు.

మీరు ఇంకా విశాఖపట్నంలో ఉన్నారని తెలిసి మీకు రాస్తున్నాను. ఈ దేశం వదిలే లోగా ఒకసారి కాకినాడ రాగలరా? ఒక చిన్న సహాయం కావాలి.

వాహిని"

ఉత్తరాన్ని మడిచి కవరులో తిరిగి ఉంచేడు.

"ఉత్తరం ఎక్కడనుంచి?" అనడిగింది శారద వక్కపొడి డబ్బా సురేష్ చేతికి అందిస్తూ.

చిరునవ్వు నవ్వేడు సురేష్.

"చెప్పకూడనిదయితే చెప్పవద్దులే" అంది శారద.

"అమెరికాలో ఇలాంటి ప్రశ్నలు వేయరు. ఇక్కడ అలాంటి ప్రశ్నలు వేయడం అతిసా మాన్యం. చెప్పకూడనిదేమీ లేదు దీనిలో. సావిత్రత్త స్నేహితురాలు సంధ్య కూతురు వాహిని రాసింది. ఏదో చిన్న సహాయం కావాలిట. వీలుంటే నే అమెరికా తిరిగి వెళ్ళే ముందు, ఒకసారి నన్ను కాకినాడ రమ్మంది" అన్నాడు సురేష్.

మాధవరావు, శారదల కళ్ళు కలుసుకు న్నాయి.

అది గమనించి, "మీరేమీ ఊహించనక్క రలేదు. ఎందుకు రమ్మందో నాకు తెలి యదు కాని మీరు అనుకుంటున్నది మాత్రం కాదు. ఆ పిల్లని, నేను ఒక అర గంట మాత్రమే చూసేను" అని వివరిం చేడు సురేష్.

"ఆ పిల్ల ఎలా ఉంటుంది?"

"లేతమామిడి చిగుళ్ళ తళతళలాంటి అందంతో, చాలా ఉత్సాహంగా కబుర్లు చెబుతుంది. కాని ఆపిల్ల నాకు పరిచయ మైన వ్యక్తి, అంతే, అంతకు మించి ఇంకేమీ కాదు"

"నీ ఇష్టం బాబూ, ఏదో మంచి సాంప్ర దాయం ఉన్న పిల్ల, చురుకైన పిల్ల, తెలిసిన పిల్లకదా అని, అలాంటిదేమైనా ఉంటే మంచిదనిపించింది ఒక్కక్షణం. అయితే కాకినాడ ఎప్పుడు వెళ్తావు?"

"చూద్దాం" అన్నాడు సురేష్ పరధ్యా నంగా.

★ ★ ★

"ఒక స్ట్రాంగ్ కాఫీ"

"బాసుందీ వద్దా?" అనడిగేడు సర్వరు.

దశపల్లాకి తరచూ రావడంతో, చాలా మంది సర్వర్లకి, తనూ ప్రసాదుల "బాసుంది, కాఫీ" ఆర్డరు అలవాటయింది.

"సరే, పట్టుకురా"

ఏదో పనిమీద ప్రసాదు బయటకి వెళ్ళడంతో, సురేష్ ఒక్కడే ఇంటినుంచి బయట పడ్డాడు. ఉష్ణోగ్రత ఇరవైఐదు డిగ్రీలే అయినా, నవంబరు మాసం గాలి చల్లగా వీస్తోంది. మంచు కురవడానికి, ఎముకలు కొరికే చలికి అలవాటుపడ్డ సురేష్‌కి ఈ వాతావరణం చాలా హాయిగా అనిపించింది. సురేష్ బాసుందీ తిని కాఫీ తాగుతుంటే పక్కనే సర్వర్ నిలబడ్డాడు. సురేష్ కాఫీ కప్పుని కింద ఉంచి సర్వర్‌వేపు చూసేడు. బహుశా అతనికి ఇరవై ఏళ్ళు ఉంటాయోమో!

"సార్, మీరు ఏమీ అనుకోకపోతే నాదొక చిన్న మనవి" అన్నాడు అక్షరాలని స్వచ్ఛంగా ఉచ్చరిస్తూ.

"చెప్పు" అన్నాడు సురేష్ ఆశ్చర్యపడుతూ.

"జూనియర్ కాలేజీ పూర్తిచేసేక, పరిస్థితులవలన నా చదువు ఆగిపోయింది. ఇక్కడ ఉద్యోగానికి చేరి నాలుగు నెలలయింది. మీకు చాలా మంది పెద్దవాళ్ళు తెలిసిన వాళ్ళుంటారు. నామీద దయతలచి నన్ను ఏదైనా ఉద్యోగానికి రికమెండ్ చేయరూ? " అని ప్రాధేయపడ్డాడు సర్వర్.

"నాయనా, నాతో తరచూ వస్తుంటాడే, అతను ఎమ్.ఏ.పాసయి, గత మూడేళ్ళుగా ఉద్యోగప్రయత్నంలో ఉన్నాడు. నా గురించి నువ్వేదో ఊహించుకున్నావు. నీకు ఉద్యోగం వేయించగలిగే సామర్థ్యం నాకు లేదు. అయినా, ఈ ఉద్యోగంలో లోపమేమిటి? నీ అర్హతలకి సరిపడే ఉద్యోగమేమిటి? "

"ఇక్కడ జీతం ఫరవాలేదు. అదీకాక తిండి ఉచితం. కాని ఇదే జీతంతో, జీతం కాస్త తక్కువైనా ఫరవాలేదు కాని ఆఫీసులో ఉద్యోగం కావాలి"

"ఏమిటి ఆఫీసు ఉద్యోగంలో ఉన్న విశిష్టత? "

"గొప్ప గురించి కాదు. మా అక్కయ్యకి ఒక పెళ్ళి సంబంధం ఖాయమయేలా ఉంది. కాని వాళ్ళకి నేను హోటల్లో సర్వరుగా పనిచేయడం ఇష్టంలేదు. దానితో ఆమె పెళ్ళి ముడిపడి ఉంది. నా జీవితానికేమైనా, ఏదో మా అక్కయ్య జీవితమైనా సవ్యంగా నడుస్తుందని, మీతో ఎందుకో చెప్పి సహాయం ఆశ్రయించాలనిపించింది, అర్థించేను" అన్నాడు సర్వర్.

గుండెలు పిండేసినట్లయింది సురేష్‌కి. నోటంట మాట వెంటనే ఊడిపడలేదు. సర్వర్‌వేపు చూసే ధైర్యంలేక కళ్ళు మూసుకున్నాడు. మెల్లిగా కళ్ళు తెరచి,

"సారీ, నా చేతిలో ఉంటే తప్పకుండా చేసేవాడిని. దురదృష్టవశాత్తూ నాకు అలాంటి పరపతిలేదు" అంటూ కప్పులో మిగిలిన కాఫీని తాగి ఖాళీ కప్పుని కింద ఉంచేడు.

"క్షమించండి. నా రాత బాగుండకపోతే మీరేం చేయగలరు", అంటూ సురేష్ పర్సులోంచి తీసి ఇచ్చిన బిల్ డబ్బుని అందుకున్నాడు సర్వర్.

రాత! ఇదొకటి తెలుసు ప్రజలందరికీ! అనుకుంటూ బయటకి వచ్చిన సురేష్‌ని చల్లగాలి తాకింది. అరగంట క్రితం హాయిగా అనిపించిన వాతావరణం ఇపుడు ఇబ్బంది కలిగిస్తోంది సురేష్‌కి. ఒకరిజీవితం బాగుపడాలంటే ఇంకొకరి జీవితం నాశనమైపోవాలా? అక్కకోసం తమ్ముడు సర్వర్ ఉద్యోగం వదిలేస్తే, తరువాత ఉద్యోగం దొరకకపోతే ఏమౌతాడు? నక్సలైట్లతో కలిసిపోతాడా? ఇంకే మార్గంలేక ఇళ్ళను దోచే దొంగగా మారతాడా? కుటుంబం ఆకలితో అల్లల్లాడి పోతుంటే సర్వర్ ఉద్యోగం బదులు కూలీపనీ, అదీ లేకపోతే అడుక్కోవడమో జరిగితే, సర్వర్

పనినే న్యూనతగా భావించిన వ్యక్తికి అది తెలిస్తే, భార్యని రాచి రంపాన పెట్టడని, నిరశించడని నమ్మకం ఏమిటి? ఒక రోజు ప్రొద్దున్నే ఆమెని పుట్టింటి దగ్గర వది లేస్తే?

అసహ్యంతో ఒళ్ళు కంపరమెత్తింది సురేష్‌కి.

ప్రసాదు చెప్పినట్లు ఇలాంటి కథలెన్నో!

అర్హత, అవకాశంబట్టి పని అని, ఏ పనీ హీనమైనది కాదని సమాజం ఎప్పుడు గ్రహిస్తుంది? వేల సంవత్సరాలక్రితం పనులబట్టి జరిగిన మనుష్యుల విభజనకి కాలదోషం ఎప్పుడు పడుతుంది? సినిమాలో సర్వర్ పనిచేస్తూ, సమాజంలో చాలా ఎత్తున ఉన్న హీరోయిన్‌ని, ప్రయత్నించి, అందుకున్నపుడు చప్పట్లు కొట్టిన ప్రజ, అది నిజజీవితంలో ఎదురుపడితే మొహం ఎందుకు చాటేస్తుంది? అనుకుంటూ, మధనపడుతూ నడవసాగేడు సురేష్.

బ్యాంకుకి వెళ్ళి డాలర్లని రూపాయలలోనికి మార్చడానికి తను బయలుదేరిన సంగతి జ్ఞాపకానికి వచ్చి ఎదురుగా కనిపించిన బ్యాంకులో జొరపడ్డాడు.

ఏభై అడుగుల పొడవు, ఏభై అడుగుల వెడల్పుగల చతురస్రంలో, ఆరడుగుల వెడల్పు, నలభై అడుగుల పొడవు జాగా తప్పిస్తే, మిగతా ప్రదేశంలో సుమారు పాతిక మంది బ్యాంకు సిబ్బంది కుర్చీలలో కూర్చుని పనిచేస్తున్నారు. ఒకే ఒక కేష్ కౌంటర్ తెరచి ఉంది. దానిలో కూర్చున్న కేషియర్, ఖాతాదార్లు జమచేసిన డబ్బుని అందుకోవడమే కాకుండా, చెక్‌లకి డబ్బు ఇస్తున్నాడు. కౌంటర్ చుట్టూ బయట జనం, సినిమా విడుదలయిన మొదటిరోజు రూపాయ టిక్కట్లకోసం ఎగబడే జనంలా, ఒకర్ని ఒకరు తోసుకుంటున్నారు. చెక్‌కి డబ్బు ఇవ్వడానికి, చెక్‌కి ఇచ్చిన టోకెన్ నెంబరుని పిలిచి డబ్బు ఇస్తున్నాడు కేషియర్. కేషియర్ గొంతు ఆ కౌంటర్ దగ్గర నిలుచుని అరుచుకుంటున్న ఖాతాదారుల శబ్దంలో మునిగిపోతోంది. ఏదైనా వినిపించినా, పద్మవ్యూహంలోనికి జొరపడే అభిమన్యుని అవస్థలా ఉంది ఆ వ్యక్తి పరిస్థితి. ఆ వ్యక్తి బలంగా లోపలికి ప్రవేశించ ప్రయత్నిస్తుంటే తమ చెక్‌కి పిలుపు వెంటనే వస్తుందని తమ స్థానాలని వదలకుండా, మిగతా జనాభా అటకాయిస్తున్నారు.

కౌంటర్ దగ్గర గుంపు మూగేకంటే దూరంగా అందరూ నిరీక్షిస్తే అందరికీ సౌకర్యమే! కాని ప్రజ ఎందుకు చేయడంలేదు?

ఆ ప్రశ్నకి సమాధానం వెంటనే స్ఫురించింది సురేష్‌కి.

ప్రజలు కూర్చోవడానికి సరిపడే కుర్చీలుగాని, సోఫాలుగాని లేవు. వరసా, వావీ లేకుండా పక్క దారంబట పనులు చేయించుకుంటున్నవాళ్ళని, బ్యాంకులో పని చేసే సిబ్బందికి తెలిసిన వ్యక్తుల పనులు అవుతుంటే ఏమీ చేయలేక, ఎంత త్వరగా తమ పని అయితే అంత త్వరగా బయట పడదామని కౌంటర్ దగ్గరే పడికాపులు కాస్తున్నారు కాతాదార్లు!

బ్యాంకు సిబ్బందిని చూస్తుంటే ఒళ్ళు మండింది సురేష్‌కి. పరీక్షగా సిబ్బందిని పరీక్షించేడు.

"అప్పన్నా, నాల్గవ నెంబరు లెడ్జరు తీసుకురా! ఎన్నిసార్లు చెప్పేను లెడ్జర్లని ఇక్కడ నుంచి కదపవద్దని"

"ఈ సంతకం టేలీ అవడంలేదు, మేనేజర్‌ని చూడమనండి"

"మాకున్నవి రెండే చేతులండీ, అంతగా తొందరైతే మేనేజరుని సంప్రదించండి" అంటూ వెటకారంగా మాటలాడుతున్నారు బ్యాంకు సిబ్బంది.

"బ్యాంకుకి అతి ముఖ్యమైన వ్యక్తి కాతా దారుడు" అన్న పెద్ద బోర్డు వేపు చూస్తూ,

"ఫారిన్ ఎక్స్ఛేంజ్" అన్న కౌంటర్ దగ్గర ఆగి,

"రెండు వందల డాలర్లని రూపాయలలోనికి మార్చాలి, ఏం చేయాలి? " అనడిగేడు.

కౌంటర్‌లో కూర్చుని వేళ్ళగోళ్ళు సరిగ్గా ఉన్నాయో, లేదో అని చూసుకుంటున్న ఒక ముద్దబంతి సర్దుకుని, "పాస్‌పోర్ట్? " అంది.

పాస్‌పోర్ట్ అందిచ్చేడు సురేష్.

"ఈ బ్యాంకులో మీకు ఎకౌంట్ ఉందా? " అనడిగింది.

"లేదు"

"మరి ఎలా? "

"ఎకౌంట్ ఎందుకు, నిర్ధారణకే గదా? పాస్‌పోర్ట్‌కంటే ముఖ్యమైన ఐడెంటిఫికేషన్ ఏముంటుంది? "

"అది సరే అనుకోండి. కాని ఈమధ్య డాలర్ల దొంగ నోట్లు తెగ చెలామణీలో ఉన్నాయి. మీరేమీ అనుకోకపోతే, మా మేనేజర్‌ని సంప్రదించండి" అంటూ మేనేజర్ కూచున్న గదివేపు చూపించి, తన వేళ్ళమీదకి దృష్టిని కేంద్రీకరించింది ఆ సన్నజాజి.

మేనేజర్ గదిలో అతనికి ఎదురుగా అతిథులకి ఉన్న మూడు కుర్చీలలో ఎవరో కూర్చుని ఉన్నారు. సురేష్ తలుపు తోసుకుని లోపలికి ప్రవేశించబోతుంటే,

"మీరు కాస్సేపు బయట నిరీక్షించండి... మిమ్మల్ని పిలుస్తాను" అన్నాడు మేనేజరు.

ఒక గంట గడిచేక, బ్యాంకులోంచి బయటపడి ఖాళీ ఆటోలో సర్దుకుంటూ, "ఎల్లమ్మాతోట జంక్షన్" అన్నాడు సురేష్. ఆటో వేగం పుంజుకుంది.

ఇక్కడ బ్యాంకులకి, అమెరికాలో బ్యాంకులకి ఎంత తేడా!

అక్కడ పెద్దపెద్ద బ్యాంకులలో కూడా మహా అయితే పది పదిహేనుగురు కంటే సిబ్బంది ఉండరు. కాని ఉన్న సిబ్బంది అవలీలమైన పని చేస్తారు. తనకి ఆశ్చర్యం వేసింది ఒకసారి. కారు కొనుక్కోవడానికి, పది హేనువేల డాలర్ల అప్పుకి బ్యాంకుకి వెళ్లేడు. పదిహేను నిముషాలలో చేతికి చెక్ అందిచ్చింది కౌంటర్‌లో ఉన్న సుగంధి. బ్యాంకులలో చెక్ మార్చుకోవడానికి మహా అయితే ఒక నిమిషంపడుతుంది. చెక్కులకి డబ్బు ఇవ్వడం, ఖాతాదార్లు ఇచ్చిన డబ్బు జమచేసుకోవడం, డ్రాఫ్టులు ఇవ్వడం, అప్పు అప్లికేషన్లు చూడడం, ఒకటేమిటి? అన్ని పనులు ఒకే వ్యక్తి చేస్తారక్కడ. మరి ఇక్కడ?

"ఈ వేళ ఇద్దరు గుమస్తాలు సెలవులో ఉన్నారు, ఆలస్యమవుతుంది" అని మేనేజరు ఆలస్యానికి కారణం చెబితే తను నిశ్చేష్టుడయేడు.

ఒకరు పనికిరాకపోతే పని ఆగిపోదు అమెరికాలో. ఏ వ్యక్తి గురించీ ఆ వ్యక్తి ఎంత ప్రాముఖ్యత ఉన్న వ్యక్తి అయినా పని ఆగదు. పని చేయడానికి వేలు, లక్షలు తయారుగా ఉన్న ఈ దేశంలో, మనుష్యులు లేక పని ఆగిపోవడం!

ఎంత విచిత్రం!

మనిషి కాలానికి విలువలేదు. తమల్ని తాము బాగుచేసుకుందామన్న సామూహిక ఉత్సాహంలేదు! నా పని అయింది, ఇతరుల సంగతి నాకెందుకు? అన్న ధోరణి ప్రతీ చోటా ప్రబలి ఉంది.

ఈ రకపు బ్యాంకింగ్ సాంప్రదాయం ఎప్పుడు మారుతుంది?

పనిని సులభంగా త్వరితంగా చేసే కంప్యూటర్లని ప్రవేశపెట్టాలి, కాని ఎలా?

పనిచేయకుండా జీతం అందుకునే ఉద్యోగాలు పోవాలి, కాని ఎలా?

సాంప్రదాయం, నిన్నటి పద్ధతులు అపనమ్మకాలతో కూరుకున్న ప్రజ ఊబిలోంచి లేవనంటుంటే ఇదెలా సాధ్యం?

"ఎలా ఉంది బ్యాంకు? " అనడిగేడు ప్రసాదు, సురేష్ దిగాలుగా లోపలికి వస్తుంటే.

"ఏం చెప్పను? విచిత్రంగా ఉంది" అన్నాడు సురేష్.

"ఇప్పుడైనా అర్థమైందా ఈ దేశంలో స్తబ్ద

తకి కారణం. ప్రతీదానికీ పోరాటమే. పోరాడితేగాని ఏమీ జరగదు. దెబ్బలాడుతూ దెబ్బలాడుతూ నీరసపడిపోతాం. ఈ జీవిత సరళి చూసేక నీకు ఈ దేశంలో ప్రజలు ఎందుకు తొందరగా 'హరీ' అంటారో అర్థమై ఉంటుంది" అంటూ చేతితో సురేష్ భుజంమీద తట్టేడు ప్రసాదు.

పేలవంగా నవ్వేడు.

అడ్డదిడ్డంగా నడుస్తున్న బ్యాంకు తీరు చూసి, దానిని సరిచేసే మార్గాన్ని బ్యాంకు మేనేజరుకి సూచిస్తే, "మీ పద్ధతులు మాకు నచ్చవండీ, అవి ఇక్కడ పనిచేయవు. మీకు కొత్త. అందుకే అలా అనిపిస్తుంది. కొన్నాళ్ళు ఇక్కడ ఉంటేమీరు ఈ వాతావరణానికి అలవాటుపడతారు. మీరు అమెరికా తిరిగి ఎప్పుడు వెళ్తారు? మా బావమరిది అమెరికాలో ఎమ్.ఎస్. చేయడానికి ప్రయత్నాలు చేస్తున్నాడు" అని సంభాషణని ఇంకో దిశలో మరల్చేడని చెప్పాలని ఉంది సురేష్‌కి.

కాని అది విని ప్రసాదు పగలపడి నవ్వుతాడని ఆ ప్రయత్నం విరమించేడు.

"రేపు కాకినాడ వెళ్తున్నాను, వస్తావా?" అనడిగేడు సురేష్.

"లేదు, ఈ మారు నువ్వు ఒక్కడివే వెళ్ళిరా" అన్నాడు ప్రసాదు.



"సింహాద్రిలోనే వెళ్ళిపోవాల్సింది. ఈ



దిక్కుమాలిన బండి ఎప్పటికి తగలడుతుందో" అన్నాడు ప్రసాదు కాళ్ళు పట్టుకుంటూ. సురేష్ ఏమీ సమాధానమివ్వకపోవడం చూసి,

"ఏడు గంటలకి స్టేషనుకి వచ్చేం. ఏడున్నరకి రైలు వస్తుందన్నాడు, ఎనిమిదయింది. సింహాద్రి ఎక్స్‌ప్రెస్‌కంటే తక్కువ చోట్లలో ఆగుతుంది, సామర్లకోట దానికంటే ఇదే ముందర వెళ్తుందన్న నమ్మకంతో దానిని వదులుకున్నాం. ఇప్పుడు తొమ్మిదిన్నరయింది. ఈ రైలు ఎప్పటికి దర్శనమిస్తుందో! అనుకుంటూ మధనపడసాగేడు ప్రసాదు.

సురేష్, ప్రసాదులు ప్లాట్‌ఫారంమీద బండికోసం నిరీక్షిస్తుంటే, రైళ్ళు ప్లాట్‌ఫారం మీద ఆగి కాస్సేపయేక కదిలి వెళ్తున్నాయి. తిరునాళ్ళకి తరలివెళ్ళే ప్రజలా, రైలు దిగి, ఆటో స్టేండ్‌వేపు పరిగెడుతున్నారు.

"ప్లాట్‌ఫారంమీద బండి నిలిచి ఉన్నపుడు మరుగుదొడ్లని వాడకండి" అని ప్రతీ రైలు పెట్టెలో రాసి ఉన్నా, దానిని పట్టించుకోకపోవడంతో, రైలుపట్టాలమీద గలీజుగా ఉంది. ఈగలు వాటిమీద వాలి గెంతుకుంటూ కాస్సేపయేక, కొన్ని ప్లాట్‌ఫారం మీద నిలుచున్న ప్రజలమీద వాలుతున్నాయి. కొన్ని కాఫీ, ఫలహార దుకాణంలోనికి ప్రవేశించి, సామానులమీద, పదార్థాల మీద ముసురుకుంటున్నాయి. సురేష్ వాటిని పారద్రోలడానికి చేతిలో ఉన్న పేపరుతో అవస్థపడుతుంటే,

"ఉండు, మరోసారి స్టేషన్ మాస్టర్‌ని అడిగివస్తాను" అంటూ రైల్వేబ్రిడ్జ్ మెట్లు రెండేసి ఎక్కుతూ ఒకటవ నంబర్ మీదున్న స్టేషన్‌మాస్టర్ గదివేపు చిరాకుపడుతూ వెళ్ళేడు ప్రసాదు.

"విజయనగరం వదిలి అరగంటయిందిట. అంటే మరొక ముప్ఫయి నిమిషాలలో బండి వస్తుంది" అంటూ శుభవార్త తీసుకువచ్చేడు.

"రైళ్ళు ఇంత ఆలస్యమేమిటి? ఎక్కడైనా

వరదలా? "

"భలేవాడివే. రైళ్ళు ఎందుకు ఆలస్యంగా నడుస్తున్నాయి? అని అడగడానికి నువ్వు మినిష్టరువా? లేకపోతే ఎవరూ పట్టించుకోడు. రైళ్ళు నడుస్తున్నాయి, అందుకు సంతోషించు. ప్రభుత్వం, నక్సలైట్లు దెబ్బలాడుకున్నారనుకో. ఒక నక్సలైటు చనిపోయేడని, వాళ్ళు అదను చూసి రైలుపెట్టెలని మొత్తం మనుష్యులతోసహా తగల పెట్టేస్తారు. మావాడిని చంపినందుకు అది ప్రతీకారం అంటూ ప్రకటన వెలువడుతుంది. రెండు రోజులక్రితం కటక్‌లో ఒక స్టూడెంట్ నాయకుడిని రైల్వే యూనియన్ క్లబ్‌లో తన్నేరుట. కుర్రాళ్ళు గుంపుగా వెళ్ళి ఆ క్లబ్‌ని ధ్వంసం చేసేరు. రైల్వే సిబ్బంది "ఆ కుర్రాళ్ళని శిక్షిస్తేగాని పనిలోనికి రాం" పొమ్మన్నారు అందుకే ఈ రైలు ఆలస్యంగా నడుస్తోంది" అని రైళ్ళ ఆలస్యానికి కారణాన్ని వివరించేడు ప్రసాదు.

"ఆ స్టూడెంట్‌ని ఎందుకు తన్నాల్సివచ్చింది? "

"మరేమీ పెద్ద గొడవేమీ కాదు. ఆ కుర్రాడు తాగిన మైకంలో, ఒక రైల్వే ఉద్యోగి భార్య చెయ్యి పట్టుకుని లాగేడుట"

"భార్య చెయ్యిపట్టుకుని ఆగడం చేస్తే తన్నడంలో తప్పేముంది? "

"అబ్బ అన్నయ్య, నీతో పెద్దచిక్కే. ప్రతీ దానికీ లాజిక్ వాడతావు. ఇక్కడ లాజిక్‌కి తావులేదు. కే.జి. హెచ్ రోడ్డు దిగి కిందకి జగదాంబా థియేటర్‌వేపు వచ్చినపుడు జంక్షన్‌లో అచ్చోసిన ఆంబోతులని చూసేవా? వాటిని ఎవరూ ఏమీ చేయలేరు. ఇదీ అంతే. నువ్వు కాకినాడ చేరేసరికి ఒంటి గంటవుతుంది. తిరిగి ఎప్పుడు వస్తావు? "

"మహా అయితే రెండు రోజులు"

"నువ్వు ఆలస్యం చెయ్యకు. దీపావళికి మనం విజయనగరం వెళ్దాం"

శబ్దం చేసుకుంటూ రైలు ప్లాట్‌ఫారంమీదకి వచ్చి ఆగింది.

"నా కాళ్ళు నొప్పిపుడుతున్నాయి. నేవెళ్తాను. జాగ్రత్త" అని సురేష్‌ని రైలెక్కించి, జనసముద్రంలో కలిసిపోయేడు ప్రసాదు.

సీటులో సర్దుకుని మేగజైన్ విప్పేడు సురేష్. పది నిమిషాలలో రైలు కదిలి వేగం పుంజుకోసాగింది. రైలు పట్టాలకి దగ్గరగా ఉన్న జాగాలో పద్ధతిలేకుండా కుక్కగొడుగులలా వేసున్న చిన్నచిన్న గుడిసెలు, ఇళ్ళ చుట్టూ పరిశుభ్రతలేని చెత్తకుప్పలు, దూరంగా చెట్లని నరికి భూమిని చదునుచేస్తున్న ట్రాక్టర్లు. ఆరేడు అంతస్థుల ఫ్లేట్లకి దగ్గరగా లేవబోతున్న మరి కొన్ని ఫ్లేట్లు. ఈ లెఖ్ఖన, ఈ ప్రదేశంలో మరొక పదేళ్ళలో ఒక్క చెట్టు కూడా ఉండదు. చెట్లు లేకపోతే వానలు పడవు, మిగిలిన చెట్లు కూడా తేమలేక చచ్చిపోతాయి. దీని గురించి ఎవరైనా తీక్షణంగా ఆలోచిస్తున్నారా? అక్షరాస్యత పెరుగుతోందేకాని చదువు పెరుగుతోందా? అనుకున్నాడు సురేష్.

రెండు గంటలున్నర ప్లాట్‌ఫారంమీద పచార్లు చేసేక, సౌకర్యంగా ఉన్న సీటులోనికి వస్తున్నచల్లని గాలి తగలగానే, సురేష్ కళ్లు మూతలుపడ్డాయి.

కళ్ళు తెరిచేటప్పటికి రైలు హుషారుగా పొలాలలోంచి పరిగెడ్తోంది.

కోతకి తయారుగా ఉన్న వరి పంట, గోధుమరంగు వర్ణానికివచ్చింది. గాలి వీచగానే, గింజల్ని మోస్తున్న బరువైన వరి మొక్క అటూ ఇటూ ఊగుతోంది. చిక్కంలో రాళ్ళని ఉంచి విసురుతూ, పక్షులని భయపెడుతుంటే, అవి ఒకచోటనుంచి ఎగిరి, ఇంకోచోట వాలి, ధాన్యపుగింజల్ని తింటున్నాయి. పొలాలలో అట్టే జనసంచారంలేదు.

రైలుపట్టాలు పక్కన ఉన్న దుమ్ముని లేపుతూ, సింహాద్రి ఎక్స్‌ప్రెస్ కంటే

వేగంగా పరిగెడుతూ, ఒకే ఒక నిమిషం తునిలో ఆగి, తిరిగి బయలుదేరింది.

పెట్టెలోంచి కిందకి దిగిన సురేష్‌కి తమ లపాకులు కాని, కిళ్లీలు కాని కనిపించలేదు. పెట్టెలోనికి తిరిగి ఎక్కి, ఆలోచనలోపడ్డాడు సురేష్.

ఇంత పెద్దదేశంలో, తొమ్మిది వందల ఏభై మిలియన్లున్న ఈ దేశంలో ఎంత మంది ఉపయోగంగా పనిచేస్తున్నారు? కాలానికి విలువ లేకుండా ఎంత వృథా అవుతోంది?

ఒక సోమవారం, అమెరికాలో తను ఫొటో ఫిల్మ్ డెవలప్ చేయడానికి ఇచ్చేడు. దుకాణదారు, శుక్రహారానికి తయారవుతాయని చెప్పేడు. శుక్రవారం వెళ్తే, "సారీ తయారుగా లేవు" అన్నాడు. మర్నాడు వెళ్ళి, ప్రింట్స్ అందుకుని, డబ్బు ఇవ్వబోతే, "నేను అన్నట్లు మీకు ప్రింట్లని సమయానికి ఇవ్వలేదు. దాని గురించి మీరు రెండవ సారి రావాల్సివచ్చింది. మీ సమయం వృథా అయింది. డబ్బు ఇవ్వనక్ఖరలేదు" అన్నాడు

ఆశ్చర్యంవేసింది!

మరి ఇక్కడ ఈ భారతదేశంలో

**దాదాపు** మూడు గంటలు కొన్ని వందల మంది ఆ రైల్వే ప్లేట్‌ఫారంమీద పడికాపులుకాసి కాలాన్ని వృథా చేసుకున్నారు. ఆ కాలానికి విలువ ఎంత?

సున్నా!

ఇదీ ఆశ్చర్యమే!

★ ★ ★

"ఏమైంది ఆంటీ? " అనడిగాడు సురేష్, పరుపు దగ్గరగా ఉన్న కుర్చీలో కూర్చుంటూ.

"వారం రోజులుగా ఫ్లూ, దూరంగా కుర్చీ వేసుకో. లేకపోతే నీకూ అంటుకుంటుంది" అని హెచ్చరించింది సంధ్య.

"మరేమీ ఫరవాలేదు, నాకేమీ అంటుకోదు" అన్నాడు సురేష్.

సన్నగా నవ్వింది సంధ్య.

"ఎందుకు నవ్వారు? "

"ఒకసారి, చాలా చాలా సంవత్సరాల క్రితం మీ డేడీ ఇంజనీరింగ్ చదివే రోజుల్లో నేనూ, రమేష్, మీ డేడీ తరచూ కలుసుకునేవాళ్ళం. ఒకసారి నాకు చికెన్‌పాక్స్ వచ్చింది. అది అంటువ్యాధి. వద్దన్నా మీ డేడీ రెండు మూడుసార్లు నేను ఎలా ఉన్నానోనని చూడడానికి వచ్చాడు. మా నాన్న గారు కోప్పడ్డారు, అంటుకుంటుందని. ఇప్పుడు నువ్వు అన్నట్టే మీ డేడీ "మరేమీ ఫరవాలేదు, నాకేమీ అంటుకోదు" అన్నారు. అది జ్ఞాపకానికి వచ్చింది" అంది ఆయాసపడుతూ.

చిందరవందరగా తైలసంస్కారం లేని చెదరిన జుత్తు, లోతుకుపోయిన కళ్లు, చర్మం మాత్రమే మిగిలిన చెక్కిళ్లు, ఎండిపోయిన పెదవులు, ఉబ్బిన నరాలు కనిపిస్తున్న మెడ, నలిగిన దుప్పటిమీద పాలిపోయి ఉన్న సంధ్యని చూస్తే రవ్వంత భయంవేసింది.

"చాలా నీరసంగా ఉన్నారు. డాక్టరు వచ్చి చూశాడా? వాహిని ఏదీ? మీకు తోడుగా ఎవరూ లేరా? " అంటూ సురేష్ ప్రశ్నల వర్షం కురిపించడం చూసి, సంధ్య మొహంలో చిరునవ్వు తిరిగి చోటుచేసుకుంది.

"డాక్టరు వచ్చి చూశాడు. వాహిని పనికి వెళ్ళింది. తిరిగి సాయంకాలానికి కాని రాదు. వాహిని రాసిన ఉత్తరం అంది, వాహినిని కలవడానికి వచ్చి ఉంటావు. తిరిగి సాయంకాలం రాగలవా? "

"నేను ఇప్పుడు బయటకి వెళ్ళి ఒక గంటలో తిరిగివస్తాను. వాహిని వచ్చేంతవరకు ఉండి వెళ్తాను" అంటూ లేచి నిలబడ్డాడు.

"నీ ఇష్టం" అంటూ కళ్లు మూసుకుంది.

వడివడిగా బయటకి నడిచేడు సురేష్.

సురేష్‌కి చెప్పిన సంఘటన తిరిగి జ్ఞాపకానికి వచ్చింది సంధ్యకి.

అంటువ్యాధి రావద్దంటే, రమేష్ పూర్తిగా తగ్గేంతవరకూ రాలేదు.

వద్దన్నా ఆ పదిరోజులలో తనకి ఎలా ఉందో అని వాకబు చేయడానికి రెండు సార్లు వచ్చాడు సుబ్బారావు. వ్యాధి తగ్గి, తనకి స్నానం అయ్యాక తనని చూడడానికి వచ్చిన సుబ్బారావు కళ్ళు, తన శరీరం అంతా పృచ్ఛించి చూశాయి. వ్యాధి తీవ్రంగా రాలేదని, ఒంటిమీద మచ్చలని వదలలేదని గ్రహించిన అతని మొహంలో ఆనందం కనిపించింది.

అలా ప్రేమించిన సుబ్బారావు, ఢిల్లీ వెళ్ళాక ఎందుకు మౌనం వహించేడు? అతను కనిపించినప్పుడు అడగాలనిపించింది చాలాసార్లు. కాని వెనుకంజ వేసింది ప్రతీసారీ!

★ ★ ★

"అరె, మీరు ఎప్పుడు వచ్చారు?" అంటూ లోపలికి వచ్చింది వాహిని, తల్లిపక్కని కుర్చీలో కూర్చున్న సురేష్‌ని చూసి.

"మధ్యాహ్నం మూడు గంటలకివచ్చాను"

"ఈమె పేరు సరళ, నా స్నేహితురాలు" అంటూ తనతో ఉన్న ఇరవైఅయిదు-ఇరవైఆరేళ్ళ స్త్రీని పరిచయం చేసింది.

"కాఫీ చేస్తాను" అంటూ వాహిని కదలబోతుంటే,

"నీకు తెలుసుగా నా ఇబ్బంది, త్వరగా మాటలాడి వెళ్తాను. కాఫీ ఏమీ వద్దు" అంది సరళ.

"నేను మిమ్మల్ని ఈ ఊరు రమ్మనడానికి కారణం ఈ సరళే. ఆమెకి మీరేమైనా సహాయం చేయగలరేమో చూడండి. చెప్పు సరళా" అంది వాహిని.

"నేను హైదరాబాదులో ఇంజనీరింగ్ డిగ్రీ పుచ్చుకుని నాలుగేళ్ళయింది. డిగ్రీ పుచ్చుకున్నాక, ఒక ప్రైవేట్ కంపెనీలో పని చేసేదానిని. అప్పుడే నాకు పెళ్ళయింది. ఒక సంవత్సరం క్రితం నా భర్తకి బదిలీ అవడంతో ఆ ఉద్యోగానికి రాజీనామా ఇచ్చి ఇక్కడకి వచ్చాను. నేను హైదరాబాదులో ఉండగా టోఫెల్, జి.ఆర్.ఇ. పరీక్షలు రాశాను, మంచి స్కోర్లే వచ్చాయి. ఇక్కడకి వచ్చాక పరిస్థితులు మరీ క్షీణించాయి. వాహిని మీ గురించి చెప్పింది. అమెరికా వెళ్ళడానికి మీ సహాయం కావాలి. ఎలాగైనా నన్ను ఇక్కడనుంచి బయటపడేలా చూడరూ?" అంటూ కళ్ళనీళ్ళు నింపుకుంటూ అర్థించింది సరళ.

తనకేమీ అర్థమవలేదన్నట్టు వాహినివేపు చూశాడు సురేష్.

"సరళ భర్తకి సరళ బైటికి వెళ్ళి పనిచేయడం ఇష్టంలేదు. ట్రాన్స్‌ఫర్ కావాలనే చేయించుకున్నాడో, లేక దానంతట అదే వచ్చిందో ఖచ్చితంగా తెలియదు. కాని అతను ఏమీ ప్రతిఘటించకుండా, ఈ ఊరు వచ్చి చేరాడు. సరళకి ఇక వేరే గత్యంతరం లేక రాజీనామా చేయాల్సివచ్చింది" అని వివరించింది వాహిని.

"నాకు అమెరికా వెళ్ళే ఉద్దేశం ఉందని అతనికి తెలియదు. అతనికి ఇష్టంలేదు. ఈ విషయం తెలిస్తే నేను చిక్కులలో పడతాను. కాని ఏం చేయను?" అంది సరళ ముక్కు ఎగపీలుస్తూ.

"రెండు సంవత్సరాలు దాటితే జి.ఆర్.ఇ. స్కోర్లు పనిచేయవు. తిరిగి తీసుకోవల్సిందే. మీ జి.ఆర్.ఇ. స్కోరు, మీరు గతంలో పని చేసిన ప్రోజెక్టుల గుణగణాల బట్టి మీకు సీటు, ఆర్థిక సహాయం రావడం ఆధారపడి ఉంటుంది. నానుంచి మీకు ఏ సహాయం కావాలో చెప్పండి" అన్నాడు సురేష్.

"నా పరీక్షల స్కోర్ల వివరాలు మీకు అందచేస్తాను. ఐదారు యూనివర్సిటీలకి ఫోన్ చేసి నాకు అప్లికేషన్లు పంపించే ఏర్పాటు చేయగలరా? అప్లికేషన్లు వాహిని ఎడ్రసుకి పంపమనండి. ప్లీజ్, మీ గురించి

వాహిని చాలా చెప్పింది" అంది దుఃఖం నుంచి తేరుకున్న సరళ.

"అమెరికా వెళ్ళడం అంత సులభం కాదు. సీటు వస్తుందిగానీ ఆర్థిక సహాయం, వీసా సంగతి ఏమీ చెప్పలేం"

"నా దగ్గర కొంత డబ్బు ఉంది, నేను అమెరికా ఎందుకు వెళ్ళాలనుకుంటున్నానని మా వాళ్ళకి విశదపరిస్తే వాళ్లు సహాయం చేస్తారు"

"మీరు సరిఅయిన నిర్ణయం తీసుకుంటు న్నారా? ఆలోచించండి"

కళ్లు మూసుకుని సరళ ఆలోచనలో పడింది. ఒక నిమిషం గడిచేక కళ్లు తెరచి, చేతిమీదున్న పైట చెంగుని తప్పించి సురే ష్‌కి కనపడేటట్టు తన ఎడమచేతిని జాపింది. ఒక సెంటీమీటర్ మేర, గోరిం టాకు రంగులో, కమిలిన చంద్రాకారం భాగం, దాని చుట్టూ ఉన్న ఎర్రదనం చూసి కళ్లు మూసుకున్నాడు సురేష్.

"వాహినిని మీకు వివరాలు చెప్పమ న్నాను. ఆలస్యమవుతోంది. వీలుంటే రేపు కలుస్తాను" అంటూ సురేష్ మొహం వేపు చూడకుండా లేచివెళ్ళింది సరళ.

"అతని పేరు జగపతి. బాగా ధనవం తులు. అతన్ని వదిలి, ఇక్కడ బతకడంలో తెగ ఇబ్బందులు ఉన్నాయి. కాని అమెరికా పారిపోతే ఏ బాధా ఉండదు"

"పోలీస్ రక్షణ ఎందుకు అడుగకూ డదు? "

"ఇది అమెరికా కాదు. అతను డాక్టరు. డబ్బూ, పరపతి ఉన్నవాడు. ఎవరికైనా డబ్బు ఇచ్చి ఆమె మొహంమీద ఏసిడ్ పోయించగల సమర్థుడు. గుండాలని ఉసి గొల్పి ఆమె బతుకుని దుర్భరం చేయించే అవకాశం ఉంది. డబ్బుతో పోలీసులని కొనడం చాలా సులభం ఈ దేశంలో. అన్ని టికన్నా మించిన భయం మరొకటి ఉంది, డాక్టరుగా అతనికి అన్నిమందులు అందుబా టులో ఉంటాయి. సులభంగా చంపేయగ లడు కూడా. భారతీయ రాజ్యాంగం, భార్యని బలవంతంగానైనా అనుభవించే హక్కుని భర్తలకి ప్రసాదించింది. ప్రతీ రాత్రీ యమయాతనే సరళకి"

"మీ ఇంటి ఎడ్రసు, ఆమె గురించి అన్ని వివరాలు ఒకచోట చేర్చి ఉంచు. నేను రేపు వచ్చి తీసుకుంటాను"

"అలాగే"

"వాహినీ, నీ పెళ్ళి మాటేమిటి? "

"ఇలాంటి వ్యవహారాలు చూస్తుంటే పెళ్ళంటే అసహ్యం వేస్తోంది"

"ప్రపంచంలో అన్నిరకాల మనుష్యులు ఉంటారు. అందరు మొగవాళ్లు జగపతులు కారు. అలాంటి వ్యక్తుల్ని కొలత బద్దగా వాడి జీవితం అంతా విషాదం అనుకోకు. ఆదర్శదాంపత్యం అంటే ఏమిటో నాకు తెలి యదు. ఏ ఇద్దరు వ్యక్తులూ ఒకలా ఆలో చించరు కాబట్టి, వాదనలు లేకుండా కాపు రాలు సాగవు. మా అత్త, మామయ్య, పిన్ని చిన్నాన్నలు హాయిగానే ఉన్నట్టు అనిపి స్తోంది నాకు. రేపు సాయంకాలం వస్తాను. ఆంటీతో చెప్పివెళ్తాను" అంటూ సంధ్యపడు కున్న గదిలోనికి వెళ్లాడు.

సంధ్యతో మర్నాడు వస్తానని చెప్పి, తలుపు తీసుకుని రోడ్డుమీదకి వచ్చాడు సురేష్.

సాయంకాలం ఏడయినా, రాత్రి పదిగంట లయినట్లుంది. నడుస్తున్న సురేష్‌తోపాటు ఒక దోమలగుంపు పరిగెత్తి, అలసిపోయి ఆగాయి. టెలివిజన్‌లో ఏదో సీరియల్ నడుస్తోంది కాబోలు, పెద్దగా అరుపులు వినిపిస్తున్నాయి. ఆటోలు ఎక్కడా కానరాక, నిర్మానుష్యంగా ఉన్న రోడ్డుమీద నడుస్తూ ఆలోచనలో పడ్డాడు సురేష్.

ప్రతీ చిన్న బేదాభిప్రాయానికి తగువు పెంచుకుని తమ స్వతంత్రానికి అడ్డుతగిలిం దని, పొగరుతో కొందరు విడాకులు పుచ్చు కుంటారు. భార్యాభర్తల మధ్య అయినా

ఇష్టంలేని రతిని చెరచడం అంటుంది అక్కడ చట్టం.

ఈ దేశంలో చట్టం దానికి విరుద్ధం, ఎన్నో బలీయమైన కారణాలు చూపిస్తేగాని, విడాకులని ప్రసాదించదు.

"నాకిష్టం లేదు ఈ వ్యక్తి" అని కోర్టుకి వెళ్తే, ఏ వ్యక్తికయినా విడాకులు లభిస్తాయి అక్కడ. అక్కడ జీవన స్రవంతికి ఇక్కడ జీవనసరళికి ఎంత తేడా?

అక్కడ విడాకులు తీసుకున్న వ్యక్తిని ప్రత్యేకంగా పట్టించుకోదు సమాజం.

ఆర్థికంగా తన కాళ్ళమీద తను నిలబడగ లిగిన స్త్రీ, తగినంత కారణం ఉన్నప్పుడు ఇక్కడ కోర్టుకు వెళ్ళి, విడాకులు తెచ్చుకున్నా సమాజం ఆమెని చిన్నచూపు చూస్తుంది. వీలుంటే ఎద్దేవా చేస్తుంది. ఇహ విడాకులు తీసుకున్నవాళ్ళలో రెండవ వివాహానికి అవ కాశం బహుతక్కువమందికే లభిస్తుంది.

"పెళ్ళి నూరేళ్ళపంట" అని భ్రమింపచేసే ఈ సమాజంలో, సమాజపు ఆంక్షలు లేక పోతే కాలధాటికి తట్టుకుని, ఎన్ని కాపురాలు నిలబడి ఉంటాయో. అలాంటి ఉక్కిరిబిక్కి రయి మగ్గిపోయిన కాపురాలు, అమెరికాలో విచ్ఛిన్నమవుతున్న కాపురాల కంటే విశిష్ట మైనవా?

అమెరికాలో కూడా నూటికి ఏభయిశాతం ప్రజ ఒకేసారి పెళ్లి చేసుకుంటారని తెలి యని ఇక్కడి ప్రజ అక్కడ సంసారిక జీవితం గురించి నిరసనగా మాటలాడి, తామేదో నైతికంగా చాలా ఎత్తులో ఉన్నట్లు ప్రదర్శించడం సమంజసమైనదా? అను కుంటూ మలుపుతిరిగి, ఒంటిమామిడి జంక్షన్ దాటి పూళ్ళవారివీధిలోకి మళ్ళాడు సురేష్.

★ ★ ★

తెల్లవారడానికి నాందిగా కోడిపుంజు అరు పులు వినిపిస్తున్నాయి.

దీపావళి రాత్రి మందుగుండు సామాను కాలడంవలన వెలువడిన పొగ, ఆకాశంలో నికి ఎగచిమ్మి రాబోతున్న వెలుగుకి పరదా వేసింది.

దోమలు! ఎక్కడ చూసినా దోమలు! అంత ఘాటైన పొగని తట్టుకుని చావని దోమలు!!

స్థల మార్పువలన నిద్రపట్టక తొందరగా తెలివివచ్చేయడంతో, బయట అరుగుమీద కూర్చుని శూన్యంలోనికి చూస్తున్నాడు సురేష్. చిరుచీకటిలో అయ్య కోనేటిలో నీరు కానరావడంలేదు. బంధువుల రాకతో, దీపావళిరోజు సంబరంగా గడిపి, అలసి పోయి, బద్ధకంగా, విజయనగరం కళ్లు తెర వనంటోంది.

కాఫీ కడుపులో పడడానికి ఎంతలేదన్నా గంటో-గంటన్నరో పడుతుంది. ప్రసాద్ లేస్తే, నడకకి వెళ్ళవచ్చు అనుకున్నాడు సురేష్.

కోళ్ళ అరుపులు ఎక్కువయ్యాయి.

తలుపు తెరచుకుని బయటకి వచ్చిన నాగేశ్వరరావు సురేష్‌ని చూసి,

"ఏమిటి ఇక్కడ కూర్చున్నారు? " అనడి గాడు.

"తొందరగా తెలివివచ్చేసింది. మళ్ళీ నిద్ర రానంటే, ఇక్కడ కూర్చుని ఆ కోనేటిలో నీరుని చూస్తున్నాను. మీరు మార్నింగ్‌వా క్‌కి బయలుదేరారా? "

"ఠంచనుగా ఐదు అయ్యేసరికి నాకు తెలివి వచ్చేస్తుంది. నడకకి వెళ్తాను" అన్నాడు నాగేశ్వరరావు మెడకి మఫ్లర్ చుట్టుకుంటూ.

"పదండి, మీతో నేనూ రెండడుగులు వేస్తాను" అంటూ నాగేశ్వరరావ్‌తోపాటు మెట్లు దిగాడు సురేష్.

"మీకు స్వెట్టర్ అక్కర్లేదా? చలి వేయడం లేదూ? "

చిరునవ్వు నవ్వుతూ అడ్డంగా తలూపాడు సురేష్.

"క్రితంసారి మీరు విజయనగరం వచ్చిన

ప్పుడు, నేను ఊరెళ్ళాల్సివచ్చింది. అందుకే మిమ్మల్ని కలవలేదు. మా అమ్మాయి శారద మీ గురించి రాసింది. మీ నాన్న నాకు రెండేళ్ళు జూనియర్" అంటూ సంభాషణ మొదలెట్టాడు నాగేశ్వరరావు.

"నిజంగా?"

"ఈ మాత్రానికి అబద్ధం ఎందుకు?" అంటూ నవ్వాడు నాగేశ్వరరావు.

నవ్వుతో నవ్వు కలుపుతూ పరిశీలనగా నాగేశ్వరరావువేపు చూశాడు సురేష్.

ఐదుడుగుల ఎనిమిదంగుళాలు పొడవు, దాదాపు నూటనలభై పౌన్ల బరువు, ఎండిపోయి ఉన్న మొహానికి సరిపడేంత చిన్న ముక్కు. సునిశితంగా చూస్తున్న కళ్లు.

అయ్యకోనేరు తూర్పుగట్టు దాటి, దాసన్న వేపు మళ్ళారు. కుడిచేతివేపు మసకబారిన హోటల్ బోర్డు కనిపించగానే, "ఈ హోటళ్లలో కాఫీ ఎన్ని గంటలకి దొరుకుతుందో?" అనడిగాడు సురేష్.

"ఇదేమైనా పెద్ద పట్టణమా. తొందరగా హోటళ్లు తెరవడానికి? మరొక గంటయితే కాని వాళ్ళ తలుపులు తెరవరు. అలాంటి ఆశలేమీ పెట్టుకోకండి"

నాగేశ్వరరావ్ ఒకచోట ఆగి, "ఇదివరలో అక్కడ జట్కాలు, అవే గుర్రపుబళ్లు బాడుగకి ఉండేవి. గుర్రాలు ముసలివవగానే





తిండి పెట్టలేక వాటిని వదుల్చుకున్నాక రిక్షాలు మొదలయ్యాయి. అది ఎప్పటి మాట. ఇక్కడ ఒక గెడ్డ పారుతుండేది. దానిని ఆనుకుని ఒక పెద్ద ఖాళీజాగా ఉండేది. మేం అక్కడ గోటీబిళ్ళాట, బచ్చాలాట, బొంగరాలాట, తరువాత పేకాట, బాడ్మింటన్ ఆడుకున్నాం. ఇక్కడే మీ నాన్న బాడ్మింటన్ మొదలెట్టాడు. తరువాత కాకినాడలో చదువుతున్నప్పుడు ఏదో చాంపియన్షిప్ గెలుచుకున్నాడు. వానపడిన ఒక గంటకి గెడ్డలోనికి ఉధృతంగా తోసుకువచ్చే నీళ్ళని చూడడానికి పరిగెత్తేవాళ్ళం. ఆ తోటని తెగ వాడుకున్నాం ఆ రోజుల్లో.

ఈనాడు ఆ తోటలేదు, తోటని వాడుకున్న మనుష్యులు, ఎక్కడో నాలాంటివాళ్లు తప్ప, లేరు. నీకు మీనాన్న గురించి తెలుసుకుందామన్న ఊహ ఎందుకు పుట్టిందో నాకు తెలియదుకాని, ఈనాటి యువతరానికి, నిన్న గురించి తెలుసుకుందామన్న ఉత్సుకత లేదు" అంటూ ఒకనిమిషం విచారపడ్డాడు.

సురేష్ ఏమీ మాటలాడలేదు.

వెలుతురు పూర్తిగా తెల్లచీరని కట్టుకుంది.

రోడ్డంతా కాగితాల తుక్కుతో నిండి వుంది. రోడ్డుమీద తిరుగుతున్న పది పన్నెండేళ్ల కుర్రవాళ్లు ముందర రోజు రాత్రి కాల్చినప్పుడు ఛిన్నాభిన్నమైన టపాకాయల రద్దీలో ఏదైనా టపాసులు పేలకుండా ఉండిపోయాయేమోనని వెతికి దొరికిన వాటిని చేతిసంచిలో వేస్తున్నారు.

"విజయనగరంలో రెండు పండుగలు అతి ఆర్భాటంగా జరిగేవి. ఒకటి దీపావళి. మీ నాన్న టపాసులు కట్టేవాడు తెలుసా? రెండవది రథయాత్ర. ఒక రథయాత్ర పండుగలో మీ నాన్నని ఎవడో చితకబాదుతుంటే నేవెళ్లి ఆదుకున్నాను" అన్నాడు నాగేశ్వరరావు.

"ఏమయిందేమిటి? "

"జగన్నాథస్వామివారి విగ్రహాలని కర్ర రథంమీద ఉంచుతారు. దానిని చూడడానికి వచ్చిన ప్రజలు, ఒకవైపు నిచ్చెనమీద ఎక్కి, రెండవవైపు నుంచి దిగేవారు. పదిహేను, పదహారేళ్లప్పుడు మంచి, చెడు అన్న విచక్షణ తక్కువకదా. మెట్లెక్కుతున్న ప్రజలమీదకి, స్వామివారికి దూరంనుంచి విసిరినట్లు, జాంపళ్ళని విసిరేవాళ్లు. నేనూ చేశాను ఆ పనిని. అందులో ఆడపిల్లలమీద మరీను. ఒక లెక్కల మాస్టారు ఉండేవారు, ఆయన కూతుర్ని నిచ్చెనమీదున్నప్పుడు ఎవడో జాంపండు విసిరి కొట్టాడు. అది చూసిన మీ నాన్న వాడితో కలియపడ్డాడు. ఆ దెబ్బలాటలో ప్రత్యర్థి కొట్టిన దెబ్బకి, మీ నాన్న ముక్కునుంచి రక్తం కారుతుంటే మేం వెళ్ళి అడ్డుపడ్డాం"

రోడ్డుకి ఇరువైపులా జీవంలేని ఇళ్లు. అక్కడక్కడా పాత ఇళ్లని పడకొట్టి కొత్తగా కట్టిన అధునాతనమైన ఇళ్లు.

"ఆ ఇంటిలో ఒకప్పుడు, మీ నాన్న ఉండేవాడు" అంటూ ఒక ఇల్లుని చూపించాడు.

నిన్నటి ఛాయలులేని ఆ కొత్త ఇల్లుని పరీక్షగా చూశాడు సురేష్. దానిలో తండ్రిని ఊహించ ప్రయత్నించేడు. సాధ్యపడలేదు.

"అటువెళ్తే నెల్లిమర్ల వస్తుంది. దానినే మచ్చకొండ అంటారు" అంటూ గుర్తులు చెబుతూ ఆగి,

"వెనక్కి వెళదాం" అన్నాడు నాగేశ్వరరావు.

తిరుగుముఖం పట్టారు.

"మీ దేశంలో ఎలా ఉందోకాని ఈ దేశంలో చిన్నపిల్లలు ఆడుకోకుండానే పెద్దవాళ్ళయిపోతున్నారు. స్కూళ్ళు ఇప్పుడు పేట్లలో నడుస్తున్నాయి. పిల్లలు ఆడుకోవడానికి జాగాలు లేవు. మీరు గమనించారా? " అనడిగాడు నాగేశ్వరరావు.

తల ఊపాడు సురేష్.

"ఎంత విచారకరం. బాల్యంలో మధుర స్మృతులు లేకుండా వీళ్ళు పెద్దయితే, చివరి

దశలో నెమరు వేసుకోవడానికి ఏముంటాయి? ఇక్కడ మనుష్యులు తొందరగా వార్ధక్యంలోనికి వచ్చేస్తారు, తరువాత వాళ్ళ బతుకు ముసలిగుర్రాలకంటే హీనమైపోతుంది. ఆ విషయంలో నేను చాలా అదృష్టవంతుడిని" అంటూ ఇంటి మెట్లు ఎక్కనారంభించేడు నాగేశ్వరరావు.

"మీరు చెప్పినా నమ్మకపోవచ్చు కాని అమెరికాలో వార్ధక్యంలో బతుకు ఇక్కడ కన్నా హీనం. చాలామంది ముసలికాలంలో నర్సింగ్‌హోమ్‌లలో జీవితాల్ని వెళ్ళదీస్తారు" అన్నాడు సురేష్.

"బతికి ఉంటే మీ డేడీ మీతో ఉండేవారా?" అనడిగేడు నాగేశ్వరరావు.

"అఫ్‌కోర్స్" అని సమాధానమిచ్చాడు సురేష్.

"వాక్‌కి నిన్ను లాక్కెళ్లారూ? ఎంతవరకు వెళ్ళారు" అంటూ ప్రసాదు ఎదురుపడ్డాడు.

"నేను లాక్కెళ్ళడమేమిటి? ఆయన అరుగుమీద కూర్చుని కాఫీ కాఫీ అంటుంటే దృష్టి మళ్ళించడానికి ఆయన వస్తానంటే రమ్మన్నాను. సురేష్‌కి కాఫీ సంగతిచూడు"

ఇంటిలో ఉన్న ఒకేఒక బాత్రూం కోసం పోరాటం ఎక్కువగా ఉండడంతో, సిగరెట్ వెలిగించి, కాఫీని చప్పరించాడు సురేష్.

స్ట్రాంగ్ కాఫీ! దానికితోడు సిగరెట్.

రుచికరమైన కాఫీని తాగుతూ ఆలోచనలో పడ్డాడు సురేష్.

నాగేశ్వరరావుగారు అన్నట్లు బాల్యస్మృతులు అందరికీ అవసరమే. కాని ఏవీ తనకి అవి?

తండ్రి తనడైరీలలో బాల్యపు మధుర స్మృతులని పదిలపరిచాడు, నాగేశ్వరరావుగారు అన్నట్లు నెమరువేసుకునేవాడు బతికివుంటే.

తండ్రి బతికిఉంటే తన దగ్గరే ఉండేవాడని తను నాగేశ్వరరావుగారికి చెప్పాడు.

కాని అదెంత నిజం?

రిటైర్డ్ నర్సింగ్‌హోమ్‌ల గురించి కేతరీన్‌తో జరిగిన సంభాషణ గుర్తుకు వచ్చింది.

"మీ నాన్నకి చాలా పెన్షన్ డబ్బు వస్తుంది, అదేకాకుండా సోషల్ సెక్యూరిటీ కూడా ఉంటుంది. ఎవరిమీదా డబ్బుకి ఆధారపడనక్కరలేదు. తనకి ఇష్టం వచ్చినట్టు ఉంటూ ఎప్పుడు కావాలంటే అప్పుడు నర్సింగ్ హోమ్‌లో చేరిపోవచ్చు" అంది కేతరీన్.

"మా దేశంలో తల్లిదండ్రులు, తమ చివరికాలం పిల్లల దగ్గర గడపడం సాంప్రదాయం. నేను ఈ దేశంలో పెరిగినా ఆ సాంప్రదాయం అంటే నాకు ఇష్టం. డబ్బు మాట ఎలా ఉన్నా, ఎవరూ లేనట్లు ఆయన నర్సింగ్‌హోమ్‌కి వెళ్ళడం ఎందుకు?"

"ఎందుకేమిటి? మనతో ఉంటే ఆయనకి ఫ్రీడమ్ ఉండదు, మనకీ ఉండదు. అదలా ఉంచు. నీ తండ్రి ఇక్కడకి తన తల్లిని ఎందుకు తీసుకురాలేదు? మరి ఆ సాంప్రదాయం ఏమైంది?" అనడిగింది కేతరీన్ యుద్ధానికి దిగుతూ.

"ఆయన రిటైర్‌మెంట్ చాలా దూరంలో ఉంది. దాని గురించి చర్చ ఇప్పుడు అనవసరం" అని తను సంభాషణని తృంచినా, కేతరీన్ ప్రశ్న తనని చిత్తుచేసింది.

భార్య మాట ధాటికి విముఖతకి తట్టుకోలేక తల్లిని ఇండియాలో వదిలేసేడని తను చెబితే కేతరీన్ "సాంప్రదాయం" అంటూ నిన్నని పట్టుకు వ్రేలాడే తండ్రిని చూసి నిరసనతో పగలబడి నవ్వుతుంది.

"తను చేయలేని దానిని ఇతరులు చేస్తారని ఎలా ఆశిస్తాడు నీ తండ్రి?" అని నిలదీస్తుంది.

కేతరీన్!

ప్రతీది తను చెప్పినట్టే చేయాలనేది.

పెళ్ళికిముందర ఒకరోజు "మీ దేశంలో పెళ్లి జీవితంలో ఒకేసారి చేసుకుంటారు. సర్దుకుని జీవితం సాగిస్తారటకదా?" అనడిగింది కేతరీన్.

సర్దుకుని జీవితం సాగిస్తారు అంటే సంసారంలో ఏదైనా చిక్కు భార్యాభర్తల మధ్య వస్తే సామరస్యంగా పరిష్కరించు కుంటారని తను ఔనంటే, భార్య చెప్పినట్టే చేస్తారని కేతరీన్ అనుకుంది.

దూరపు కొండల నునుపులా పెళ్ళ య్యాక, ఒకే ఇంటిలో నివసించడం మొద లయ్యేకగాని ఇద్దరి ఊహలమధ్య తేడా బయటపడలేదు. "సర్దుకోవడం" తనకి నచ్చక వెళ్ళిపోయింది కేతరీన్.

"అన్నయ్యా, అమ్మని నువ్వు తిరుపతికి తీసుకెళ్తానన్నావుట నిజమా?" అనడిగి ఈ లోకంలోకి తెచ్చాడు ప్రసాదు.

"అబద్ధం! తిరుపతి చూసి కాని అమెరికా వెళ్లకు అని పిన్ని బలవంతపెడితే సరే అన్నాను. తిరుపతి నుంచి తిరిగి రాగానే ఢిల్లీ వెళ్తాను" అన్నాడు సురేష్.



మలుపులు తిరిగి టాక్సీ తిరుపతి కొండల్ని ఎక్కుతుంటే కారు ముందు సీట్లో కూర్చున్న సురేష్ చెంపలని లేత కిరణాలు, చల్లని గాలులు తాకుతున్నాయి.

"అబ్బ! చలిగావుంది" అంటూ శాలువాని బిగించి కప్పుకుంది శారద.

"వెధవ మొక్కులు మొక్కేయడం తరు వాత అవి తీర్చలేక అవస్థ పడడం! అనుభ వించు. అయినా అంత చలిగాలేదే!" అన్నాడు మాధవరావ్.

"ఇది ఐదేళ్ల క్రిందటి మొక్కు. ఇంతవ రకు తీర్చడానికి తీసుకు వచ్చేరా? సురేష్ వెళ్దాం అంటే బయలుదేరేరుగాని నా గురించి బయలుదేరేరా? కిటికీ పూర్తిగా మూయవీలులేకుండా సందు ఉండిపో యింది. దానిలోంచి రయ్‌మని చల్లగాలి లోపలికి వస్తోంది. మీకేం? దుక్క స్వెట్టర్ వేసుకుని ఎన్ని కబుర్లైనా చెబుతారు. మనం స్థానాలు మారదాం" అంటూ కస్సు మంది శారద.

"నేమారను"

"వచ్చేసేమమ్మా, ఇంకో పది నిమిషాలు మాత్రమే" అన్నాడు డ్రైవరు.

"కొండ దిగేటప్పుడు నేను ముందర టాక్సీ ఎక్కి మీ సీటులో కూర్చోకపోతే నా పేరు శారదేకాదు" అంది శారద.

గుంభనంగా నవ్వుకున్నాడు మాధవ రావ్.

సన్నగా నవ్వుకుంటూ బయటకి చూసేడు సురేష్.

దాదాపు మూడువేల అడుగుల క్రింద తిరుపతి పట్టణం చిన్నచిన్న మచ్చలులా కనిపిస్తోంది. టాక్సీ కొండలచుట్టూ మెలి కలు తిరుగుతూ మీదకి వెళ్తుంటే దిగువ లోయలో పచ్చగా కనిపిస్తున్న చెట్లమీద పక్షులు కూర్చుని తోకల్ని లేపి అరుస్తు న్నాయి. బలంగా కొమ్మలని కదిలిస్తూ కిచ కిచలాడుతూ దుముకుతున్న కోతులు, కాలి బాటమీద నడిచి కొండెక్కుతున్న భక్తులని భయపెట్టి, వాళ్ల దగ్గర ఉన్న పళ్లని లాక్కో వడానికి ప్రయత్నిస్తున్నాయి. నడిచే బాట పక్కన కుండలలో తాగడానికి నీళ్లని బాట సారుల సౌకర్యానికి అమర్చారు.

బాటకిరువైపులా అక్కడక్కడ బిచ్చగాళ్లు కూర్చుని, భక్తులు నడిచి మీదకి వెళ్తూ, "ఏడుకొండలవాడా, గోవిందా, గోవింద" అని అరుస్తుంటే వాళ్లతోపాటు అరచి, "అయ్యా పది పైసలు ధర్మం చెయ్యండయ్యా, కడుపు మండిపోతోంది" అని అడుక్కుంటున్నారు.

"దొంగలున్నారు జాగ్రత్త" అని ప్రజలని హెచ్చరిస్తూ అంటించిన పోస్టర్లని గమనించి,

"ఇక్కడ దొంగతనాలేమిటి? మరి దేముడు..." అని సురేష్ ప్రశ్నించబోతే మాధవరావ్, పేపరుని మడిచి సురేష్ తల మీద హెచ్చరికగా తట్టేడు.

వాక్యం మధ్యలోనే ఆగిపోయింది.

టాక్సీ గమ్యస్థానం చేరింది.

ఎవరో బాగా ఉబ్బున్న వ్యక్తి, స్వామి వారికి కల్యాణం చేయిస్తుంటే, సామాన్య భక్తులకి స్వామివారి దర్శనమవడానికి ఎంతలేదన్నా మూడు గంటలు పడుతుందని తెలిసి, తొందరగా దర్శనం చేసుకోవడానికి టిక్కట్లు కొనుక్కుని, స్వామి వారి దర్శనం ఒక గంటలో ముగించి బయటపడ్డారు. మాధవరావ్, శారదలు ఖాళీ ప్రదేశంలో కూర్చుని దేముని ప్రసాదం ఆరగిస్తుంటే, "సురేష్, మనవాళ్లిందరికీ పంచడానికి లడ్డూలు కావాలి. ఆ తెల్లబిల్డింగ్‌లో దొరుకుతాయి. నాలుగులడ్లు, ఒక అరిసె పట్టుకురా. ఇంతలో నా కాళ్లనొప్పులు తగ్గుతాయి" అంది శారద.

"ష్యూర్" అంటూ ప్రసాదం అమ్మే దిశగా నడిచేడు సురేష్.

దారిలో క్యూలో నిలబడి చిన్న పిల్లలని సముదాయించలేక అవస్థపడే తల్లితండ్రులని, విసుగుతో అరుస్తున్న పిల్లలని దాటి వెళ్తుంటే, ఒక విచిత్రం చూసి ఆగేడు.

తడిబట్టలతో నేల మీద ఒక స్త్రీ రుబ్బురోలులా దొర్లుతుంటే ఆమెని చేతులతో దొర్లిస్తున్నాడు ఒక పురుషుడు. బహుశా ఆమె భర్త కాబోలు. ఆమె ఎంతసేపై దొర్లుతోందో ఏమోకాని నఖశిఖపర్యంతం ఆమెలో శోష కనిపిస్తోంది. నవంబర్ మాస ప్రభావం వలన చల్లగా ఉంది. ఉష్ణోగ్రత బహుశా పది డిగ్రీలు ఉంటుందేమో. తడి బట్టల మీద రివ్వున వీస్తున్న చలిగాలిలో రాళ్లమీద ఆమె బాధపడుతూ దొర్లుతుంటే సురేష్ చూడలేక కళ్లు మూసుకున్నాడు.

విశాఖపట్నం ఎల్లమ్మతోట జంక్షన్‌లో మణికందా స్వీట్‌షాపులో,

"అరకేజీ లడ్డూ" అని అడిగి తీసుకున్నట్లు, "నాలుగులడ్లు, ఒక అరిసె" అంటూ డబ్బు ఇచ్చి కౌంటర్ వ్యక్తి అందిచ్చిన పదార్థాలని అందుకున్నాడు. తిరుగుముఖం పట్టి, క్యూలో దీనంగా నిలబడ్డ భక్తుల్ని చూస్తూ శారద, మాధవరావ్‌లు కూర్చున్న చోటకి నడుస్తుంటే, గంటల తరబడి క్యూలో నిలబడ్డ పసివాళ్ల ఉచ్చలు, దొడ్లతో దుర్గంధ పూరితమైన కంపు సురేష్ నాసికాపుట రంధ్రాలని తాకింది.

జేబులోంచి రుమాలుతీసి ముక్కుకి అడ్డం ఉంచుకున్నా కంపు తగ్గలేదు. గబగబా శారద, మాధవరావ్‌లు కూర్చున్న చోటుకి నడిచేడు.

★ ★ ★

తిరుపతి పట్టణాన్ని వదలి ఇరవై నిమిషాలు రైలు ప్రయాణం చేసేక గాలిలో మార్పు కనిపించింది సురేష్‌కి. పట్టణంలో నివశించే మూడు లక్షల జనాభాకి, ఎంతలేదన్నా మరి మూడు లక్షల యాత్రీకుల రాకతో తిరుపతి నగరంలో ఎక్కడ చూసినా చెత్తే. అరటిపండు తిని పారేసిన తొక్కలు, కొబ్బరి చిప్పలు, వాడినపూలు, తినుబండారాలని తిన్నాక అడ్డదిడ్డంగా గిరవాటేసిన కాగితాలు, ఆకులు. ఇవి కాకుండా రోడ్డు పక్క గలీజు మామూలే. మరోసారి, ఒక గంట క్రింద నడిచిన జుగుప్సా పూర్వకమైన సంఘటన సురేష్ మదిలోకి వచ్చింది. రైల్వేస్టేషన్‌కి దగ్గరగా ఒక ఫర్లాంగు దూరంలో ఉన్న పుస్తకాల దుకాణంలో మేగజైన్లని కొనుక్కుని తిరిగి వస్తుంటే పక్కగా ఒక మధ్య వయస్కుడు తనతో నడుస్తుంటే అతనివేపు చూసి

ముందరకి నడిచేడు.

గచ్చకాయకి, బొగ్గుకి మధ్య రంగు. అర ప్యాంట్ మీద లుంగీ మడిచి కట్టేడు. ప్యాంట్ కనిపిస్తోంది. మీద అరచేతుల చొక్కా, గారపట్టిన పళ్లు, నోటిలో సిగరెట్.

ఆ మధ్య వయస్కుడు నడక వేగం పెంచి సురేష్ దగ్గరగా చేరి,

"మంచి పిల్ల ఉంది కావాలాసార్?" అనడిగేడు.

లోకం స్థంభించింది తనకి. వ్యక్తపరచలేనంత అసహ్యం లోపలినుంచి ఉబకగా చీత్కరిస్తూ కుడిచేతిని అడ్డంగా ఊపి, గబగబా శారద మాధవరావ్‌లని చేరేడు.

ఆ వ్యక్తి తనని అంత ధైర్యంగా అడగడానికి కారణం చరిత్ర! వ్యభిచారంలేని దేశం కాని ప్రదేశంకాని ఈ భూప్రపంచంలో ఎక్కడాలేవు. కాని పవిత్రంగా పరిగణింపబడే తిరుపతిలో కూడానా? అంటే దైవ దర్శనం కోసం వచ్చే భక్తులు దీనిలో భాగస్వాములా?

వ్యభిచారం చేసేక దేముని దర్శనం చేసుకుని పాపాలని కడుగుకుంటున్నారా? లేక పాపాలని కడుగుకున్నాక మళ్లీ కొత్తగా మొదలెడుతున్నారా?

దేముడంటే ప్రత్యేకమైన ఆసక్తిగాని, నమ్మకంగాని లేనితను ఇక్కడకి రాకుండా ఉండాల్సింది. వచ్చి ఇవన్నీ చూసేక ఉన్న లేశమంత నమ్మకానికి పెద్ద గండిపడింది, గండేమిటి ఆనకట్టే తెగింది. అనుకుని కుంచించుకుపోతుంటే,

"ఎలా ఉంది తిరుపతి? నీ ధర్మమా అని నా మొక్కుతీరింది" అంది శారద.

ఏం చెప్పాలో తెలియక సురేష్ మౌనం వహించేడు.

"మీ దేశంలో మనవాళ్లు గుడులని తెగ కట్టిస్తున్నారట. నువ్వు డబ్బు ఇస్తావా? తరచూ గుడులు చూడడానికి వెళ్తుంటావా?" అనడిగేడు మాధవరావ్.

"లేదు, నేను ఎప్పుడూ చందా ఇవ్వలేదు"

"చందా అంటావేమిటి? భగవంతునికి ఇస్తుంటే?"

"అమెరికాలో ఏదైనా చందా ఇస్తే, చందా ఇచ్చిన సొమ్ముమీద పన్ను ఉండదు. నేను ఎమ్.ఎస్. చేస్తున్న రోజులలో ఒక ఇండియన్ పి.హెచ్.డి. చేయడానికి నేచదువుతున్న యూనివర్సిటీకి వచ్చేడు. అతనికి ఇద్దరు ఆడపిల్లలు, అందులో చిన్న పిల్ల వయస్సు రెండు సంవత్సరాలు. యాధృచ్చికంగా ఆ పిల్ల గుండెకాయకి ఏదో చికాకు ఉందని, వెంటనే ఆపరేషన్ చేయాలని తెలిసింది. ఇన్స్యూరెన్స్ తీసుకున్న తరువాత ఏదైనా అవాంతరం వస్తే దానికి కావలసిన డబ్బు ఇస్తుంది. కాని గతంలో ఉన్న వ్యాధుల నివారణకి ఒక్కపైసా అయినా విదల్చదు. ఆపరేషన్ జరిగింది. నెలకి పదిహేను వందల స్కాలర్‌షిప్‌మీద వచ్చిన ఈయనికి ఆపరేషన్‌కి అయిన ఖర్చు ఇచ్చుకునే స్థోమతలేదని హాస్పిటల్‌కి విన్నవించుకుంటే, ఒక్క ఆపరేషన్ చేసిన సర్జన్ తప్ప మిగతా సిబ్బంది, హాస్పిటల్ అధికారులు, నువ్వు మాకు డబ్బు ఇవ్వనక్కరలేదు అన్నారు. కాని సర్జన్ మాత్రం తనకి ఇచ్చి తీరాలన్నాడు. ఈ విద్యార్థి అక్కడ ఉన్నన్నాళ్లూ, నెలకి ఇంత అని ఆ సర్జన్‌కి డబ్బు చెల్లించేడు. ఆ సర్జన్ ఏ దేశీయుడో తెలుసా? భారతీయుడు. ఈ సర్జన్, వెంకటేశ్వరస్వామి గుడి కట్టించడానికి పదివేల డాలర్లు విరాళం ఇచ్చేడు. అతని పేరు పేపర్లలో విరివిగా ప్రకటించేరు.

ఆ పదివేల డాలర్ల సొమ్ముని ఆదాయంలోంచి తీసివేయవచ్చు అతను. దానివల్ల ఐదువేలు మిగులు. ఒక్క రాయికి రెండు పిట్టలు.

మనదేశంనుంచి అమెరికా వలసవచ్చిన చాలామంది డాక్టర్లకి ఇలాంటి ఉదారస్వభావం ఉంది. ఇది చందా అనవచ్చా? లేక విరాళం అనాలా?"

మాధవరావ్ ఏమీ మాటలాడలేదు.

"చిన్నాన్నా, ప్రొద్దున్న ఒక వింత సన్ని వేశం చూసేను. తడిబట్టలతో ఉన్న ఒక యువతిని, ఒక యువకుడు దేవాలయం చుట్టూ కటిక రాళ్లమీద దొర్లిస్తున్నాడు"

"దాన్నేదో ప్రదక్షిణ అంటారు. మరీ పెద్ద ఆపదవస్తే అంటే తలనీలాలు ఇవ్వడం. కల్యాణం చేయించడంకి చాలకపోతే ఆ ప్రదక్షణ మొక్కుకి వెళతారు" అని మాధవ రావ్ అంటుంటే,

"ఆయనకి ప్రతీదీ వేళాకోళమే. ఆయన మాటలకేంగాని, అదొక మొక్కు" అని సర్దింది శారద. చలిలో అలసిసొలసి తోట కూర కాడలా వ్రేలాడుతూ, ఆ పురుషుడు నిర్జీవమైన వస్తువుని దొర్లించినట్లు దొర్లి స్తుంటే బాధతో సొమ్మసిల్లడానికి సిద్ధంగా ఉన్న స్త్రీ రూపం మరోసారి కళ్లముందర నిలుచుంది సురేష్‌కి.

ఏం తీరని కోరిక కోరిందో! ఏ తీవ్రమైన బాధ నివారణ అయిందో! ఏ అనూహ్యమైన సంఘటన ఆమె జీవితాన్ని మార్చిందో!

ఆమె ప్రదక్షణ పూర్తిచేసేక ఆమె చేసిన వాగ్దానం నెరవేర్చిందని ఆమె బాకీ తీరిం దని భగవంతుడు తన పద్దులో రాసుకుం టాడా? అని అబ్బురపడ్డాడు సురేష్.

★ ★ ★

కల్నల్ కుమార్ ఇల్లు చాలా కోలాహ లంగా ఉంది. పుట్టింటికి వచ్చిన ఒకే ఒక కూతురు రమ్య ఇరవై ఐదవ పుట్టినరోజు వేడుకగా ఏర్పాటు చేసిన విందుకి ఆహ్వాని తుల్లో సంఘంలో పరపతి ఉన్న ప్రము ఖులు వచ్చి ఉండడంతో దేనికీ కొరతలేదు.

డ్రింక్స్ చేతులలోనికి తీసుకుని నేతిలో వేయించిన జీడిపప్పు నంజుకుంటూ కబుర్ల లోపడ్డారు. ఈమారు ఎలక్షన్లు వస్తే కాంగ్రెస్ తుడిచిపెట్టుకుపోతుందని కొంద రంటే బి.జె.పిని అధికారంలోనికి తెస్తే లంచగొండితనం, అరాచక తత్వం తగ్గిపో తాయని ఆశావాదాన్ని మరికొందరు వ్యక్తప రిచేరు.

"ఏం ప్రభుత్వమండీ కుళ్లు ప్రభుత్వం! అందరి ఎదుటా ప్రధాన మంత్రిని చంపితే వాళ్లని ఉరితీయడానికి మూడేళ్లుపట్టింది. వుయ్ షుడ్ హేవ్ షూట్ ది బాస్టర్డ్స్. ఇంత చేతకానితనమా? " అని ఒక ఆర్మీ ఆఫీసర్ నిరసించేడు.

"ఆమె చనిపోయినపుడు జరిగిన హింసా కాండలో ఆస్తి, ఇళ్లని కాల్చడమేకాకుండా రెండువేల మందిని చంపిన వాళ్లకి ఈనా టికీ శిక్షపడలేదు. వాటి సంగతేమిటి? " అనడిగేరు ఇంకొకరు.

"సామాన్య మానవుని గురించి ఎవడికి కావాలి? వాళ్లకి న్యాయం ఎప్పుడూ జర గదు. ఈ ధనవంతుల బీదల మధ్య తేడా కరిగిపోతేకాని ఈ దేశానికి విముక్తిలేదు" అన్నాడు ఇంకోవ్యక్తి చేతి వేళ్లకి ఉన్న వెంక టేశ్వరస్వామి ఉంగరాలు వేపు చూస్తూ.

సురేష్ పక్కని కూర్చున్న వ్యక్తి సురేష్ వేపు తిరిగి,

"ఆ ఉంగరాల వ్యక్తి ఇంట్లో వెండిగిన్నె పోతే ఏ ఆధారమూ లేకుండా పనిమనిషే తీసేడని చెమ్డాలు ఎక్కతీసేసి జీతం ఇవ్వ కుండా తరిమేసేడండి ఆయన" అని సన్నగా నవ్వేడు.

సురేష్ ఇంకోవేపు జరుగుతున్న సంభాష ణని గమనించసాగేడు.

పక్కన కూర్చున్న వ్యక్తి కూడా తన దృష్టిని అటువేపు మళ్లించేడు.

"ప్రతీ సంవత్సరమూ ఈ ఎమ్‌సెట్ పరీ క్షలలో అవకతవకలు, పేపరు లీకవడమే. పేపర్ని లక్ష రూపాయలకి అమ్మేసేడు గురూ"

"అది పేపర్ న్యూస్. కాని దీనిలో మిని ష్టర్ల జోక్యం ఉంది. కోట్లకి కోట్లు చేతులు మారేయి"

"నేన్నమ్మను. పేపరులో ఏమీరాలేదు.

నీకెలా తెలుసు? ”

“ఇవన్నీ పేపరులో రావుగురూ”

“మరి నీకెలా తెలుసు? ”

“నీకు చెప్పినా అర్థంకాదులే” అన్నాడు రెండవవ్యక్తి జేవురించిన మొహంతో తొట్రుపడుతూ. మొదటి వ్యక్తి వదలలేదు.

“గురూ నీకు డ్రింకంటే ఇష్టంకదా నువ్వు చాలా చోట్లకి పార్టీలకి వెళ్లడం నేను చూసేను. నువ్వు ఒక్కసారి కూడా అందరికీ డ్రింక్ పార్టీ ఇవ్వడం నేచూడలేదు” అన్నాడు.

“నన్ను ప్రజలు పిలుస్తారు. ‘సార్ మీరు వచ్చి మాతో డ్రింక్ చేస్తే చాలు’ అని ప్రాధేయపడతారు తెలుసా? ”

మొదటి వ్యక్తి కిసుక్కున నవ్వి అక్కడ నుంచి లేచేడు.

“ఆయన ఒక రావుగారులెండి. ఆయన మనం చదివే పేపర్లే చదువుతారు. కాని మనలా కాకుండా ఆయనకి అమాంతం వాటిలో కిటుకులు, లొసుగులు, తెరవెనుక జరిగే భాగోతం అరటిపండు ఒలిచినట్టు స్ఫురిస్తాయట. మీరు ఆయనతో మాటలాడితే ఆయన చెప్పినదే రైటనండి, ఎందుకొచ్చిన గొడవ” అని ప్రక్కన ఉన్న వ్యక్తి వివరించేడు. ఖరీదైన బట్టలు వేళ్లకి వజ్రపు ఉంగరాలు పెట్టుకుని డ్రింక్ సేవిస్తున్న ధనికవర్గం బీద ప్రజలకి జరుగుతున్న అన్యాయాల గురించి చర్చిస్తున్నారు.

సాయంకాలం ఏడయింది.

గదిలో మధ్యని ఉన్న బల్లమీద కేక్ ఉపరిభాగంలో ఐదు చిన్న రంగుల కొవ్వొత్తులని వెలిగించేరు. లోపలినుంచి రమ్య, తల్లి వైదేహి, ఇతర స్త్రీలతో గదిలోనికి వచ్చింది.

గదిలో కోలాహలం కొత్తదారి తొక్కింది.

ఐదు కేండిల్స్‌ని రమ్య ఊది ఆర్పినపుడు, కెమేరా ఫ్లాష్‌లు వెలిగేయి. ఆకుపచ్చ పట్టు చీర, ఎర్రని జరీ అంచు ఫ్లాష్ వెలుతురు ట్యూబ్‌లైటు వెలుతురుతో కలవగానే తళతళా మెరిసింది. అందరూ, “హేపీబర్త్‌డేటు రమ్యా” అంటూ ముక్తకంఠంతో పాడి చప్పట్లు కొట్టేక, రమ్య కోసిన కేక్ ముక్కల్ని అతిథులు అందుకుంటున్నారు.

“రమ్యని నేను ఇదివరలో ఎక్కడో చూసేను చిన్నాన్నా” అన్నాడు సురేష్ మాధవరావ్‌తో.

“అది ఎలా సంభవం? ఆ పిల్ల రాజస్థాన్‌లో ఉంటుంది. నువ్వు పొరబడ్డావు” అన్నాడు మాధవరావ్. సురేష్ మెదడు తీవ్రంగా పనిచేయనారంభించింది.

ఇదివరలో తను ఆమెని చూసేడు! కాని ఎక్కడ?

దశపల్లా హోటల్‌లోనా? విశాఖపట్నం ఫ్లాట్‌ఫారం మీదా? కాకినాడ మసీదు జంక్షన్ దగ్గరా? విజయనగరం రోడ్డు మీదా? లేక తిరుపతిలోనా?

సురేష్ మెదడులో బల్బు ఒక్కసారి వెలిగింది.

“తిరుపతిలో దేవాలయం చుట్టూ పొర్లుతూ ప్రదక్షిణం చేసినది రమ్య” అని గ్రహించగానే,

“నే చెప్పలేదా ఆ వేళ తిరుపతిలో గుడి చుట్టూ ఒక స్త్రీ తడిబట్టలతో చేస్తున్న ప్రదక్షిణం గురించి? ఆమె రమ్య” అన్నాడు మాధవరావ్ వేపు తిరిగి.

“బీరు నీకు బాగా మత్తెక్కించింది” అంటూ బిగ్గరగా నవ్వేడు.

సురేష్ మౌనంగా బీరుని చప్పరిస్తూ కళ్లు మూసుకున్నాడు.

కాస్సేపయేక కల్నల్ కుమార్ వీళ్ల దగ్గరకి వచ్చి పలకరించినపుడు,

“సురేష్ మీ అమ్మాయిని ఈమధ్య తిరుపతిలో చూసేనన్నాడు. అది అసంభవం అని నే అన్నాను” అన్నాడు మాధవరావ్.

“అవును చూసి ఉండవచ్చు ఆ త్రాష్టుడు మొక్కు తీర్చుకోవడానికి తిరుపతికి తీసుకు వచ్చి తరువాత అమ్మాయిని ఇక్కడ వదిలి వెళ్లేడు” అన్నాడు కుమార్.

నిశ్చేష్టులయేరు మాధవరావ్, సురేష్‌లు.

డ్రింక్‌లు పూర్తిచేసి పళ్లేలలో పదార్థాలని వడ్డించుకుని, సాంఘిక, ఆర్థిక, రాజకీయ పరిస్థితులని కూలంకషంగా తెలిసినట్లు చర్చిస్తూ పదార్థాలని మెల్లిగా కొరుకుతూ తినేసరికి దాదాపు రాత్రి పదిగంటలయింది. అతిథులందరూ మరోసారి రమ్యకి శుభా కాంక్షలు, కల్నల్ కుమార్‌కి థాంక్స్ చెప్పి కదలి వెళ్తున్నారు. అందరూ వెళ్లేక "మేమూ బయలుదేరుతాం" అంటూ మాధవరావ్, సురేష్‌లు లేచి నిలబడ్డారు.

"ఈవేళ ప్రొద్దున ఎక్సర్‌సైజ్‌కి వెళ్లలేదు. మీతోపాటు కొంతదూరం నడుస్తాను. పీపాలా పెరుగుతోంది ఈ కడుపు" అంటూ పొట్టమీద తట్టుకుంటూ చేతికర్ర అందు కుని, కల్నల్‌కుమార్ సురేష్, మాధవరావ్ లని అనుసరించేడు.

డిన్నర్ తిన్నాక నిద్రపోయే ముందర కుక్కల్ని బయటకి తీసుకెళ్లే ప్రజ, దగ్గరగా చేరి కువకువలు పోతున్న ముతక జంటలు తప్పిస్తే బీచ్‌రోడ్డు మీద అలికిడి దాదాపు సున్నా. సముద్రంమీదనుంచి వస్తున్న నీటి తుంపర్లు, పొగమంచుల కలయిక వలన బాగా ఎత్తున ఉన్న లైట్ల నుంచి వెలువడు తున్న హీనమైన కాంతి, నీరసంగా రోడ్డు మీద వాలుతోంది. సముద్రానికి ఎదురుగా, ఎత్తు ప్రదేశంలో ఉన్న ఏడెనిమిది అంత స్థుల బిల్డింగులలో సగం ఫ్లాట్లలో మాత్రం లైట్లు వెలుగుతున్నాయి. విశాఖపట్నం ప్రజ నిద్రాదేవత ఒడిలోనికి సర్దుకుంటూ చలికి ముడుచుకుపోతోంది.

ఉధృతంలేని కెరటాలు మెల్లగా ఒడ్డుకు పాకుతున్నాయి. లోపలికి వెళ్తున్న కెరటం, ఒడ్డుకు వస్తున్న కెరటాన్ని ఢీకొన్నపుడు ఉత్పన్నమౌతున్న మందమైన గలగల తప్ప అంతా నిశ్శబ్దం!

నిశ్శబ్దాన్ని ఛేదిస్తూ తెరలుతెరలుగా వస్తున్న గాలి!

"మా అమ్మాయి అల్లుడు ఉదయపూర్, రాజస్థాన్‌లో ఉంటున్నారన్న సంగతి నీకు తెలుసు. మా అల్లుడు ప్రవీణ్, ఆర్మీలో కెప్టెన్. ఆ ఊర్లన్నీ దిక్కుమాలిన ఊర్లు. ఎడారి ప్రదేశంకదా, జనంతక్కువ. ఆ ఊర్లలో ఇంటిలో పనిచేయడానికి పని మనుష్యులు దొరకడం కొంచెం కష్టం. అథవా దొరికినా రెండు నెలలు పనిచేసి మానేస్తుంటారు. అందుచేత మా అమ్మాయి రమ్యకి గిన్నెలు కడుగుకోవడం, బట్టలు ఉతుకుకోవడం, పట్లు దులపడంలాంటి పనులు తొందరగా అలవాటయేయి. చలికా లంలో అక్కడ పిచ్చచలి. అపుడు బట్టలు ఉతకడం అంటే సామాన్యంకాదు. చేతులు ఒంకర్లు తిరిగిపోతాయి. అలవాటు లేక పోతే మరీకష్టం.

ఒకరోజు సాయంకాలం కంగారుగా అన్ని ప్రదేశాలు వెతుకుతున్న రమ్యతో, అప్పుడే ఆఫీసునుంచి వచ్చిన ప్రవీణ్ "ఏమిటి వెతు కుతున్నావు రమ్యా? " అనడిగేడు.

రమ్య సమాధానమీయకుండా బీరువా తెరచి బట్టలని ఒక పక్కకి పెట్టి వెతుకు తోంది.

"ఏమిటి, కనిపించడంలేదో చెబితే నేనూ వెతుకుతాను" అన్నాడు ప్రవీణ్.

బోసిగా ఉన్న ఉంగరం వ్రేలుని చూపిం చింది రమ్య.

ఏమీ మాటలాడకుండా, కాఫీ తాగి, స్కూటరెక్కి క్లబ్‌కి వెళ్లిపోయేడుట.

ఖిన్నురాలయింది రమ్య. ఇంకా రెండు సంవత్సరాలేనా పూర్తి కాలేదు పెళ్లయి. మౌనంగా భోజనం కానిచ్చి, రాత్రి పది గంటలకి పక్కమీదకి ఒరగబోతూ, "రమ్యా, నీకు తెలుసుగా ఆ ఉంగరం నీకు నేను పెళ్లిలో ఇచ్చేనని, అది ఎలాగైనా నీ చేతికి ఉండాలి. లేకపోతే నాకు చాలా అశుభంగా అనిపిస్తుంది" అన్నాడుట.

రాత్రంతా ఏడుస్తూ గడిపింది రమ్య.

ప్రొద్దున్న ఆఫీసుకి వెళ్తూ "మా పిన్నికి

చాలాకాలం పిల్లలు కలగకపోతే తడిబట్టలతో గుడిచుట్టూ ప్రదక్షణం చేస్తానని వెంకటేశ్వరస్వామికి మొక్కుకున్నాక పిల్లలు పుట్టేరు. తరువాత నీ ఇష్టం" అంటూ తన మనస్సులో ఉన్నది చెప్పి అక్కడ నిలబడ్డాడుట.

వేరే గత్యంతరం లేక అతను చెప్పినట్లే చేసింది.

ప్రవీణ్ వెళ్లేక ముందర రోజు బాల్చీలో సబ్బునీళ్లలో నానవేసిన బట్టల్ని ఉతుకుతుంటే ఆ సబ్బునీళ్ల క్రింద బాల్చీలో కనిపించింది ఉంగరం.

సెలవు తీసుకుని తిరుపతి మొక్కుతీర్చుకోవడానికి వచ్చేరు. ఆ భ్రాష్టుడు నవంబర్ చలిలో తడిబట్టలతో ఉన్న రమ్యని, కటికనేలపై, గుడిచుట్టూ రుబ్బురోలు దొర్లించినట్లు దొర్లించేడు. ఈ వివరాలన్నీ రమ్య ఇక్కడకి వచ్చేక చెప్పింది.

"రమ్య మొక్కుకున్నాక వెంకటేశ్వరస్వామి వారు నడుముకట్టి వీళ్లకి ఉంగరం కనపడేలా చేసేడని ప్రవీణ్ నమ్మకం! ఆయనకి ఇలాంటి చిల్లర పనులే తప్ప ఇంకే పెద్ద పనులు ఆవేళ లేవు కాబోలు. దీనిలో సగం తప్పు రమ్యదే అయినా ఈ ఉదంతం వింటే ఒళ్లు మండుతోంది" అన్నాడు కుమార్.

"అతను చెప్పిన దానికి రమ్య ఎందుకు వత్తాసు పలికింది? "

"నాయనా సురేష్, పెళ్లయి అట్టేకాలం అవలేదు. కొంతమట్టుకు మన పెంపక లోపంలో ఉంది. అదేరోజున ఏదో సినిమాలో హీరో రాక్షసుడిని చంపడానికి బయలుదేరి వెళ్తూ, ఒక మట్టి గోలెంలో వేలెడంత మొక్కని హీరోయిన్‌కి అందచేస్తూ, "ఈమొక్క బాగున్నంత వరకు నాకు ఏ ఆపదారాదు. కాని అది వాడిపోతేనే చిక్కులలో పడతాను, జాగ్రత్త" అన్నట్లుగా మా అల్లుడు పుండాకోర్, భటాచోర్, ఆ ఉంగరానికీ తనకీ లింకుపెట్టేసరికి బిక్కపోయి, మాట్లాడకుండా ఒప్పుకుంది" అన్నాడు కుమార్ బిగ్గరగా నవ్వుతూ.

మాధవరావ్, సురేష్‌లు అతనితో జతకలిపేరు.

"ఒకవేళ ఆ ఉంగరం దొరకకపోతే ఏమయేదో? "

"ఏమవుతుంది? జీవితాంతం రమ్యని కాల్చుకు తినేసేవాడు. దీనివల్ల మరొక అనర్థం మొలుచుకువచ్చింది. మొక్కుకోవడంవలన ఉంగరం కనిపిస్తుందన్న అతని మూఢనమ్మకం ఉంగరం కనిపించడంతో అతని మూఢ నమ్మకాలని ఇంకా పెంచుతుంది. మా మేనల్లుడు ఒకడున్నాడు. పెళ్లయి పదహారేళ్లయింది. అతని భార్య పిల్లలు పుట్టడంలేదని వాడి దుంప ఒక ప్రక్క తెంచుతూ వాడెవడో గయుణ్ణి తిప్పినట్లు మొక్కులు మొక్కేసి వీడిని ప్రపంచం అంతా తిప్పి కనిపించిన ప్రతి పుట్టకి చెట్టుకీ సాష్టాంగ నమస్కారాలు చేయించింది. చీమలు కుడుతున్నాయని ముళ్లు గుచ్చుకుంటున్నాయని వీడు ఒకటే గోల. అమెరికాలో ఉన్న గుడులకి కూడా తీసుకెళ్లేదే, వీసా ఇవ్వలేదు అమెరికన్ ప్రభుత్వం" అంటూ చట్టలు విరిగేలా పగలబడి నవ్వేడు కుమార్.

"ఇంతకీ వాళ్లకి పిల్లలు కలిగేరా? "

"లేదు నీకు నమ్మకంలేదు, అందుకే ఏమీ ఫలించడంలేదని వీడిని దుయ్యపడుతుంది" అంటూ నవ్వుమోతాదు మించడంవలన కంటిలో తిరిగిన నీళ్లని రుమాలుతో ఒత్తుకున్నాడు కుమార్.

నవ్వుకుంటూ ముగ్గురూ యోగాశ్రమం దగ్గరకి చేరేరు.

"నేను వెనక్కి నడక ప్రారంభిస్తాను. మళ్లీ ఎల్లుండి కలుస్తాంగా. గుడ్‌నైట్" అంటూ తిరుగుముఖం పట్టేడు కుమార్.

ఎత్తు ఎక్కుతూ ఎడమచేతి సందులోనికి తిరిగేరు సురేష్, మాధవరావ్‌లు.

"ఎల్లుండి మాకు తెలిసిన స్నేహితుని

కూతురి పెళ్లి, రిసెప్షన్ ఉన్నాయి. ఇండి
యాలో పెళ్లి ఎలా ఉంటుందో నీకు తెలియ
వస్తుంది. ఈ నెలలో ముహూర్తాలు లేక
పోయినా అమెరికానుంచి వచ్చిన పెళ్లికొ
డుక్కి వీసా ఇబ్బందులు, సెలవు ఇబ్బంది
లతో మళ్లీ రావడానికి వీలులేదుట.
అందుకే గుడిలో పెళ్లి చేసేస్తున్నారు.
గుడిలో పెళ్లికి ముహూర్తం బాధలేదుట",
అంటూ ఇంటి ప్రాంగణంలోనికి ప్రవేశిం
చేడు మాధవరావ్. సురేష్ ఆలోచిస్తూ
చిన్నాన్న వెనకాతలే మెట్లెక్కేడు.

★ ★ ★

గుడి ప్రాంగణంలో నేలని పరచిన
దుప్పట్లు మీద కూర్చుని పెళ్లి తంతు
చూస్తున్నారు సురేష్, ప్రసాదులు. ఇతర
ఆహ్వానితులు కాఫీలు తాగుతూ లోకాభిరా
మాయణం ముచ్చటించుకుంటున్నారు.
వధూవరులు మధుపర్కాలతో పీటలమీద
కూర్చుని పురోహితుడు చెప్పినట్లు చేస్తు
న్నారు.

ఆ రణగొణ ధ్వనిలో బాండ్‌మేళం
చేస్తున్న శబ్దంలో ఇంకేమీ వినిపించకపో
యినా పది పదిహేను నిమిషాల కొసారి
కేశవాయస్వాహా, మాధవాయస్వాహా, నారా
యణయస్వాహా లాంటి ముక్కలు అందరికీ
వినిపిస్తున్నాయి. ఉదయం తొమ్మిదికి ఆరం
భమైన కార్యక్రమం సుమారు పది గంటల
ముప్ఫయి నిమిషాలయేసరికి 'టైమెంత?'
అని అరిచేడు పురోహితుడు.

"పదీ ఇరవై ఎనిమిది" అన్నారు ఒకరు
గుంపులోంచి, బంగారపు గొలుసు ఉన్న
వాచీ వేపు చూస్తూ. రెండు గంటలు ఆల
స్యంగా నడుస్తూ విజయవాడ అవుటర్
సిగ్నల్ దగ్గర బలవంతంగా ఆగవలసి
వచ్చినపుడు అసహనంతో అరిచిన తమిళ
నాడు ఎక్స్‌ప్రెస్ ఇంజన్ అరుపులా ఉంది
ఆ అరుపు. బాండ్ శబ్దం ఎక్కువయింది.
గడిగడికీ క్లేరినెట్‌ని తొందరగా అవరోహణ
దశలోనికి తీసుకెళ్తూ మద్దెల, డ్రమ్‌ల
మీదున్న శబ్దంతో కలవడంతో చెవులు
చిల్లులు పడేంత శబ్దాన్ని పుట్టించి, ఇంకే
ఇంద్రియాలనీ పనిచేయనివ్వడంలేదు.

బాండ్ శబ్దం పతాకస్థాయికి చేరింది.

మంత్రాలని తిరిగి అందుకుని, వధువు
తలమీద జీలకర్ర, బెల్లం ముద్దని వరుడి
చేత పెట్టించి, అది జారిపోబోతుంటే అడ్డు
పడి, తనే దానిని నొక్కిపెట్టి, ఊపిరిపీల్చుకు
న్నాడు పురోహితుడు.

"సరిగ్గా పదీముప్ఫయికి అంత ప్రాము
ఖ్యత ఏమిటి?" అనడిగేడు సురేష్, ప్రక్కన
కూర్చుని పెళ్లి తంతుని ప్రత్యేకంగా
చూస్తున్న ప్రసాదుని.

"అది పెళ్లి ముహూర్తం అన్నయ్యా"

"అంటే?"

"గ్రహాల స్థానాలబట్టి, పెళ్లికి ఒక ముఖ్య
కాలం నిర్ణయిస్తారు సిద్ధాంతులు.

అంటే, గ్రహాల స్థానంబట్టి ఈ దంపతుల
వైవాహిక జీవనం ఆధారపడి ఉంటుంది.
గ్రహాలు సరిగా ఉండకపోతే ముహూర్తాలు
కుదరవు. నాకు అంతకన్నా సరిగ్గా తెలి
యదు. మా నాన్నని అడుగుదామా?" అన
డిగాడు ప్రసాదు.

"వద్దు, నువ్వు ఇచ్చిన వివరణ చాలు,
కాని నాకు ఒక చిన్న అనుమానం"

"ఏమిటి?"

"ముహూర్తాలు లేవన్నప్పుడు గుడిలో
పెళ్ళి ఎలా సాధ్యం? గుడిగ్రహాలకి అతీత
మైనదా? ఈ గుడిలో ఉన్న దేముడు ఆ
అనుకూలంగా లేని గ్రహాలు చెడు ఏమీ
చేయకుండా రక్షణ ఇస్తాడా?"

"మూడు నెలలనుంచి చూస్తున్నాను
నిన్ను అన్నయ్యా, ప్రతీదానికీ లాజిక్‌ని
ముందరపెడతావు. ఈ గ్రహాలు, ముహూ
ర్తాలు, వగైరాలు నమ్మకంమీద ఆధారపడి
వుంటాయి. సామాన్యవ్యక్తి ఊహలకి
అతీతం" అంటూ పకపకా నవ్వాడు

ప్రసాదు.

"నీ పెళ్ళి కూడా ఈ పంథాలోనే అవుతుందా? "

"సర్లే. నెలకి రూపాయి కూడా ఆదాయం లేని నాకు పెళ్ళేమిటి? చూద్దాం ఆ సమయం వచ్చినప్పుడు" అంటూ నీరసపడ్డాడు ప్రసాదు.

బాండ్‌శబ్దం తగ్గడంతో దుప్పటిమీద కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్న మాటలు వినిపిస్తున్నాయి సురేష్, ప్రసాద్‌లకి.

"ఏం గురూ ఏలూరు వెళ్ళి నొళ్లుకొచ్చేవా? "

"ఏం నొళ్లు కోవడంలెద్దూ, చచ్చుమని రెండు వందలైనా రావు. ఏదో ఫస్ట్‌క్లాస్‌లో ప్రయాణం చేయడానికి వాళ్ళు ఇచ్చే డబ్బు మిగులు"

"గురూ, ఇలా పరీక్షలకంటూ ఊర్లకి వెళ్తుంటే సెలవు పెట్టనక్ఖరలేదా? "

"సెలవా? సర్లే! సెలవుపెట్టి వెళ్లడమంటే ఎవ్వడూ వెళ్ళడు. దీనిని డ్యూటీగా భావిస్తారు"

"మరి ఇక్కడ పాఠాలు? "

"కుర్రాళ్ళకి ఇంటరెస్ట్ లేదు, మనం ఎందుకు హైరాన పడడం? వీలున్నప్పుడు జరుగుతాయి"

"అదేమిటి అలా అన్నావు? "

"ఆ మధ్యని యూనివర్సిటీలో, ఇంజనీరింగ్ కాలేజీలలో లెక్చరర్ల పిల్లలకి కోటా ప్రతిపాదిస్తే ఈ తొత్తుకొడుకులు, అలా ఉండకూడదని స్ట్రైక్ చేశారు. వాళ్ళ గురించి మనమెందుకు చావడం? "

"అదీ నిజమేననుకో"

"గురూ, మన గంగాధర్ ఎంత కట్నమిచ్చాడు? "

"కట్నమా? అత్తగారికి పదివేలు ఖరీదు చేసే చీర, ఆడబడుచు లాంఛనాలు, దగ్గర బంధువులకి బట్టలు, ఇతర చిల్లర బాపతులే తప్ప కట్నం వేరేగా లేదన్నారే! అయినా ఆ లోపాయకారి సంగతులు మనకి ఎలా తెలుస్తాయి? "

"పోన్లే, కూతురిని అమెరికా తోలేస్తున్నాడు. కుర్రాడు ఇంజనీరు బాగుంది"

"ఇంజనీర్ కాదు, ఎం.బి.ఏ"

"పిల్ల వెంటనే వెళ్తుందా? లేక వీసా ఇబ్బందులు ఉన్నాయా?

"కుర్రవాడు అమెరికా పౌరుడట, వెంటనే వెళ్ళిపోతుంది. అందుకేగా ముహూర్తాలు లేకపోయినా గుడిలో పెళ్లి చేస్తున్నారు"

మాంగల్యధారణ, తలంబ్రాలు పోసుకోవడంలాంటి వేడుకలు వచ్చేసరికి, బాండ్ మేళం తిరిగి పుంజుకుంది. పక్కని నడుస్తున్న సంభాషణ వినిపించడంలేదు ప్రసాదు, సురేష్‌లకి.

వధూవరులచేత దండలు మార్పించి, ఆహ్వానితులని అక్షింతలు వేసి దీవించమని చెప్పి, టూకీగా పెళ్లితంతుని ఒక కొలిక్కి తెచ్చాడు పురోహితుడు.

బాండ్‌మేళం తమ సామాన్లు సర్దుకోవడం మొదలెట్టారు.

పెళ్ళికి వచ్చిన ఆహ్వానితులు అందరూ ఫలహారం కానిచ్చి, కాఫీలు తాగి, ఒకరి తరువాత ఇంకొకరు, గంగాధర్ దగ్గర సెలవు పుచ్చుకుంటూ వధూవరులకి శుభాకాంక్షలు చెప్పి, సెలవు పుచ్చుకుంటున్నారు.

"మా అన్నయ్య కొడుకు సురేష్" అని సురేష్‌ని పెళ్లికొడుకు రామారావుకి పరిచయం చేశారు మాధవరావ్.

సురేష్ అతనితో కరచాలనం చేస్తూ, "మీరు ఎక్కడ ఉంటారు? " అనడిగేడు.

"ఇప్పుడేమిలాకీలో ఎమ్.బి.ఎ. పూర్తయింది, అక్కడనుంచి మారతాను" అన్నాడు రామారావు.

"సాయంకాలం రిసెప్షన్‌లో కలుద్దాం" అన్నాడు మాధవరావ్ గంగాధర్‌తో.

సురేష్, ప్రసాదు, శారద, మాధవరావ్‌లు బయటకి నడిచారు. రెండు ఆటోలలో ఇంటికి చేరారు.

"ఎలా ఉంది? " అనడిగింది శారద, సురేష్‌కి కాఫీ అందిస్తూ.

"ఏదీ ఇంకా త్రాగందే. అయినా నీ కాఫీ అద్భుతం"

"అదికాదు, నే అడుగుతోంది పెళ్ళి సంగతి"

"బాగానే ఉంది"

"మీ దేశంలో జరిగే పెళ్ళిళ్ళతో పోల్చి చూస్తే ఇది ఎలా వుంది? "

"చర్చిలో పెళ్ళి సంగతా? చర్చిలో పెళ్లి సుమారు నలభైనిమిషాలనుంచి ఒక గంట వరకు నడుస్తుంది. చర్చిలో వరుడికి సంబంధించిన బలగం అంతా ఒకవైపు, వధువుకి సంబంధించిన మనుష్యులు రెండోవైపు కూర్చుంటారు. అందరకంటే ముఖ్యమైనవాళ్ళు మొదటి వరుసలో కూర్చుంటారు. వధువుని తండ్రిగాని, సోదరుడుకాని, లేక అతిదగ్గర వ్యక్తిగాని, చర్చిలోనికి నడిపించుకు వచ్చి వరుడి పక్కని నిలబెడతారు. ముందరగా ఎన్నుకున్న పెళ్ళినాటి ప్రమాణాలని, వరుడు, వధువు చదివేక ఉంగరాలు మార్చుకుంటారు.

"ఇహమీదటనుంచి మీరు భార్యాభర్తలు. వరుడు వధువుని చుంబించవచ్చు" అంటాడు పురోహితుడు.

"అది అయ్యాక గుమ్మందగ్గర వరుడు, వధువు నిలబడి పెళ్ళికి వచ్చినవాళ్ళకి కృతజ్ఞతలు చెబుతుంటే, వాళ్ళు శుభాకాంక్షలు తెలియపరుస్తారు" అని వివరించాడు సురేష్.

"అయితే మహూర్తంలాంటిది కాని, మంత్రాలుగాని ఉండవన్నమాట. అందుకే అక్కడ వివాహాలలో బలం లేకుండా విచ్ఛిన్నమవుతున్నాయి" అంది శారద.

సురేష్‌వైపు చూశాడు ప్రసాదు.

మాట్లాడకుండా, చిరునవ్వు నవ్వుతూ కాఫీ చప్పరించాడు సురేష్.

"మీకు వాళ్ళకీ ఎంత దూరం? " అనడిగేడు ప్రసాదు.

"పదకొండువందల మైళ్లు"

"నాకు రామారావు బాగా తెలుసు. రామారావు అన్నయ్య అక్కడకి వెళ్ళాక, ఇతనిని తీసుకువెళ్ళాడు. నిజానికి, రామారావు అమెరికా వెళ్ళాక, నాకు అమెరికా అంటే చాలా చులకనభావం ఏర్పడింది"

"అదేం? "

"రామారావు అమెరికా వెళ్ళకముందు, ఇక్కడ చాలా జులాయిగా తిరిగేవాడు. డిగ్రీ చదివేటప్పుడు యూనివర్సిటీ పరీక్షలలో కాపీ కొడుతూ పట్టుబడి రెండు సంవత్సరాలు డిబారయ్యాడు. అక్కడకి వెళ్ళి ఎలాగోలాగ బురిడీలు కొట్టి, రెండు సంవత్సరాలలో ఎమ్. బి. ఏ. పూర్తిచేసే బదులు, మరొక సంవత్సరం ఎక్కువ తీసుకుని అయిందనిపించాడు. ఈ విచిత్రం చూశావా? ఆ పిల్ల అనుజ, డాక్టరు చదువు పూర్తయ్యాక ఎమ్. ఎస్. పూర్తిచేసింది. ఆమె చదువులో తెలివిలో అతనికంటే చాలా ఎత్తులో ఉంది. రామారావు సంగతి వీళ్ళందరికీ తెలుసును. రామారావుకి ఆ పిల్లని పెళ్లిచేసుకునే అర్హత ఎందువల్ల వచ్చిందంటావ్? అతని అమెరికన్ పౌరసత్వం! అతను అమెరికా వెళ్ళకుండా డిబార్ అయి డిగ్రీ తరువాత పుచ్చుకుని, ఎమ్. బి. ఏ. ఇక్కడే సంపాదించుకుంటే, కనీసం మాటవరసకేనా అనుజ తల్లితండ్రులు, అనుజ పెళ్లికోసం రామారావు తల్లిదండ్రుల దగ్గరకి వెళ్లేవారంటావా? "

"రామారావుకేం? చాలా బాగుంటాడు" అంది శారద.

"మగవాడి అందం చూసి పెళ్ళిళ్ళు చేస్తున్నారా? ఎందుకమ్మా ఈ మభ్యపెట్టుకోవడం? " ఏదో చెప్పబోయి ఆగింది శారద.

"నేను సాయంకాలం రిసెప్షన్‌కి రావడం లేదు" అన్నాడు ప్రసాదు.

"నేనూ డిటో" అన్నాడు సురేష్.

"సరే, మీ ఇద్దరికీ సాయంత్రానికి సరి

పడా కూరలు, పెరుగూ ఉన్నాయో లేదో చూస్తాను" అంటూ వంటింటిలోనికి వెళ్ళింది శారద.

"నాకూ వెళ్ళాలని లేదు. కాని రిసెప్షన్‌కి శారద ఒక్కర్తీ వెళ్ళదు, నేను తప్పించుకో లేను" అన్నాడు మాధవరావ్. చలికాలం ఆమడదూరంలో ఉందనడానికి నిదర్శనంగా ఐదు గంటలకే వెలుతురు తగ్గడం మొదల యింది. ప్రసాదు, సురేష్‌లకి రాత్రి భోజనా నికి కావలసినవన్నీ డైనింగ్ టేబిల్‌మీద అమర్చిపెట్టి, బీరువాలోంచి పట్టుచీరలన్నీ బయటకి తీసి ఏది వేసుకోవాలో నిర్ణయిం చుకోలేక ఆలోచనలో పడింది శారద.

టెలివిజన్‌లో వస్తున్న సినిమాని చూస్తు న్నాడు ప్రసాదు.

"ప్రసాదూ, అలా బీచివేపు రెండడుగులు వేసి వస్తాను" అని మేడమెట్లు దిగి రోడ్డు వేపు నడిచేడు సురేష్. ఈతరాని వ్యక్తి నీటిలో మునిగిపోతున్నట్లు, భూమిలోనికి సూర్యుడు కృంగుతున్నాడు. పశ్చిమదిశలో ఆకాశం, తాంబూలంలో సున్నం తక్కువైతే ఎర్రపడని నాలికలా, లేత ఎర్రదనాన్ని ప్రద ర్శిస్తోంది. ఆకాశంవేపు చూస్తూ, మెల్లిగా నడుస్తూ ఆపూఘర్ పార్క్ దగ్గరకి వచ్చాడు సురేష్. ఆపూఘర్ మూతబడడంతో, జన సంచారం అట్టేలేదు.

రోడ్డుదాటి సముద్రపు ఇసుక ఒడ్డువేపు నడవబోతూ

"బాబూ, లేతజొన్న పొత్తు ఒకటి కాల్చేదా? " అనడిగింది ఒక స్త్రీ, కొంగుతో శరీరాన్ని కప్పుకుంటూ.

"వద్దు" అందామనుకుని, చలిలో రవ్వంత ఒణుకుతున్న ఆమెను చూసి జాలివేసి,

"ఒకటి కాల్చు, లేతగా ఉండాలి సుమా" అంటూ ఆమెని సమీపించాడు.

రవ్వంత నిప్పున్న కాసిని బొగ్గుల్ని కదిపి, తట్టలోంచి ఒక జొన్నపొత్తుని ఏరి కంకుని నిప్పులమీద ఉంచి గొట్టాలతో బొగ్గులలోనికి గాలిని బలంగా ఊదింది. గాలిని ఊదేట ప్పుడు బుగ్గలు పొంగి, తిరిగి వాటి పాతస్థి తికి వచ్చినప్పుడు చచ్చుబడిన బుగ్గలమీద ముడుతలని ప్రదర్శించాయి. ఆమె వయసు బహుశా నలభైఐదు ఏభైమధ్య ఉంటుం దేమో.

చలిగాలి బారినుంచి తప్పించుకోవడానికి కొంగుని కప్పుకున్నా కంకుని మార్చేటప్పుడు బైటపడిన చేతులు కుంచించుకుంటు న్నాయి. పగలంతా శీతాకాలం ఎండలో కూర్చోవడంవలన కాబోలు, చేతులుమీద చర్మం రంగు గాఢమైంది. పగలంతా నిర్మా నుష్యమైన ఈ ప్రదేశంలో కూర్చుని జొన్న పొత్తులని అమ్మడం కానిపని. ఏమీ అమ్ము డుపోవు అథవా అమ్మినా మహా అయితే ఆరేడు రూపాయలకంటే లాభం ఉండదు. దానికే ఈ వ్యక్తి చలిలో ఒణుకుతూ, ఎండలో ఎండుతూ బాధపడుతోంది అను కుని.

"ఈ వ్యాపారంలో నీకు పెద్ద కిట్టుబాటు ఉండదు. నీకు ఇంకెవరూ లేరా? ఎందుకు ఇలా అవస్థపడడం? " అనడిగేడు.

"కూతురు అత్తవారింటికి వెళ్ళింది. కూలి పనికి వెళ్ళిన నా పెనిమిటి సాయంకాలం ఎనిమిదిగంటలు అయితే కాని తిరిగిరాడు. పగలంతా రెక్కలు పడిపోయేలా పనిచేస్తే పదిహేను కొడతాయి. ఆ కష్టానికి సాయంగా నేను ఐదో, ఆరో సంపాదిస్తే వేడినీళ్ళకి చన్నీళ్లు పెనిమిటి కోసం ఈమాత్రం చేయడం ఒక కష్టమేనా? " అంది.

అంత ఉత్కృష్టమైన భావన ఆమెలో కని పించేసరికి సురేష్‌కి ఆశ్చర్యం, సిగ్గూ కలి గాయి. బహుశా ఈమెకి తెలిసిన ప్రపంచం చాలా చిన్నది. ఈమెకి ఎంత చదువు వచ్చునో తెలియదు. భర్త రెక్కలు ముక్క లయి బతుకుకి డబ్బు ఆర్జిస్తుంటే, తన శారీ రక ఇబ్బంది గురించి ఆలోచించకుండా తన

కున్న పరిధిలో కాస్త ఆర్జించి భర్తకి సాయ పడుతోంది. అన్నిటికన్నా ముఖ్యం, అది కష్టం, తను కష్టపడుతోంది అన్న ఊహ ఆమెలో లేదు భర్త కష్టపడుతున్నాడనే ఆలోచన!

ఈమె భర్త చాలా అదృష్టవంతుడు.

"ఇందబాబూ, రెండు రూపాయలు పొత్తు" అంటూ సురేష్‌ని ఆలోచనల్లోంచి మేల్కొలిపింది.

ఐదు రూపాయల నోటిచ్చి, చిల్లర ఇవ్వ వద్దు అని సౌంజ్ఞ చేస్తూ,

"ఇంతకన్నా ఎక్కువ ఆదాయం వచ్చేపని చూసుకోకూడదు? నీ పెనిమిటితో నువ్వూ ఆ కూలిపనికి వెళ్తే ఏం? "

చేయిని చాచి మూడు రూపాయలని తిరిగి ఇస్తూ,

"ఇదయితే నా ఇష్టం వచ్చినప్పుడు రావచ్చు. ఎప్పుడు కావాలంటే అప్పుడు ఇంటికి వెళ్లిపోతాను. ఇతర పనులలో వీల వదు బాబూ. నా పెనిమిటికి, కూలిపనికి వెళ్ళి నేకష్టపడడం అంటే పడదు బాబూ" అంది.

"ఆ మూడూ ఉంచు, వుంచి ఒక లేత పొత్తు ఇచ్చేయ్. ఇంటికి వెళ్ళి కాల్చుకుం టాను" ఆమె అందిచ్చిన పొత్తు అందుకుని సముద్రంవేపు నడిచాడు.

గ్రహాల గతులు! ముహూర్తాలు! మంత్రాల పెళ్ళి!!

ఈ జొన్నపొత్తు అమ్మేవ్యక్తీ, ఆమె భర్తా పెళ్లి చేసుకున్నారా? ఏమో! వాళ్ళ కాపురా నికి మూలస్థంభం గ్రహాల గతులు, మంత్రాలు ఎంత మాత్రం కాదు. ఆమెకి అతనంటే ఉన్న మంచి ఆలోచన. అతనికీ ఆమె అంటే అలాంటి భావనే ఉన్నట్టు కన బడుతోంది.

ఆమె నిజం చెబుతోందా?

అది నిజంకాక ఆమె భర్త పచ్చి తాగుబో తయితే?

కావచ్చు. ఛ! అలా జరుగకూడదు.

ఆ అనుమానపు ఆలోచన చిరాకుని కలి గించింది సురేష్‌కి. కాని తిరిగి ఆమె భర్తంటే వ్యక్తపరిచిన సున్నితమైన ప్రేమ సురేష్‌ని మామూలు మనిషిని చేసింది.

ఈవేళ ఒంటరిగా బీచికి రావడం మంచి దయింది. ఎంత మంచి అనుభూతిని ఇచ్చే సంభాషణ. కేతరీన్‌తో వైవాహిక జీవి తంలో తన ధోరణిని మలచుకుంటే సవ్యంగా నడిచేదేమో. అంటే, తను నమ్మని విషయాలని నమ్మినట్లు ప్రవర్తించాలి. అది తనని తాను మోసపుచ్చుకుంటేగాని జరు గదు.

ఆ జొన్నపొత్తు అమ్మిలా ఎదుటవ్యక్తి ఆనందానికి, మనల్ని మనం మోసగించుకో కుండా అర్థం చేసుకున్నప్పుడే అది సాధ్యం.

కేతరీన్‌తో తన నాలుగేళ్ల జీవితంలో ఆ దశ తనకి ఎప్పుడూ రాలేదు.

ఆ జొన్నపొత్తు స్త్రీ ఇంటికి మట్టికుండలు, నులకమంచంకంటే ఏమీ లేవేమో. సౌకర్యా లేవీ లేకపోయినా ఆ అమ్మ మొహంలో భాసిల్లిన ఆనందం, ఎన్ని లక్షలు పెట్టి సౌక ర్యాలు అమర్చుకున్నా సాధ్యపడకపోవచ్చు. అనుకుంటూ ఇసుకలో చతికిలపడ్డాడు.

శారద పిన్ని ఊహలో, మంత్రాలు లేకుండా పెళ్ళిళ్లు జరగడంవలన, ఆ వివా హాలు విచ్ఛిన్నమవుతున్నాయి. ఏభయి శాతం అలా జరిగిందని అనుమానపడినా, కాలంతోపాటు నిలబడ్డ మిగిలిన ఏభయి శాతం మాటేమిటి? వాటి నిలకడకి ఏమిటి కారణం?

ఇద్దరు వ్యక్తులు, ఒకేపంచకింద బతు కుతూ, పిల్లల్ని కని, బజారులో పడకుండా జీవితాన్ని వెళ్ళదీస్తే ఇక్కడ వాటిని సఫల మైన వివాహాలకిందే సమాజం పరిగణి స్తుంది. నిజంగా అది సఫలమైన కాపురా లేనా? సఫలమైన వివాహం అని ఎలా నిర్ణ యిస్తారు?

విడాకులు కోరకుండా, పారిపోలేక, అలసి

పోయి, మరొక పదేళ్లు జగపతి దగ్గర చిక్కు
కుపోతే అలా బాధని భరిస్తూ ఎవరికీ
చెప్పుకోకుండా ఊరుకుంటే సరళ కాపురం
కూడా సఫలమైన తెగలోనికి చేరిపోతుం
దేమో.

గ్రహాలగతులకి అతీతమై గుడిలో పెళ్ళి
చేసుకున్న రామారావు అనుజల పెళ్ళి సఫ
లమవుతుందా? అర్థం లేని ప్రశ్నే కావచ్చు
కాని తన అనుమానానికి కారణం రామారా
వులాంటి ఇతర వ్యక్తులు. ఇండియానుంచి
అమెరికాకి చదువుకి వచ్చి, వీలున్నంతవరకు
సాగినంతకాలం అమెరికన్ పిల్లలతో తిరిగి,
పెళ్ళి ప్రశ్న వచ్చేసరికి ఇండియా వచ్చి పెద్ద
కట్నంతో కాని లేదా సాంకేతిక అర్హతలున్న
పిల్లని పెళ్లిచేసుకురావడం తను చాలాసార్లు
గమనించాడు. రామారావు సంగతి తనకి
తెలియదు. కాని రామారావు పెరిగిన తీరు
తెలిసినా, సాంప్రదాయాలని అణుగుణంగా
మలచుకుని, గుడిలో తొందరగా పెళ్లి
చేయడం చూస్తుంటే, ప్రజలకి ఆ సాంప్రదా
యాలమీద ఎలాంటి నమ్మకముందో సుల
భంగా అంచనా వేయవచ్చు.

సురేష్ ఆలోచనలోనికి తండ్రి తిరిగి,
మరోసారి ప్రత్యక్షమయ్యాడు.

ఆనవాయితీ, సాంప్రదాయం, మానవతా
విలువలు అంటూ జీవితాన్ని వెళ్ళదీశాడు
తండ్రి. తను నమ్మని సాంప్రదాయాల్ని
కొన్నింటిని, ఇతరులని బాధపెట్టకుండా
ఉండడానికి పాటించాడు. అయితే ఆ
సాంప్రదాయాల్ని తనమీద రుద్దప్రయత్నిం
చనందుకు జీవితంలో ఓడినా, తండ్రి
అభినందనీయుడే.

తండ్రి గురించి తలపు రాగానే. సంధ్య
ఆంటీ మదిలో మెదిలింది.

తండ్రితో గతంలో జరిగిన ఆంతరంగిక
వ్యవహారాలు చర్చించడానికి ఇష్టపడని
సంధ్య ఆంటీ, దారితప్పి, తండ్రి తన



గురించి ఆరాటపడ్డాడని, చికెన్‌పాక్స్ వచ్చినా ఖాతరు చేయకుండా తనని చూడడానికి వచ్చేడని చెప్పినప్పుడు ఆమె మొహంలో పొడచూపిన ఆనందం, తండ్రి చూస్తే ఎంత ఆనందించేవాడో!

చీకటిపడడం చూసి, లేచి బట్టలకి అంటుకున్న ఇసుకని దులుపుకుని ఇంటికి నడక మొదలెట్టాడు సురేష్.

మేఘాల వెనకాతల చంద్రుడు, మసకపట్టిన చంద్రుడు.

కాంతివిహీనుడైన చంద్రుని ఉనికి గమనించనట్టు, ఉత్సాహం లేకుండా గాఢమైన నీలపురంగు ధరించి బద్ధకంగా నిద్రపోతోంది సముద్రం.

ఆపూఘర్ దగ్గరకి వచ్చి రోడ్డు దాటబోతూ జొన్నపొత్తులు కొన్నచోటువేపు చూశాడు.

"శారదపిన్నికి జొన్నపొత్తు అమ్మితో జరిగిన సంభాషణ చెప్పాలి" అనుకుంటూ ఇంటివేపు మళ్ళాడు సురేష్.



"మా అన్నయ్య కొడుకు సురేష్. మీ శారద పిన్ని అన్నయ్య రామమూర్తి" అంటూ పరిచయం చేశాడు మాధవరావ్.

చాచిన సురేష్ చేతిని అందుకుంటూ, "ఈ గదిని మీ కోసమే ఖాళీ చేశాం. మీ సామాన్లని దీనిలో పెట్టండి" అన్నాడు రామమూర్తి.

సురేష్, మాధవరావ్‌లు సామాన్లని చేరవేస్తుంటే వద్దన్నా వినకుండా కొన్ని సామాన్లని అందుకున్నాడు రామమూర్తి.

"థాంక్స్" అన్నాడు సురేష్ సామాన్లని చేరవేశాక.

"ఫోన్‌చేసి కనుక్కుంటే బండి కాస్త ఆలస్యంగా నడుస్తోంది అన్నాడు. నిజాముద్దీన్ లోనే దిగారా? "

"ముప్ఫయి నిమిషాలు లేటు. టాక్సీల కోసం తగువు మామూలేగా. బయటపడేసరికి కాస్త ఆలస్యమైంది. చలిగా ఉందోయ్ మీ ఢిల్లీలో" అన్నాడు మాధవరావ్.

"ఇదేం చలి, జనవరి మధ్యలో ఇంకా పేలుస్తుంది. అయినా ఈ చలి అమెరికా ప్రజలకి చలిలా అనిపించదు. వాళ్ళ చలి గురించి ఆలోచిస్తేనే చలివేస్తుంది"

"అవును, ఉత్తర అమెరికాలో చలి బాగా ఎక్కువ. ఇక్కడ మంచు కురవదు. కాని అమెరికాలో సగభాగంలో, మూడు నెలలు మంచు కురవడం అతిసామాన్యం" అన్నాడు సురేష్.

"ఇంటిలో అలికిడి ఏమీ లేదే" అని అడిగాడు మాధవరావ్.

"పిల్లలు ఇప్పుడే స్కూలుకి వెళ్ళారు. మా ఆవిడ చార్టెడ్ బస్ ఏడు నలభైఐదుకే. ఆవిడే అందరికంటా ముందర బయటపడుతుంది ఇంటిలోంచి. ఈవేళ ఆఫీసుకి కాస్త ఆలస్యంగా వస్తానని మా పి.ఏ.కి ముందరే చెప్పాను. మీరు తయారయితే ఎక్కడైనా మిమ్మల్ని డ్రాప్ చేసి నేను అలా ఆఫీసుకి వెళ్తాను" అన్నాడు రామమూర్తి చేతికున్న గడియారంవేపు చూస్తూ.

"మా గురించి నువ్వు ఆగకు. మెల్లిగా తయారయి మా దారి మేము చూసుకుంటాం. నాకు ఢిల్లీ బాగానే తెలుసు. సురేష్ నాలాగే కాఫీ పక్షి. మాకు కాఫీ సరంజామా చూపించి నీమానాన నువ్వు వెళ్ళు. మేము అలా ఊరు చుట్టబెట్టి సాయంకాలం నాలుగు, ఐదుగంటలకి గూటికి చేరుతాం" అన్నాడు మాధవరావ్.

అరగంటలో రామమూర్తి తయారయి, మారుతీకారులో ఆఫీసుకి వెళ్ళాడు.

"అబ్బ! తెగచలిగా ఉంది. ఈ రెండవ కప్పు కాఫీ లోపలికి వెళ్తేగాని అవయవాలు కదిలేటట్టు లేవు" అంటూ సెగలు కక్కుతున్న కాఫీ తాగి కాలకృత్యాలు తీర్చుకోవడానికి స్నానాలగదిలోనికి ప్రవేశించాడు మాధవరావ్.

పేపరు చదవడం ముగించి, దానిని కింద ఉంచుతూ ఇంటిని పరిశీలించాడు సురేష్. హాలులో నాలుగు సోఫాలు అర్ధచంద్రాకారంలో, అందంగా అమర్చబడి ఉన్నాయి. వాటికి ఎదురుగా టీపాయ్. సోఫాలకి అభిముఖంగా, గోడకి ఆనుకుని సోనీ టెలివిజన్, దానంత రెండు స్పీకర్లతో స్టీరియో సిస్టమ్. ఎత్తయిన సీలింగ్, హాలులో రెండవభాగంలో ఆరు కుర్చీలతో డైనింగ్ టేబిల్ ఒక మూలగా ఫ్రిజ్. గోడమీద, దశావతారాలు, విఘ్నేశ్వరుడు, అర్జునునికి కృష్ణుడు గీత బోధిస్తున్న పెయింటింగ్సు వ్రేలాడతీసి ఉన్నాయి. డైనింగ్ టేబిల్‌కి దగ్గరగా ఉన్న షోకేస్‌లో ఖరీదైన డిన్నర్ సెట్‌తోపాటు వివిధ రకాలైన విదేశీవస్తువులు పొందికగా అమర్చబడివున్నాయి. హాలులో సీలింగ్ నుంచి వ్రేలాడుతున్న రెండు పాతకాలపు నాటి ఫ్యాన్లు.

"నీటుగా ఉంది ఇల్లు" అనుకున్నాడు సురేష్.

స్నానాల గదిలోంచి బయటపడిన మాధవరావ్ "ఇది గవర్నమెంట్ ఇల్లు. వెనకాతల పనిమనిషికి క్వార్టర్లు ఉంటాయి. ఆ ఇళ్లలో ఉండనిచ్చినందుకు, కాపురం ఉంటున్నవాళ్లు ఈ ఇంటిలో ఉచితంగా పనిచేస్తారు. గవర్నమెంట్ సిబ్బందికి, ఒక మోస్తరు హోదాకి చేరాక, కారు కొనుక్కోవడానికి డబ్బు అప్పు ఇస్తుంది ప్రభుత్వం తక్కువ వడ్డీకి. దానిని నడపడానికి పెట్రోలు కావాలిగా. దానికీ నెలకి ఇన్ని లీటర్లకి డబ్బు అందిస్తుంది.

రామమూర్తి జాయింట్ సెక్రటరీ కాబోలు. అతని భార్య మృణాళిని బ్యాంక్‌లో ఎకౌంటెంట్. ఇద్దరు పిల్లలు, ఒక మగా, ఒక ఆడా. వాళ్ళని సాయంకాలం కలుస్తాం. నువ్వు తయారయ్యాక మనం బయటపడి, అటూ ఇటూ తిరిగి నిమ్మళంగా లంచ్‌తిని ఇల్లు చేరుకుందాం. ఎల్లుండి నీ ఫ్లయిట్ కన్‌ఫర్మ్ చేసుకుందాం లేమరి" అంటూ సురేష్‌ని లేవదీశాడు.

"వీలుంటే మా డేడీ పనిచేసిన ఆఫీసుకి వెళ్దాం" అంటూ తయారవడానికి లేచాడు సురేష్.

కాలకృత్యాలని తీర్చుకున్నాక, మాధవరావ్ మళ్ళీ బాత్రూంలోనికి దూరడం చూసి, కిటికీ దగ్గరగా నిలబడి బయట కదులుతున్న జనవాహినిని గమనించసాగాడు సురేష్.

కాకానగర్ కాలనీకి ఎదురుగా ఉన్న వెడల్పాటి రోడ్డుమీద రంయిమని బస్సులు, లారీలు, కార్లు, ఆటోలు ఒకదానితో ఒకటి పోటీపడుతూ దౌడుతీస్తున్నాయి. రెండు పెద్ద వాహనాల మధ్యన్న సన్నని జాగా లోంచి మెలికలు తిరుగుతూ అటూ ఇటూ నడిచే స్కూటర్లు, మోటారుసైకిళ్లు. ఒక వాహనాన్ని ఇంకొక వాహనం తేడా లేకుండా ఎడమవైపునుంచి, కుడివైపునుంచి హారన్ కొడుతూ అధిగమిస్తుంటే చెవులు చిల్లులుపడేంత ధ్వనులు ఉత్పన్నమవుతున్నాయి. మారుతీకార్లు చూడడానికి అల్పంగా కనిపించినా, దానికి అమర్చిన హారన్ అతిదారుణమైన శబ్దాన్ని పుట్టిస్తోంది.

అబ్బ! ఎంత శబ్దం!

ఇలాంటి శబ్దాలకి అలవాటుపడడంవలనే కాబోలు ఇళ్లలో టెలివిజన్ పెట్టేటప్పుడు వాల్యూమ్ తెగపెంచుతారు. కొన్నాళ్లకి అతి త్వరలో వీళ్లలో చాలామందికి చెముడు వచ్చేస్తుంది. అనుకున్నాడు సురేష్.

ముందరరోజు వర్షం కురిసినట్లుంది. చలి మంచు మెల్లిగా ఢిల్లీ పట్టణాన్ని ఆవహించింది. దానికితోడు వాహనాలనుంచి రాక్షస బొగ్గులు కాల్చడంవలన రోడ్డుమీద దొరికిన పుల్లలు, ఆకులు, చెత్త ఏరి, ఇంకేదారి లేక బీదప్రజ వాటినే కాల్చి వంటవండుకున్నప్పుడు పుట్టినపొగ, చలిమంచుతో కలిసింది. వాతావరణం చల్లగా ఉండడంతో పొగ, పొగమంచు మిశ్రమం భూమిమీదే తచ్చాడుతోంది. ఏభైఅడుగుల దూరంలో ఉన్న వస్తువు కనిపించని దట్టమైన మంచుని పట్టించుకోకుండా వాహనాలు దూసుకుపోతున్నాయి.

"బయలుదేరుదామా? " అనడిగేడు మాధవరావ్ సురేష్ దగ్గరికి వచ్చి

"ఓ. కే." అంటూ చిన్నాన్న వెనకాతలే బయటపడ్డాడు సురేష్.

"ఎములని కొరికే చలి అంటారు చూశావా? అదే ఇది. సూర్యుడు బయటకి రాకపోతే చలికి చేతులు కొంకర్లు పోతాయి తెలుసా? " అంటూ మఫ్లర్ని చెవుల చుట్టూ కప్పుకున్నాడు మాధవరావ్.

"ఫో చిన్నాన్నా, భలే జోకులు వేస్తావు" అంటూ మాధవరావ్ చేతిని అందుకున్నాడు సురేష్.

★ ★ ★

మాధవరావ్, సురేష్లతో ప్రయాణం చేస్తున్న టాక్సీ జనసమూహాల్ని, వాహనాల్ని ఛేదించలేక ప్రతీ ట్రాఫిక్ లైటు దగ్గరా ఐదేసి నిమిషాలు ఆగుతూ, రెడ్ఫోర్టని దాటి ఢిల్లీ రైల్వేస్టేషన్ బ్రిడ్జ్ దగ్గరికి చేరింది. పాత ఢిల్లీ దిశలోంచి వస్తున్న వాహనాలు, బ్రిడ్జ్ కింద ఉన్న రోడ్డుమీద కదలలేకుండా ఉన్నాయి. తూర్పునుంచి వస్తున్న వాహనాలు, రెండవదిశలో స్తంభించిన వాహనాలు గురించి పట్టించుకోకుండా ముందరకి చొచ్చుకువచ్చేసి ఒక్క అంగుళం కూడా జాగా లేకుండా చేశాయి. ఏ వాహనం కదలడానికైనా ఆస్కారం లేకుండా ఉన్నప్పుడు బస్సులు, టాక్సీలు, కార్లు, ఫటఫటీలు, ఆటోలు ఎవరికివారే తొందరపడుతూ ఇంజన్లని ఆపుచేయకుండా పుష్కలంగా నల్లని రంగున్న ఎగ్జాస్ట్ని గాలిలోనికి వదులుతున్నాయి.

కారు కిటికీ తలుపుతీసి అరనిమిషం గడిచేసరికి దగ్గువచ్చి, కళ్ళలో నీళ్లు తిరగడంతో కిటికీని తిరిగి మూశాడు సురేష్. కారు లోపల పెట్రోల్ తో కలిసిన కిరసనాయిలు వాసన వెగటుగా ఉంది. నీటిలోంచి బయటపడిన చేపలా, అసహనంగా సురేష్ కదలడం చూసి, "అలా జమునా రోడ్డుమీద నుంచి వెళ్ళగలవేమో" అని డ్రైవరుకి ప్రతిపాదించేడు మాధవరావ్.

"వెళ్ళవచ్చు, కాని ఈ ఊబిలోంచి బయటపడడానికి ఏదీ మార్గం? వెనక్కి మళ్ళిద్దామన్నా ఒక్క పిసరు కూడా ఖాళీలేదు" అన్నాడు టాక్సీడ్రైవరు.

మరొక పది నిమిషాలు గడిచేసరికి వాహనాలు విసర్జించిన పొగ పొగమంచుతో కలిసి ఆకాశంనిండా నలుపురంగుని వెదజల్లింది.

సురేష్వేపు చూసేడు మాధవరావ్.

గింజుకుంటున్నాడు సురేష్.

"మీ డాడీ పనిచేసే ఆఫీసు చూడడం ఈవేళ జరగని పని. మనం ఇక్కడ ఎంతసేపు పడికాపులు కాయాలో ఎవరూ చెప్పలేరు. దిగు మనం కాస్త దూరం నడిచి కన్నాట్ ప్లేస్కి వెళ్లిపోదాం" అంటూ టాక్సీ డ్రైవరుకి డబ్బు ఇచ్చేడు మాధవరావ్.

"సారీ, ఇది అన్యాయం సార్, ఇంత దూరం తీసుకువచ్చి మీరు నన్ను ఇక్కడ వదిలేస్తే నాకు ఈవేళ పస్తే, సార్ మరొక నలభై రూపాయలు ఇప్పించండి సార్. మద్రాసీవాళ్లకి కనికారం ఉందంటారు" అని ప్రాధేయపడ్డాడు డ్రైవరు. మరో ఇరవై రూపాయలు ఇచ్చి సురేష్తో వెనక్కి నడ

వడం ప్రారంభించేడు మాధవరావ్.

ఎంబాసిడర్ హోటల్లో, మధ్యాహ్నం ఒంటిగంటకి, లంచ్ తింటూ, "న్యూఢిల్లీ బాగుంది. కాని పాత ఢిల్లీలో ఉన్నంత కాలుష్యం ఈ ప్రపంచంలో ఉందంటే నేను నమ్మేవాడినికాదు. న్యూఢిల్లీలో కాలుష్యం లేదని కాదు, పాత ఢిల్లీతో పోలిస్తే తక్కువ. నా గొంతు కాలుష్యం వలన గుర గురమంటోంది. ప్రజలు ఎలా బతుకుతు న్నారో!" అని ఆశ్చర్యపడ్డాడు సురేష్.

"పొల్యూషన్ ఉండకేం చేస్తుంది? ప్రొద్దున్న స్టార్ట్ చేసిన బస్‌లు రోజంతా తిరుగుతూనే ఉంటాయి. విరామంలేకుండా. ఒకసారి ఆగితే తిరిగి స్టార్ట్ అవవని. విరామం వచ్చినా వాటిని ఆపే ప్రయత్నం చేయరు"

"అదేం? ఎందుకు స్టార్ట్ అవవు? బస్సు లన్నీ కొత్త బస్సులలాగే ఉన్నాయే? "

"బస్సులు కొత్తవే. చాలా డబ్బు పెట్టి కొన్నవే. అవి కొత్తగా మహా అయితే ఒక నెలో, రెండు నెలలో నడుస్తాయి. తరువాత వాటిలో ఉన్న కొత్త ఇంజన్లని తస్కరించి వాటి స్థానంలో పాత అవుకుబడిన ఇంజ న్లని సర్దేస్తారు. ఈ కొత్త ఇంజన్లని బ్లాక్ మార్కెట్‌లో అమ్మేస్తారు. ఇంజన్‌తోపాటు ఇతర ముఖ్యమైన భాగాలూ అంతే. ఈ దేశంలో తెలివికి కొదవలేదు. అన్యాయం, అధర్మం అన్న పదాల గురించి పట్టించుకో కుండా ముందుకు పురోగమిస్తున్నాం"

"తెలివిలేకేం, కాని ఆ తెలివిని సవ్యంగా, సజావుగా ఉపయోగించడంలేదు. ఎంత సేపూ స్వలాభాలోచనే. ఇంకో వ్యక్తి ఆలోచ నలలోనికి రావడంలేదు. మాడాడీ తన డైరీ లలో రాసుకున్నదానికి, ఈ రోజుల్లో నడు స్తున్న విధానానికి చాలా వ్యత్యాసం కనిపి స్తోంది"

"అన్నయ్యా డైరీలు రాసుకున్న రోజులు దాదాపు నలభై ఏళ్ల క్రితంవి. ఆ రోజుల్లో ఈ లంచాలు, మోసాలు లేవనికాదు, ఉండేవి. రిటైరయే రోజుల్లో ఏభై ఏళ్లు దాటేక నిజమైన ఆర్థిక ఇబ్బందులని ఎదు ర్కొనే ఏ మార్గం కానరానపుడు కక్కుర్తిపడే వారు. కాని ఈ రోజుల్లో, ఉద్యోగంలో చేరడం మొదలవగానే ఎంత వేగం, ఎంత ఎక్కువ నొక్కుకుందామా? అనే ఆలోచన. యువతరంలోనే ఈ అంటువ్యాధి నరన రాల్లో ప్రవేశిస్తే, వీళ్లు తమ పిల్లలకి నీతులు చెప్పగలిగే నైతిక ధైర్యం ఎక్కడనుంచి వస్తుంది? "

"ఈ వడ తింటుంటే శారద పిన్ని చేసిన గారెలు గుర్తుకు వస్తున్నాయి. నా గురించి మీరందరూ చాలా శ్రమ తీసుకున్నారు, థాంక్స్ చిన్నాన్నా"

"భలేవాడివే! నువ్వు ఈ కుటుంబంలో ఒక వ్యక్తివి. అమెరికన్ పౌరసత్వం పుచ్చు కున్నా రక్తసంబంధాలు ఎక్కడకి పోతాయి? ఈమారు నువ్వు జంటగా వచ్చావా సరేసరి. లేకపోతే ఇక్కడ ఒక పిల్లని సంతలో వెతికి నీతో జత కట్టిం చేస్తాం" అంటూ పరిహాసమాడేడు మాధవ రావ్. చిన్నాన్న చూపిస్తున్న అవ్యాజమైన అభిమానానికి ఉక్కిరిబిక్కిరవడంతో కళ్లలో నీరు తిరిగింది సురేష్‌కి.

సురేష్ మొహంలో మారుతున్న రంగుల్ని చూస్తూ పెరుగు వడ ముక్కని నోటిలో ఉంచుకున్నాడు మాధవరావ్.

కేతరీన్ తనతో ఇండియా వచ్చి ఉంటే ఎలా ప్రవర్తించేదో!

జనాలని చూసి జడుసుకునేదేమో! శుభ్ర తలేదని చీదరించుకునేదేమో! చేతులతో తిండి తింటారని చిన్నచూపు చూసేదేమో! ఇక్కడి ప్రజలు, ఏమీ ఆలోచించకుండా వ్యక్తిగత విషయాల గురించి ప్రశ్నలు వేస్తే వాళ్లు అనవసరంగా తన ఆంతరంగిక వ్యవ హారాలు గురించి ప్రశ్నిస్తున్నారని అసహ్యిం చుకునేదేమో!

ప్రతీ చిన్న పనికీ చేంతాడులా ఉన్న

క్యాని, దొమ్మీ ధోరణిని చూసి ఏమనుకు నేదో! కేతరీన్‌కి తెలిసిన ప్రపంచంవేరు! కేతరీన్ పెరిగిన దేశంలో సమాజానికి వ్యక్తి గురించి, ఆసక్తి ఉత్సాహం తక్కువని, అలాంటి వాతావరణంలో వ్యక్తి స్వాతంత్రం చాలా ఎక్కువని అలా కానపుడు వ్యక్తి స్వాతంత్రం తగ్గి సమాజ ఆధిక్యత పెరుగుతుందని తెలియదు. కేతరీన్ కనీసం ఊహించనైనాలేదు.

ఈ దేశం వచ్చి ఐదు నెలలు గడిపితేకాని ఆ సంగతి తనకి అవగాహన అవలేదు.

అయితే నేడు నెలకొన్న పరిస్థితులలో సమాజానికి వ్యక్తిమీద కేవలం ఆసక్తి తప్ప ఇంకేమీ లేదన్నది వేరే విషయం.

కేతరీన్ బాహ్యంగా కనిపించేదానికి ప్రాముఖ్యత ఇస్తుంది. రోడ్డు మీద తిండి తింటూ నడవడం, భార్యాభర్తలు లేదా ప్రియులు చేతులు పట్టుకు నడవడం, ఇంకొకరి గురించి పట్టించుకోకుండా పబ్లిక్‌గా రోడ్లమీద ముద్దెట్టుకోవడం అమెరికాలో ఉన్నంతగా ఇంకే దేశంలో లేదని చెబితే నమ్మదు.

అథవా నమ్మినా అది వాళ్ల దురదృష్టం అంటుంది.

అలాంటి ధృక్పథం ఉన్న కేతరీన్ ఈ దేశం మనుష్యుల అంతరంగాలలో ఉన్న మంచితనం పసికట్టలేదు, అర్థం చేసుకోలేదు. అనుకున్నాడు సురేష్.

తలుపు తీసుకుని, ఇంటిలోనికి ప్రవేశించేరు మాధవరావ్, సురేష్‌లు.

హాలులో సోఫాలో టి.వి. రిమోట్ కంట్రోలర్‌తో కూర్చుని టెలివిజన్ చూస్తోంది ఓ పధ్నాలుగేళ్ల ఆడపిల్ల. పెద్ద శబ్దంతో టెలివిజన్‌లో అమెరికన్ పాప్ మ్యూజిక్ వస్తోంది. లోపలికి వచ్చిన సురేష్, మాధవరావ్‌లని చూసి,

"హాయ్" అంది.

"హలో" అన్నారు మాధవరావ్, సురేష్‌లు. తిరిగి టెలివిజన్ చూడడంలో నిమగ్నురాలయింది ఆ పిల్ల.

సురేష్, మాధవరావ్‌లు సోఫాలో సర్దుకున్నారు.

అమెరికాలో తయారయిన ఎమ్‌టివి ప్రసారం అవుతుండడం చూసి,

"ఇదేమిటి ఇక్కడ ఎమ్‌టివి వస్తోందా? ఇది అమెరికాలోనే సామాన్యంగా అందుబాటులో ఉన్న ప్రసారంకాదే. ఎక్కువ డబ్బు ఇచ్చి కొనుక్కుంటేకాని కేబిల్‌లో రాని ప్రోగ్రాం అది. శరీరం మీద నూటికి ఎనభై శాతం బట్టలులేని యువకులు, యువతులు డేన్సులు చేస్తున్న ఈ ప్రోగ్రాం రోజులో ఇరవై నాలుగు గంటలూ నడుస్తుంది నిరంతరంగా. అక్కడ నివశించేవారికి కూడా అతి జాగ్రత్తగా వినకపోతే పాటలలో ఉన్న పదాలు అర్థమవవు ఒక పట్టాన. పెద్దవాళ్లు, ఇంటిలో ఉన్న పిల్లలకి ఈ ప్రోగ్రాం అందుబాటులో ఉండకూడదని తెగ అవస్థపడతారు, కాని ఇదేమిటి ఇంత సామాన్యంగా ప్రసారం అవుతోంది" అని లోపల అనుకుంటూ ఆశ్చర్యంలో మునిగిపోయేడు సురేష్. జుగుప్సాకరంగా మన్మథలీలలకి ప్రాతిపదికగా మొదలుపెట్టే అంగ విన్యాసాలని చూసేసరికి మాధవరావ్‌కి దాదాపు మతిపోయినంత పనయింది.

"అమెరికా ప్రోగ్రాంలు ఇక్కడకి వస్తున్నాయే!" అన్నాడు సురేష్ ఊరుకోలేక.

"మాకు అన్నీ వస్తాయి. స్టార్ టివిలో జీటీవీలలో అమెరికన్ సోప్ అపేరాలు, సినిమాలు వేస్తారు. బోల్డ్ అండ్ ది బ్యూటిఫుల్ భలే థ్రిల్లింగా ఉంది. మీరు చూస్తారా?" అంది ఆ పిల్ల సంబరపడుతూ.

"ఇలాంటివి చూడడానికి మీ డాడీ, మమ్మీ అనుమతిస్తారా? నీకు హోంవర్క్ లాంటిది లేదా?" అనడిగేడు మాధవరావ్.

"రేపు శనివారం, మాకు స్కూల్ లేదు.

హోంవర్క్ రేపు, ఎల్లుండి చేసుకోవచ్చు, తొందరలేదు" అంటూ, "నన్ను ఇపుడు అనవసరంగా డిస్టర్బ్ చేయవద్దు" అన్న మొహం పెట్టి తిరిగి టెలివిజన్ చూడడంలో నిమగ్నురాలయింది ఆ పిల్ల.

స్త్రీలు ఉపరిభాగాన్ని, శరీరం మీద పురుగులుపడితే విదిలించుకున్నట్లు కదిలిస్తుంటే, సోఫాలో కూర్చున్న సురేష్, మాధవరావ్‌లు చూడలేక చెరొక న్యూస్‌పేపరు అందుకున్నారు. అరగంట గడిచేక బయట మోటారు సైకిల్ శబ్దం చేసుకుంటూ ఆగింది.

తలుపు తోసుకుని సుమారు ఐదడుగుల తొమ్మిదంగుళాల పొడవు, రివటలా ఉన్న కుర్రాడు లోపలికి వచ్చి హెల్మెట్ తీస్తూ సోఫాలో కూర్చున్న మాధవరావ్‌ని పోల్చి

"హలో అంకుల్" అన్నాడు.

"హలో మాధవ్" అన్నాడు మాధవరావ్.

"ఇతను మా అన్నయ్య కొడుకు సురేష్. అంటే నీకు కజినన్నమాట. అమెరికాలో ఉంటాడు. మీ డాడీ, మమ్మీ చెప్పే ఉంటారు" అంటూ సురేష్‌ని పరిచయం చేసేడు మాధవరావ్.

కుడిచేతిని గాలిలోనికి లేపి, "హాయ్" అన్నాడు మాధవ్.

చేయి ఊపుతూ, చిరునవ్వు నవ్వేడు సురేష్.

"బన్నీ, ఐ నీడ్ సమ్‌మనీ, వేర్ ఈజ్ మమ్మీ" అనడిగేడు మాధవ్ చెల్లెల్ని.

"ఐ డోంట్ హేవ్ ఎనీ" అని మొండి చెయ్యి చూపించింది ఆ పిల్ల.

"వై ఈజ్ షి లేట్ టుడే, డేమ్‌షిట్" అని విసుగుకున్నాడు మాధవ్.

ఇంటి వాతావరణం వింతగా ఉంది సురేష్‌కి.

ఈ పదహారేళ్ల కుర్రవాడు, ఆ పదమూడు పద్నాలుగేళ్ల కుర్రది, అమెరికాలో పెరిగే టీనేజర్స్‌ని గుర్తు తెచ్చేరు. తైల సంస్కారంలేని పొడవాటి జుత్తు, దిగజారిన మోచెంపలు, జిడ్డోడుతున్న మొహం, అప్పుడే మొలుచుకొచ్చిన సన్నని మీసం, బ్లూజీన్స్, అచ్చంగా అమెరికాలో పెరుగుతున్న కుర్రవానిలాగే ఉన్నాడు మాధవ్.

"రికీ దగ్గర ఉందేమో అడిగి చూస్తాను, ఐ విల్ బి బ్యాక్ ఇన్ ఎ మినిట్" అని తలుపు తీసుకుని బయటకి వెళ్లి మోటారు సైకిల్‌ని స్టార్ట్ చేసి ఒక్కసారి ఏక్సిలేటర్‌ని అమాంతం తిప్పడంతో ఇంజను సింహం గర్జించినట్లు శబ్దం చేసింది.

కనుమరుగయేడు మాధవ్.

జీన్స్ ప్యాంట్‌లోనికి తోసిన జీన్స్ చొక్కాతో విరబోసుకున్న జుత్తు, కాళ్లకి మేజోళ్లతో బన్నీ తన్మయత్వంతో టి.వి. చూస్తుంటే ఐదవుతుండగా ఇంట్లోకి వచ్చింది మృణాళిని.

మరోసారి మాధవరావ్ పరిచయాల్ని పూర్తి చేసేడు.

సోఫాలో కూర్చున్న బిన్నీ రిమోట్‌తో తటాలున టెలివిజన్ కట్టేసి వేళ్లకున్న రంగుని పరిశీలిస్తోంది.

"టీ తాగుతారా? " అంటూ టీ కలపడానికి లేచింది మృణాళిని.

"నా టీలో పంచదార కలపకండి" అన్నాడు సురేష్.

అందరూ టీ తాగుతూ కబుర్లు చెప్పుకుంటుంటే ఇంటికి ఎదురుగా ఉన్న రోడ్డుమీద ఏక్సిడెంట్ అయిన శబ్దం వినిపించింది.

"ఏమయిందా? " అని చూడడానికి కిటికీ దగ్గరకి అందరూ దాదాపు పరిగెత్తేరు.

రోడ్డుమీద తుత్తినియలై ఒక స్కూటర్, దానికి పది పన్నెండు అడుగుల దూరంలో ఒక వ్యక్తి చలనం లేకుండా క్రిందపడి ఉన్నాడు. ఆ స్కూటర్‌కి దాదాపు ముప్పయి అడుగుల దూరంలో ఒక లారీ నిలుచుంది. కిందపడి ఉన్న వ్యక్తి చుట్టూ జనం మూగుతున్నారు. కొన్ని వాహనాలు పడిపోయిన

వ్యక్తి గురించి పట్టించుకోకుండా వేగం తగ్గకుండా ప్రజలని తప్పించుకుని వెళ్తున్నాయి.

"అతను చచ్చిపోయి ఉంటాడు. లారీగుద్దితే మాటలా? పాపం!" అంది మృణాళిని.

ఇంటిలోంచి అందరూ ఆతృతగా ఏం జరుగుతుందోనని ఎదురుచూస్తున్నారు.

జన సమూహం పెరిగిందిగానీ ఇంకేమీ మార్పురాలేదు.

ఇరవై నిమిషాలు గడిచినా అతనికి వైద్య సహాయం రాకపోవడం చూసి, "అంబులెన్స్ ఇంకా రాలేదే" అన్నాడు సురేష్.

"ఎలా వస్తుంది? ఉన్న అంబులెన్స్ వాహనాలే తక్కువ. అవి ఎక్కడో ఉంటాయి. అదీకాక చూసేవా ట్రాఫిక్ రద్దీ? ఖాళీలేకుండా పరిగెడ్తున్న వాహనాలని తప్పించుకుంటూ అంబులెన్స్ రావడం అంత సామాన్యంకాదు. ఈ నెలలో ఇక్కడనేచూసిన యాక్సిడెంట్లలో ఇది మూడవది"

మరొక పది నిమిషాలలో అంబులెన్స్ వచ్చినా క్షతగాత్రుని దగ్గరకి వెళ్లడానికి వీలులేకుండా ఉంది. అంబులెన్స్ లైట్లని గాని, సైరన్ శబ్దాన్నిగాని ఎవరూ కాతరు చేయడంలేదు. ఆఖరికి పోలీసులు వచ్చి ట్రాఫిక్‌ని బలవంతంగా ఆపి దారి చేసేక అంబులెన్స్ దెబ్బలు తిన్న వ్యక్తిని ఎక్కించుకు వెళ్లింది.

"ఒళ్లు తెలియకుండా బళ్లని నడుపుతారు లారీవాళ్లు, మినీ బస్ డ్రైవర్లు. పొద్దున్న ఇంటి నుంచి బయలుదేరితే, సాయంకాలం తిరిగి ఇంటికి చేరుతామన్న నమ్మకంలేదు. బన్నీ మాధవ్ ఏడీ" అని కంగారు పడుతూ అడిగింది మృణాళిని.

"స్కూలునుంచి వచ్చి రికీ ఇంటికి వెళ్లేడు" అని సమాధానమిచ్చింది సోఫాలో కూర్చుని నవల చదువుతున్న బన్నీ.

★ ★ ★

పిల్లలు తొందరగా భోజనాలు కానిచ్చి వాళ్ల గదులలోనికి వెళ్లేరు.

అది చూసి సురేష్ రవ్వంత ఆశ్చర్యపడుతుంటే, "వాళ్ల గదిలో ఒక బ్లేక్ అండ్ వైట్ టెలివిజన్ ఉంది. ఇంటికి ఎవరైనా అతిథులు వస్తే హాలులో టెలివిజన్ నడుస్తుంటే సంభాషణకి ఇబ్బందని, వాళ్లు తమ గదిలో ఉన్న టివిల ప్రోగ్రాంలు చూస్తారు' అని వివరించింది మృణాళిని.

"మా దేశంలో ఎమ్ టివి ఛానల్ కావాలంటే నెలకి ఎక్స్‌ట్రాగా అద్దె కట్టాలి. అందరికీ అందుబాటులో ఉండదు. చాలామంది తల్లితండ్రులు, అది చూడడం అంత మంచిది కాదంటారు" అని సంభాషణ మొదలెట్టేడు సురేష్.

"అది చూడవద్దని మేమూ చెబుతాం. కాని ఏం చేయడం? పిల్లలు స్కూళ్లనుంచి పెందరాళే వస్తారు. వద్దన్నా దొంగతనంగా చూస్తారు. ఏ రోజైనా అది చూస్తూ పట్టుబడితే ఆవేళ ఒక్కరోజే చూసేమంటారు. టెలివిజన్‌కి తాళంవేసి వెళ్లలేంగా! అథవా అలా చేస్తే వాళ్లు స్నేహితుల ఇళ్లకి వెళ్లి చూస్తారు. దూరదర్శన్ ఛానెల్స్‌లో చూపించే వ్యవసాయదారుల ప్రోగ్రాంలు, ఇతర చెత్త చూసి చూసి విసుగేసి, కేబుల్ కనెక్షన్ తీసుకున్నాం" అంది మృణాళిని.

"అమెరికాలో చిన్నప్పటినుంచి ఆడామగా కలిసి తిరుగుతారు. గర్ల్‌ఫ్రెండ్, బాయ్‌ఫ్రెండ్లు అసామాన్యంకాదు. ఈ ఎమ్.టి.వి, సోప్ అపెరాలు నరాలని వేడెక్కించే సినిమాలు చూసి శారీరకవాంఛ ఉధృతం అయితే అది తీరే మార్గం ఉంది చాలామందికి. సంఘం దానిని సమర్థించకపోయినా, దానిమీద శీతకన్ను వేస్తుంది. ఇక్కడ అలా కాదే! అలాంటి వాతావరణంలేనిచోట ఇలా చేస్తుంటే కొంతకాలానికి విపరీత పరిణామాలకి దారితీస్తాయి, ఔనాకాదా? " అనడిగేడు సురేష్.

"భార్యాభర్తలు ఇద్దరూ పనిచేస్తుంటే ఈ ఇబ్బందులు ఎక్కువ. పిల్లలు చెప్పిన మాట వినరు. మరీ ఒత్తిడితెస్తే ఇంకెక్కడికో వెళ్లి చూస్తారు. ఒకందుకు సంతోషించాలి.

పిల్లలు చదువులు బాగానే చదువుతున్నారు" అన్నాడు రామమూర్తి.

"ఈ కేబుల్ ప్రోగ్రాంలు పెద్ద పట్టణాల్లోనే కాదు, ఓ మోస్తరు చిన్న పట్టణాల్లోనూ వెలిసేయి. రోజుకి ఒకటో, రెండో సినిమాలు వేస్తారు. అంటే నెలకి ఎంతలేదన్నా చచ్చుబాపతు నలభై సినిమాలు వేసుకోండి. కేబిల్ ఖరీదు నెలకి వంద రూపాయలు. ఇంటిలో ఉన్న ఆడవాళ్లకి ఈ కాలక్షేపం చాలా తక్కువలో లభ్యమవుతోంది" అంది మృణాళిని.

"ఇంటికి రాగానే భార్యని ముద్దెట్టుకుని ప్రేమ నటించిన భర్త, ఆఫీసులో ప్రేమాయణం సాగిస్తున్నాడని చూసిచూసి, సాధారణ ఇల్లాలు ఆలోచన క్రమంగా వక్రంగా మారే అవకాశం ఉంది. అప్పుడు ఏమవుతుంది? "

"ఏమో బాబూ భయంగా ఉంది. ఇద్దరూ వెళ్లి ఆర్జిస్తేగాని పిల్లలకి మంచి చదువులు కూడా చెప్పించలేని స్థితిలో ఉన్నాం. తొందరగా చదువు పూర్తయితే బన్నికి పెళ్లి చేసేస్తే ఏదో కొంత ఆందోళన తగ్గుతుంది" అంది మృణాళిని.

"రేపు మన మందరమూ కలిసి బయటకి వెళ్లి డిన్నర్ తిందాం. పిల్లలకి చెప్పండి" అన్నాడు సురేష్.

"వాళ్లు అప్పుడే రేపటికి ప్రోగ్రాం ఏదైనా వేసుకుంటే చెప్పలేం! అయినా చెబుతాను" అంటూ లేచింది మృణాళిని.

"గుడ్‌నైట్, మీ గదిలో హీటర్ పెట్టేం, లేకపోతే మాధవరావ్ చలో అంటూ కొంకర్లు తిరిగిపోతాడు" అంటూ నిలబడ్డాడు రామమూర్తి.

"గుడ్‌నైట్"

కొత్త ప్రదేశంలో ఒక పట్టాన నిద్రపట్టదు సురేష్‌కి. డైనింగ్ టేబిల్‌మీద కూర్చున్నపుడు నడిచిన సంభాషణ నెమరువేసుకున్నాడు.

రామమూర్తి, మృణాళినిలు మంచి దంపతులులాగే ఉన్నారు.

కాని వాళ్లు పిల్లలని సరిఅయిన విధంగా సరిదిద్దుతున్నారా? కావలసిన దానికన్నా ఎక్కువ స్వతంత్రం ఇస్తున్నారేమో! పిల్లలకి ఎంత స్వతంత్రం ఇవ్వాలి? ఎక్కడైనా రాసి పెట్టి ఉందా?

'చదువు బాగానే చదువుతున్నారు' అని ఇద్దరూ తృప్తిపడుతున్నారు.

"చదువు అయిపోగానే పెళ్లి చేసేస్తే ఆందోళన తగ్గుతుంది" అంది మృణాళిని. పెంపుదల సరిగ్గా లేకపోతే, జీవితం అంటే సరిఅయిన ధోరణి అలవరచుకోకపోతే సమస్య తమ దగ్గరనుంచి ఆ పెళ్లి చేసుకున్న వ్యక్తికి మారుతుందన్నది వాళ్లు గ్రహించలేదేమో!

చదువు తప్ప ఇంకేమీ అక్ఖరలేదా? ఇతర విషయాల మాటేమిటి? సంస్కృతి, సాంప్రదాయం తెలుసుకోకుండా, ఇంగ్లీషు సినిమాలు, ఎమ్‌టివిల ప్రభావం వలన అలాంటి దశలోనే ఉన్న ఇంకొకరితో స్నేహం మోతాదుకి మించి పెరిగి శారీరక సంపర్కం ఏర్పరచుకున్నాక ఏదైనా అనుకోని అవాంతరం జరిగితే? దానికి ఎవరు బాధ్యులు?

తీరుబడి లేక వాళ్లని వదిలేసిన తల్లితండ్రులదా?

ప్రభుత్వానిదా? సమాజానిదా?

సంస్కృతి, సాంప్రదాయం!

పాశ్చాత్య సంస్కృతిని, సాంప్రదాయాల్ని అనువు కానిచోట ప్రతిష్ఠింపచేస్తూ, మంచి విలువల్ని కలిపేసుకుంటున్నారు! అని విచారపడుతూ కళ్లు మూసుకున్నాడు సురేష్.

వెచ్చగా ఉన్న గదిలో మాధవరావ్ గురక మెల్లిగా శబ్దాన్ని పుంజుకుంటోంది.

'రేపు పోస్టాఫీసుకి వెళ్లి సంధ్య ఆంటీకి ఉత్తరం రాసిపడేయాలి' అనుకుంటూ నిద్ర

లోకి ఒరిగేడు సురేష్.



సంధ్య ఆంటీ'గారికి,

ఈ ఉత్తరం నేను ఇండియా వదిలి అమెరికా వెళ్లేముందర ఢిల్లీనుంచి రాస్తున్నాను. చాలా కాలంక్రితం మా డాడీ రాసిన డైరీలు చదివిన తరువాత ఇండియా రావాలనిపించింది. ఇతర విషయాలే కాకుండా ఆ డైరీలో మీ గురించి చాలా ఉంది.

ఆ డైరీలని దీనితోపాటు జతపరుస్తున్నాను. మీరు వాటిని చదువుతారనే ఆశిస్తాను.

ఈమధ్య 'ఫర్ మై ఫాదర్' అన్న సినిమా చూసేను. అది యధార్థంగా జరిగిన కథ మీద ఆధారపడి తీసిన సినిమా.

ఒక ఐరిష్ యువకుడు, లండన్‌లో ఉండగా అక్కడ బాంబుప్రేలుడు సంభవించి కొందరు మరణిస్తారు. ఈ యువకుడు ఉద్యోగం లేకుండా జులాయిగా తిరుగుతూ, ఆ బాంబు ప్రేలుడు జరిగిన ప్రదేశానికి దగ్గరగా ఉన్నాడని పోలీసులకి తెలిసి, అతనిని ఖైదు చేస్తారు. టెర్రరిస్ట్ అన్న ముద్రవేసేక కొన్నాళ్లు తరువాత అతని తండ్రిని కూడా బంధించి ఒకే జైలులో ఉంచుతారు. కొడుకికి తండ్రికున్న పురాతన భావాలంటే చిన్నచూపు, కాని జైలులోఉన్న ఇతర ఖైదీలు తండ్రిని కలిసి అతని సలహా పొందడం చూసి క్రమేణా తండ్రంటే చిన్నచూపు పోయి గౌరవం, అభిమానం పెరుగుతాయి. తండ్రి వ్యాధిగ్రస్థుడయినా, జైలు అధికారులు పట్టించుకోకపోవడంతో తండ్రి టెర్రరిస్ట్ అన్న ముద్రతో జైలులో చనిపోతాడు. తండ్రి గతించేక కొడుకు పదేళ్లు కష్టపడి మానవత ఉన్న ఒక బ్రిటిష్ లాయరు సహాయంతో తండ్రికి, తనకి ఆపాదింపబడిన టెర్రరిస్ట్ అన్న చెడ్డ పేరుని పోగొడతాడు. ప్రభుత్వానికి తాము టెర్రరిస్టులం కామని తెలిసినా, అది ఒప్పుకుంటే ప్రభుత్వం పరువుపోతుందని, జైలులో మగ్గనిచ్చేరని నిరూపించి విడుదలవుతాడు.

చనిపోయిన తండ్రిపేరు టెర్రరిస్ట్ జాబితాలో ఉన్నా లేకపోయినా తేడా ఏముంది? అని కొందరికి అనిపించవచ్చు కాని కొడుకు అలా ఆలోచించడు.

'తండ్రి పేరుకి అంటుకున్న చెడ్డపేరు పోవాలి' అన్నదే ఎంతసేపూ అతని ధ్యాస. మా డాడీ డైరీలు చదివినపుడు సుమారు అలాంటి అలజడే కలిగింది.

చాలాకాలం క్రితం మీరంటే ఎంతో ఇష్టపడి, మిమ్మల్ని వివాహమాడుతాడనుకున్న వ్యక్తి కాకినాడ వదిలేక ఎందుకు వెనుకంజ వేసేడో తెలియక, మీరు ఏదేదో ఊహించుకుని ఉండవచ్చు అది ఈనాటికీ సడలకుండా అలాగే ఉందేమో!

తండ్రికి వచ్చిన చెడ్డపేరు లోకానికి తెలిసింది. అందుచేత అది పోగొట్టడానికి కొడుకు కష్టపడడంలో సబబు ఉంది. కాని 'మీ తండ్రి వ్యవహారంలో అలాంటిదేమీ లేదు, అనవసరం ఇదంతా' అని మీరు కొట్టిపారేయవచ్చు

కాని ఉంది. మనం ప్రతీదీ కీర్తికోసం చేయనవసరంలేదు. ఇది లోకం గురించి కాదు, మీ గురించి. ఈ డైరీలు చదివితే ఆయన ఎదురుగా ఎటువంటి చిక్కుపరిస్థితులు మొలిచేయో అవగాహన అవుతుంది. నేను మిమ్మల్ని కలిసినపుడు ఈ విషయం

ప్రస్తావించబోతే మీరు విముఖత ప్రదర్శిం చేరు, ఊరుకున్నాను.

ఆ డైరీలు ముఖ్యంగా రాసుకున్న వ్యక్తికి, వాటిలో పదేపదే ఉదహరించిన మీకు సంబంధించినవి. రాసిన వ్యక్తిలేడు. ఇహ మిగిలింది మీరు. మీరు వాటిని ఏం చేస్తారో మీరే నిర్ణయించుకోండి. మీ ఆరోగ్యం కుదుటపడిందని తలుస్తాను.

నమస్కారాలతో

సురేష్.

ప్రొద్దున్న వచ్చిన పార్సెల్ పాకెట్‌లో ఉన్న డైరీలు అలాగే ఉన్నాయి. ఏం చేయాలో తెలియక గింజుకుంటూ రోజంతా గడిచింది.

సుబ్బారావు డైరీలు, ఇంత ఆసక్తితో రాసే వాడని తనకి తెలియదు. డిసెంబర్ మాసం వచ్చినపుడు తనూ రమేష్, సుబ్బారావులు పుస్తకాల దుకాణాలకి వెళ్లేరు.

"డైరీలు చూపించండి" అన్నాడు సుబ్బారావు.

ఎన్ని డైరీలు చూపించినా అతనికి నచ్చక పోవడం చూసి అందరికీ విసుగొచ్చింది.

"నా ఊహలో ఉన్న డైరీ మీ దగ్గరలేదు" అంటూ బయటకి నడిచేడు. ఊపిరి పీల్చుకున్నారు తనూ, రమేష్.

మరో పది రోజుల తరువాత బొమ్మలతో ఉన్న డైరీ సుబ్బారావు చూపించినపుడు దాని అందం చూసి ముచ్చటవేసింది.

సంధ్య మెదడు గతంలోకి పరిగెత్తింది మరోసారి.

సురేష్ ఉత్తరంలో రాసినట్లు, కాకినాడ వదిలిన తరువాత సుబ్బారావు విచిత్ర ధోరణి తనని తెగ ఆలోచింపచేసింది.

ఉత్తరాలు రాయడం చేతకాక రాయలేదని అనుకుంది కొన్నాళ్లు. కాని వెన్వెంటనే, డైరీ రాసేవ్యక్తి ఉత్తరాలు రాయలేకపోవడమేమిటి? అని దానిని కొట్టి పారేసింది.

ఒకవేళ మేనరికం, ఇంటిలో ఎదిగిన ఆడ పిల్ల పెళ్లికి ఉండడం లాంటి అడ్డంకులు ఉండి తన గురించి ఆలోచన అప్రస్తుతం అని వాయిదావేసేడా? అని ఆలోచించి చూస్తే అలాంటిదేదీ లేదని తెలిసింది.

సుబ్బారావు తల్లితండ్రులకి కట్నం ఆశ ఉందేమో! అది తెలిసి, సాంప్రదాయం అంటే విలువిచ్చే సుబ్బారావు గుడ్డిగా, తల్లి తండ్రులని నొప్పించడానికి ఇష్టంలేక మౌనం వహించేడేమో!

తనకి తెలిసిన సుబ్బారావు, గుడ్డిగా సాంప్రదాయాలని పాటించే మనిషి కాదే!

ప్రతీరోజూ తను అనుమానపడుతున్న కారణాలని తిరగతోడుతూ, ఆఖరికి సుబ్బారావుకి తనతో స్నేహం తప్ప ఇంకే ఆలోచనా లేదన్న తీర్మానానికి వచ్చింది.

నచ్చని ఆ తీర్మానం తనని తెగ ఇబ్బంది పెడుతుంటే రోజులు భారంగా గడిచాయి.

దూరపు బంధువైన రమేష్, తల్లిదండ్రుల ద్వారా తనని పెళ్లి చేసుకునే ఉద్దేశం ఉందని తెలియపరిస్తే అందరికీ నచ్చిన రమేష్‌లో ఎత్తిచూపించడానికి ఏ లోపాలూ కనిపించకపోవడంతో, పెళ్లికి ఒప్పుకుంది. ఈ విషయం తెలిశాక రమేష్‌కి సుబ్బారావు, శుభాకాంక్షలు పంపాడని తెలిశాక తను ఊహించుకున్న గతాన్ని ఆవలికి నెట్టింది.

రమేష్‌తో వివాహం జరిగాక, సుబ్బారావు వచ్చినప్పుడు అతనితో ఏకాంతం సాధ్యపడలేదు. కాలం వెళ్తుంటే, ఆ శేషప్రశ్నకి సమాధానం వెతకడంలో అర్థంలేదని విరమించుకుంది. సుబ్బారావు, రమేష్‌ని తనని చూడడానికి ఎప్పుడు వచ్చినా, అంతకుముందులా తన కళ్ళలోనికి చూసేవాడు కాదు.

రమేష్ మంచి భర్త.

"ఇంటిలో కూర్చుని రోజంతా పనిలేకుండా గడిపేకంటే ఏదైనా ఉద్యోగం వ్యాపకానికి చేయకూడదూ? " అనంటే అలాగే చేరింది.

వాహిని ఈ లోకంలోనికి రావడం, దాని పెంపకం, దాని గురించి వ్యాకులపాటుతో రోజులు గడిచేయి.

మూడేళ్ళక్రితం, హుషారుగా రమేష్ స్నేహితులతో సముద్ర స్నానానికి వెళ్లి పీనుగై ఇంటికి వస్తాడని ఎప్పుడూ ఊహించలేదు. అనుకోని పరిణామం అది.

మెదడంతా మొద్దుబారిపోయాక, రెండు నెలల తరువాత మామూలయి డిగ్రీ పాసయిన వాహినిని తన స్థానంలో ఇరికించి ఉద్యోగంలోంచి తప్పుకుంది.

వంటింటిలోంచి పిల్లి గిన్నె తోసిన శబ్దం విని, ఆలోచనల్ని కప్పిపెట్టి పిల్లిని తోలి తిరిగి పరుపుమీదకి చేరింది.

ఎదురుగా పాకెట్‌లో డైరీలు!

లేచి తలుపు గడియపెట్టి డైరీలని అందుకుంది సంధ్య. సుబ్బారావు కాకినాడ వదిలిన సంవత్సరం డైరీ మొదట తెరచింది. పేజీలు తిప్పుతూ ఢిల్లీ వెళ్ళినరోజు పేజీ దగ్గర ఆగి చదవడం మొదలుపెట్టింది.

"విడిపోవడంలో విషాదాన్ని, కలయికలో ఆనందాన్ని మవునం వ్యక్తపరచినంత గంభీరంగా ఇంకేదీ వ్యక్తపరచలేదు" అన్నారు వెనకటికెవరో మహానుభావుడు. ఎంత సరిగ్గా వివరించాడో తన బాధని.

కాకినాడ రైలుస్టేషనులో సంధ్యని వదలి సర్కార్ ఎక్స్‌ప్రెస్ నన్ను తీసుకెళ్తానని తొందరపడుతూ బయలుదేరుతుంటే, దిగులుతో వాడిన మొహం, సంధ్య కంటిలో తిరిగిన నీరు, మౌనం చూసి ఎంత బాధపడ్డానో కాని దూరం వెళ్ళిపోతున్నా, ఆమె మదిలో ఉన్న భావం అవగాహన అయిన నాకు కొండంత ధైర్యం వచ్చింది. ఆ ధైర్యమే తన చేత ఆమె చేయిని నొక్కించింది. ఢిల్లీ వెళ్ళాక తీరుబడి చూసుకుని, మనసులో ఉన్న ఊహలు ఆమెకి తెలియపరచాలి.

★ ★ ★

ఈవేళ లంచ్ సమయంలో ఆఫీసులో టైపిస్ట్ కూనిరాగం తీస్తోంది, ఎవరూ వినడం లేదనుకుని. పరవాలేదు, కాని దానిలో సంధ్య కూనిరాగంలో ఉన్న మార్దవత్వం లేదు. ఐదడుగుల నాలుగంగుళాల సన్నని శరీరాకృతితో సన్నని పొడవాటి కంఠంలోంచి జీరలు లేని కూనిరాగం అప్పుడప్పుడు పెదిమలు మూసేసినప్పుడు బయటపడిన పదములు లేని కూనిరాగం!

★ ★ ★

ఈవేళ అనుకోకుండా పొద్దున్నే లేవాల్సివచ్చింది. పార్క్‌లో నడకకి బయలుదేరాను. సరుగుడు చెట్లతోపు ఒకవైపు, పచ్చని పచ్చిక, పూలమొక్కలు రెండవవైపు. చలిగాలి సరుగుడు చెట్లని ఊగిస్తూ పరుగెడుతూ శబ్దం చేస్తోంది. పచ్చికమీద మంచుబిందువులు, ఎక్కడ చూసినా మంచుబిందువులే. సూర్యుడు మీదకి లేస్తుంటే, సూర్యకిరణాలు మంచుబిందువుల మీద పడి ప్రత్యేకమైన శోభని ప్రదర్శిస్తున్నాయి. చెట్లమీదనుంచి వచ్చే కూనిరాగం లాంటి గాలి, మెరుస్తున్న నీటిబిందువులు ఆమెనే జ్ఞాపకానికి తెస్తున్నాయి. సంధ్య ఎలా ఉందో!

★ ★ ★

దగ్గు, ఎడతెరిపిలేని దగ్గు. కాకినాడ వదలినప్పుడు మొదలయిన దగ్గు క్రమేణా పెరిగింది. సాయంకాలమయ్యేసరికి జ్వరం చెప్పలేనంత బలహీనత. రేపు అశ్రద్ధ చేయకుండా డాక్టరుని సంప్రదించాలి. సంధ్యకి ఉత్తరం రాద్దామన్నా ఓపిక రావడంలేదు. సంధ్య తన దగ్గరనుంచి ఉత్తరం కోసం ఎదురుచూస్తూ ఉంటుందేమో. ఇంకా ఎందుకు రాలేదా? అని ఆశ్చర్యపడుతుందేమో.

★ ★ ★

దగ్గు, జ్వరానికి కారణం, ఎక్స్‌రే తీసి రక్త పరీక్ష చేశాక కాని తెలియలేదు.

క్షయ.

డాక్టరు ఆ సంగతి చెప్పాక గుండె బేజారయింది. ఆ దుర్వార్త విన్నాక, మొట్టమొదట ఆలోచనలోనికి సంధ్య వచ్చింది. ఇది ఇంటికి ఎలా రాయడం? సంధ్య సంగతి

ఏమిటి?

★ ★ ★

ఢిల్లీ చేరగానే, తనకి ఆమెని పెళ్లి చేసుకునే ఉద్దేశం ఉన్నట్లు సంధ్యకి వెంటనే రాయకపోవడం మంచిదయింది. గుడ్డిలో మెల్ల అంటారు ఇదే కాబోలు.

తను రాసి ఉంటే తరువాత ఈ క్షయ విషయం ఆమెకి తెలియపరచినప్పుడు ఎలా రియాక్ట్ అయ్యేదో! జుగుప్సతో వణుకుతుందా? లేక జాలిపడుతుందా? దీని లోంచి ఎలా బయటపడడం? అని మార్గాలకోసం వెతుకుతుందా?

ఛ! సంధ్య అలా ఎన్నటికీ చేయదు.

ఢిల్లీ వచ్చి అప్పుడే నాలుగు నెలలయింది. సంధ్యకి ఎప్పుడు తెలియపరచడం?

రేపు డాక్టర్‌ని దీని గురించి సాంతం సంప్రదించాక ఉన్న విషయం రాసేయాలి సంధ్యకి. ఏమని రాయడం? బాగున్నానని మొదలుపెట్టిన ఉత్తరంలో, టి. బి. వచ్చిందని ఎలా ఇరికించడం? సంధ్యా, నా ఈ బలహీనతకి, ఈ ఆలస్యానికి నన్ను క్షమిస్తావుకదూ?

★ ★ ★

ఇంజక్షన్ల ప్రభావంవలన దగ్గు కాస్త తగ్గింది. మరో రెండు నెలలు వరుసతప్పకుండా ఇంజక్షన్లు పుచ్చుకున్నాక, మళ్ళీ ఎక్స్‌రేతీసి తన అభిప్రాయం చెబుతానన్నాడు డాక్టరు. తను చెప్పినదంతా విని అనవసరంగా తొందరపడవద్దని, కంగారుపడనవసరం లేదన్నాడు. పూర్తిగా వ్యాధినివారణకి ఎంతలేదన్నా ఒక సంవత్సరం పడుతుందిట. ఆలోచించి వారాంతానికి సంధ్యకు తెలియపరుస్తాను.

★ ★ ★

క్షయ అని రాయడానికి చేతులు రాలేదు.



ఇది సంధ్యకి అన్యాయం చేసినట్టే కాని ఏం చేయను? బలహీనత! బలహీనత!

★ ★ ★

ఇంజక్షన్లని ఆపి, టాబ్లెట్లలోనికి మార్చాడు డాక్టరు.

సంధ్యకి రాయడంలో తప్పులేదు. సంధ్య అర్థం చేసుకుంటుందన్న నమ్మకం నాకుంది.

★ ★ ★

మళ్ళీ జ్వరం. తిరిగి ఇంజక్షన్లు! వ్యాధి తిరిగి ఉధృతమవుతున్నట్లుంది.

ఇప్పుడు ఏం చేయాలి?

పెరటిలో పచార్లు చేస్తూ, జుత్తుని పీక్కుంటూ నా ఈ ఎనిమిదినెలల మౌనాన్ని ఎలా అర్థం చేసుకుంటోందో సంధ్య!

★ ★ ★

సంధ్య తనని పెళ్లి చేసుకుంటుందేమోనని, తల్లిదండ్రుల ద్వారా అడిగించబోతున్నానని రమేష్ రాసిన ఉత్తరం చదవగానే కాళ్ళకింద భూమి కదులుతోందని అవగాహన అయింది.

సంధ్యని పెళ్లి చేసుకుందామన్న ఊహ నాకూ ఉందని రాసేదా?

ఈపాటికి, రమేష్ ప్రతిపాదనకి సంధ్య ఒప్పుకుని ఉంటే?

అనవసరంగా తను బైటపడతాడు. అదీ కాక తనకి క్షయ! తనలాంటి క్షయ పేషెంట్‌కి సంధ్యని కోరే అర్హత ఉందా? అసలు క్షయ పేషెంట్లు పెళ్లికి అర్హులా? క్షయ వ్యాధి వచ్చి తగ్గాక ఎన్నాళ్లు గడిచేక పెళ్లి చేసుకోవచ్చు?

★ ★ ★

"అవాంఛనీయమైన సంఘటన జరిగే అవకాశం ఉంటే అది ఆలస్యమవకుండా వెంటనే జరుగుతుంది" అంటాడు మర్ఫీ. రమేష్, సంధ్య తనతో పెళ్లికి ఒప్పుకుందన్న ఉత్తరం ఈవేళ చదివేక మర్ఫీ అన్నది నిజమేననిపించింది. సంధ్య ఇక రమేష్ భాగస్వామి. సాంప్రదాయం ప్రకారం ఆమెని నా

తలపులలోంచి తప్పించాలి.

కాని ఎలా?

పగలంతా కళ్ళముందరే నిలిచే సంధ్య, రాత్రంతా రెప్పలకింద తారట్లాడే సంధ్యని ఎలా మరవడం?

★ ★ ★

ఈవేళ రమేష్, సంధ్యల పెళ్లి.

అనుకోకుండా పేజీ తిరగబడి అధ్యాయం ముగిసింది.

★ ★ ★

డైరీని మడిచి పాకెట్‌లోనికి సర్దింది సంధ్య.

ధైర్యం చేయలేక నిర్ధారణగా ఏం చేయాలో అవగాహనకి రాక ఎంత అవస్థపడ్డాడో పాపం! అనుకుంటూ స్టౌ వెలిగించి, బ్రూకాఫీ కలుపుకుంది సంధ్య.

జీవితాలన్నీ కథలే!

సురేష్ పంపిన పాకెట్‌లో పన్నెండు డైరీలు మాత్రమే ఉన్నాయి.

సుబ్బారావు డైరీలు ఏ సంవత్సరంలో ఆపుచేశాడు? ఎందువలన ఆపుచేయాల్సి వచ్చింది? అనుకుంటూ డైరీలని తిరిగి బైటకి తీసింది. అందంగా ఉన్న డైరీలు అందమైన తొడుగులున్న డైరీలు.

డైరీలలో ఆఖరి సంవత్సరం డైరీని అందుకుని పేజీలు గబగబా తిప్పింది.

"ఒకరి డైరీలు ఇంకొకరు చదవకూడదన్న కనీస జ్ఞానమైనా ఉండదు కొందరికి. డైరీలు రాయడం అంతమంచిది కాదేమో! డైరీలలో గతం ఎలాంటి అనర్థాలకి దారితీస్తుందో? డైరీలు రాయడానికి స్వస్తి చెప్పక తప్పదు"

అర్థమైంది సంధ్యకి.

సుబ్బారావు పిరికివాడా? లేక సరిఅయిన నిర్ణయం తీసుకున్నాడా? ఏదిఏమైనా,

జీవితంలో వెలితిఉందని, ఆ వెలితిని పూడ్చిన వ్యక్తి తటస్థపడితేగాని మనకి తెలిసిరాదు. జీవితం చాలా విచిత్రమైనది. చిత్రమేమిటంటే వెనక్కితిరిగి చూస్తే ఇలాంటి వెలితితో జీవితం ఎలా గడిచిందా? అని ఆశ్చర్యమేస్తుంది.

తిరిగి డైరీలను చదవసాగింది సంధ్య.



"మీ నాన్న అమెరికా వెళ్ళి స్థిరపడి చాలా కాలమైంది. నువ్వు దాదాపు పూర్తిగా అక్కడే పెరిగినా, ఢిల్లీలో నువ్వు విమానం దిగినప్పుడు మాటలాడిన తెలుగుకి, ఈరోజు మాటలాడుతున్న తెలుగుకి చాలా వ్యత్యాసం ఉంది. ఈ ఐదు నెలల్లో బాగా తెలుగు నేర్చుకున్నావు. రాత్రి అమెరికా తిరిగి వెళ్తావు. మళ్లీ ఎప్పుడో కలుస్తాం. ఇప్పటివరకు నీ వ్యక్తిగత విషయాల గురించి నేను అడగలేదు. రెండు ప్రశ్నలకి అభ్యంతరం లేకపోతే సమాధానమియ్యి.

"ఒకటి, నీకు ఈ దేశం వచ్చినందుకు ఆనందంగా ఉందా? లేదా?

"రెండు, కేతరీన్‌తో నీ వివాహం ఎందుకు. విచ్ఛిన్నమైంది? సర్దుకోలేకపోయావా?"

న్యూఢిల్లీలోని లోడీ హోటల్‌లో సూపులో చెంచాను ముంచి, సూపుని చప్పరిస్తూ సురేష్‌ని అడిగాడు మాధవరావ్.

"మొట్టమొదట కేతరీన్ గురించి రెండు ముక్కలు చెబుతాను.

యూనివర్సిటీలో చదువుకునే రోజుల్లో,

నేను ఎమ్.ఎస్. చేస్తున్నప్పుడు, లైబ్రరీలో, కంప్యూటర్ సెంటర్‌లో ఎదురుపడ్డప్పుడు కేతరీన్ పరిచయం అయింది. తను నాకు ఒక సంవత్సరం జూనియర్. తెలియనివి అడిగి చెప్పించుకోవడం, కలిసి కాఫీలకి, సినిమాలకి వెళ్ళడం జరిగినప్పుడు, చనువు ఏర్పడి, శారీరక సంబంధం ఏర్పడగానే ఒకసారి డేడీతో మాట్లాడేను.

"అంతవరకు నడిచేక, ఇష్టపడితే పెళ్లి చేసుకోవడం తనకి తెలిసిన ఆనవాయితీ" అన్నారు.

"మేం దూరం ఆలోచించకుండా పెళ్లి చేసుకున్నాం. తరువాత ఇద్దరం కలిసి నివసిస్తున్నప్పుడు ఆమె ప్రపంచం వేరు, నా ప్రపంచం వేరనీ, ఉమ్మడి ప్రపంచం లేదనీ గ్రహించడానికి అట్టేకాలం పట్టలేదు.

"ఎవరికివారే, మా ప్రపంచాలని వదిలి బయటకి రావడానికి ఇష్టం లేకపోవడంతో దారులు వేరయ్యాయి.

"స్వతంత్రం" అన్న పునాదిమీద మొలిచిన ఆ దేశంలో "నేను ఎందుకు రాజీపడాలి? " అన్న ప్రశ్నే ఉద్భవిస్తుంది కాని, "నేను ఎందుకు రాజీపడకూడదు? " అన్న సామరస్యధోరణి చాలా తక్కువ.

"రాజీపడడం అంటే ఓడిపోవడం అనుకుంటారు కొందరు.

"కేతరీన్ చాలా అందంగా ఉంటుంది. అది నిజం.

"కానీ కేవలం అందమే కాపురాలని నిలబెట్టదు అన్నదానికి నిదర్శనం అమెరికన్ హీరోయిన్ ఎలిజబెత్‌టెయిలర్.

"ఆవిడ ఎనిమిదిసార్లు పెళ్లి చేసుకుంది నిజజీవితంలో!"

అంటూ ఆగి, సూపుని చెమ్చాతో తీసి నోటితో చప్పరించాడు సురేష్.

మాధవరావ్ మాట్లాడలేదు.

సూపుని ఖాళీచేసి తిరిగి మొదలెట్టాడు సురేష్.

"నువ్వడిగిన మొదటి ప్రశ్నకి నేనిచ్చే సమాధానం నీకు నచ్చకపోవచ్చు.

"నేను ఈ దేశం సరిగ్గా జ్ఞానం తెలియని వయస్సులో వదిలిపెట్టాను. అంటే అప్పటి రోజుల గురించి నాకు ఏమీ తెలియదు. నాకు తెలిసినది, పేపర్లలో చదివినది, మా డేడీ రాసిన డైరీలవల్ల, అక్కడ పార్టీలకి వెళ్ళినప్పుడు ఇతర ఇండియన్లు చర్చలవల్ల తెలుసుకున్నదే.

"డేడీ డైరీలలో పదిలపరచుకున్నవి నలభై ఏళ్ళనాటి జ్ఞాపకాలు, అనుభూతులు.

"అటు ప్రపంచం, ఇటు ఇండియా ఈ నలభైఏళ్లలో చాలా మారిపోయింది. డేడీ ఊహలకి, ఈనాటి నిజానికి పొంతనలేదని నాకు త్వరలోనే అవగాహన అయింది.

"మీ అందరితో పరిచయమై, మీరు నేనంటే చూపించిన ఆసక్తి చూస్తే చాలా సంతోషం కలిగింది. మా డేడీ తన డైరీలలో ఉదహరించినట్లు, మీ అందరిలో ఆ ఆప్యాయత చూశాను.

"కాని ఆ ఆనందం, చుట్టూ ఉన్న ఇతర ప్రపంచాన్ని చూసినప్పుడు, అట్టేసేపు నిలబడలేదు.

"ప్రతీ సమస్యకి వెంటనే పరిష్కారం కనబడకపోవచ్చు, ఉండకపోవచ్చు కూడా. నాకు ఏదైనా సమస్యలా కనిపించినప్పుడు, నేను ఏదో పరిష్కారమార్గం సూచించబోతే, ఒకటి, రెండుసార్లు అంతగా విన్న ప్రసాదు ఏమన్నాడో తెలుసా?

"అబ్బ! నీతో పెద్ద చిక్కు అన్నయ్యా, ప్రతీదానికి లాజిక్ వాడతావు" అని

"అదొకటే కాదు.

"నేను బాంక్‌కి వెళ్ళి రెండువందల డాలర్లని రూపాయలలోనికి మార్చవలసివచ్చినప్పుడు పడిన ఇబ్బందిని చూసి, ఆ బ్యాంక్ మేనేజరుకి ఏదో వివరించబోతే,

"సార్, మీ పద్ధతులూ ఇక్కడ పనిచేయవండీ. మా మానాన మమ్మల్ని బ్యాంక్

నడపనీయండి" అన్నారు.

"నోరు మూసుకున్నాను.

"అంతెందుకు, మన ఇంటిలో జరిగే ఒక చిన్నపనిని ఉదాహరణగా చెబుతాను. ఇంటిలో చెత్తని ఊడ్చి పనిమనిషి రోడ్డుమీదకి చీపురుతో నెట్టడం నేచూశాను. అది వెళ్ళి పక్కని ఉన్న కాలవలో పడింది. రెండురోజులయ్యేసరికి ఆ చెత్త ఇతర చెత్తతో కలిసి, నీటిని అటకాయిస్తుంటే, కంపు పెరిగాక మీరు రిపోర్టిస్తే మునిసిపాలిటీ మనిషి పారతో వచ్చి, ఆ చెత్తని కాలవలోంచి తీసి బయటవుంచి వెళ్ళిపోయాడు. వానపడింది మళ్లీ. తిరిగి ఆ చెత్త కాలవలోనికి చేరి డ్రైయిన్లు పూడ్చుకుపోయి రోడ్డుమీద నీళ్లు నిలబడి వుండిపోయాయి. ఆ కుళ్ళు నీళ్ళలోనే ప్రజలు గత్యంతరం లేక నడిచివెళ్తున్నారు.

"మనపని అయిపోవాలి, అంతే. అదే ధోరణి ఎక్కడ చూసినా.

"ఇక్కడే ఏమిటి, అమెరికాలోనూ మన దేశస్థులు ఇలాంటి ధోరణే ప్రదర్శిస్తారు.

"నేను ఈ దేశం వచ్చేముందు ఒక స్నేహితుడు భోజనానికి పిలిస్తే అతనింటికి వెళ్ళాను. ఆవేళ నేనేకాక చాలామంది పార్టీకి వచ్చారు. అందులో ఇద్దరు డాక్టర్లతో మొదటిసారి పరిచయం అయింది. నేను వాళ్ళ దగ్గరనుంచి కదలి ఇంకోచోటకి వెళ్తుంటే,

"ఇతను మనవాడేనా? " అంటూ నా గురించి మెల్లగా చర్చించుకుంటున్నారు.

"ఎంతసేపూ, మనవాడు, మనది

"తోటివ్యక్తి మనవాడైతే అబ్బా! చాలా ఆప్యాయత ఉంది ఇక్కడ. కాని ఇతరచోట్ల నాకు కనిపించలేదు. ఆ దేశం, కాస్త ఈ దేశం చూశాను కాబట్టి ఆ తేడాలాంటిది నాకు కనిపించింది.

"ఈ దేశంలో ఉన్న ప్రజలు పైదేశం వెళ్ళి ఇతరుల సామాన్య జీవనసరళి గురించి చూస్తే వాళ్ళ ధోరణిలో మార్పు వస్తుందేమో.

"లంచగొండితనం, తోటి మానవునితో దురుసుతనం గురించి నేను వేరే చెప్పనక్కరలేదు. మొదట్లో నాకు బెదురు కలిగించింది ఈ ధోరణి, ఈ సంస్కృతి.

"హిందూదేశంలో సహనశక్తి తెగ ఎక్కువ అంటారు. అది సడలుతున్నా ఇంకా కనిపిస్తోంది" అని ఆపాడు సురేష్.

"దోశె ఫెంటాస్టిక్ అది తిను. ఈ క్వాలిటీ దోశె మీ ఊరిలో దొరక్కపోవచ్చు. దాని కోసం మళ్ళీ ఈ దేశం పరిగెత్తుకుంటూ వస్తావు" అంటూ మసాలాదోశె ముక్కతు రిమి నోటిలో ఉంచుకున్నాడు మాధవరావ్.

★ ★ ★

లేవగానే, ఆరోజు వాతావరణం ఎలా ఉంటుందో తెలుసుకోవడానికి టెలివిజన్ ఆన్ చేశాడు సురేష్. అమెరికా పశ్చిమ ప్రాంతంనుంచి తూర్పు ప్రాంతంవరకు వాతావరణం ఎలా ఉంటుందో వివరిస్తోంది ఒక స్త్రీ. 'న్యూయార్క్'లో పొద్దున్న మందంగా మంచు కురిశాక మధ్యాహ్నం సూర్యుడు కనిపిస్తాడు. గాలి వేగం గంటకి పన్నెండుమైళ్లు దరిదాపులలో ఉంటుంది. ఉష్ణోగ్రత పద్ధెమినిది డిగ్రీలు ఫారెన్‌హీట్. మంచి ఉన్ని దుస్తులు వేసుకుంటేగాని బైట కివెళ్ళకండి. రోడ్లమీద మంచు ఉంటుంది. కార్లు వేగంగా వెళ్ళవు కాబట్టి ఆఫీసుకి సరి అయిన కాలానికి చేరాలంటే మామూలు కన్నా ఒక పదిహేను నిమిషాలు ముందర బయలుదేరండి" అంది.

చలి! వెధవ చలి! మంచు! ఎడతెగని మంచు!

అబ్బ! ఇంకో వారంరోజులలో ఈ చలిప్రదేశంనుంచి విముక్తి, అనుకుంటూ బట్టలు వేసుకుని, వీధితలుపు మెల్లిగా తెరిచాడు సురేష్. రోడ్డుమీద మంచు కనిపించలేదు. తలుపువేసి రోడ్డుమీదకి వచ్చాడు. చలిగాలి ఒక్కసారి సురేష్ మొహాన్ని తాకగానే,

కోటుకి వున్న టోపీని సర్దుకుని నడక మొద లెట్టాడు. బర్న్ వీధిదాటి మెల్లిగా క్వీన్స్ బులావార్డ్‌మీదకి వచ్చి రెండడుగులు వేయ గానే పోస్టాఫీసు కనిపిస్తే లోపలికి ప్రవేశిం చాడు. గడియారం ఎనిమిది అవడానికి ఇంకా రెండు నిమిషాలుంది అని .చెబు తోంది.

వాచీ సరిగ్గా ఎనిమిది గంటలు చూపించ గానే కౌంటర్ తెరుచుకుంది.

"కెన్ ఐ హెల్ప్ యు? " అనడిగేడు కౌంటర్ వ్యక్తి.

"ఐదు ఏరో గ్రాములు"

డబ్బు, ఇచ్చి ఐదు ఏరోగ్రాములు అందు కుంటుంటే, "హేవ్ ఎ నైస్ డే" అన్నాడు కౌంటర్ వ్యక్తి.

"థాంక్‌యూ. సేమ్‌టుయూ" అంటూ బయటకి నడిచాడు.

ఇక్కడ మోసాలు ఉన్నా నిత్యావసరపను లకి సంఘర్షణ లేదు. జీవితగమనంలో ఒక క్రమం ఉంది. ఏ పని కావాలంటే, ఏపని చేయాలనిపిస్తే అది చేయడానికిక్కడ స్వతంత్రం ఉంది ప్రతివ్యక్తికీ. అభిలషించిన ప్పుడు మన విషయాలలో ఇతరుల జోక్యం అనవసరం. అనిపిస్తుంది. అదే మనం కోరుకుంటే దానితోపాటు మనమంటే ఇత రుల నిర్లిప్తతని భరించాలి. అని ఆలో చిస్తూ ఎదురుగా వస్తున్న వ్యక్తి కళ్ళలోనికి చూశాడు.

"గుడ్‌మార్నింగ్, హౌ ఆర్‌యు? హేవ్ ఎ నైస్‌డే" అంది ఆ కలకంఠి చిరునవ్వు చిందిస్తూ.

"థేంక్‌యూ, హేవ్ ఎ నైస్ డే" అంటూ ముందరకి నడిచాడు సురేష్.

ఇండియాలో ఐదునెలలు ఉండి వచ్చాక అమెరికాలో ఒకరి కళ్ళలోనికి ఇంకొకరు చూడరన్న సంగతి మరచిపోయినందుకు సిగ్గేసింది సురేష్‌కి.

ఆ కలకంఠి ఎంత సౌమ్యంగా పలకరిం చింది.

కాని సభ్యతకోసం ఆ యాంత్రిక పలక రింపు. నేతిబీరకాయలో నెయ్యిలా దానిలో ఆప్యాయత కొరవడింది. ఇండియాలో ప్రజాధోరణి వేరు. దురుసుతనం ప్రదర్శిం చినా, అక్కడ ఆప్యాయత... కొనూపిరితో ఉన్న ఆప్యాయత... కనబడుతుంది.

యూనియన్ టర్నిపైక్ మెట్రో స్టేషను లోంచి "టక్‌టక్, టక్ టక్" అంటూ ఎప్ప టిలాగే రైళ్లు వేగం పుంజుకుంటున్నాయి. నిర్ణీత సమయంలో, నిర్ణీతప్రదేశంలో బస్సులు రోడ్డుమీద ఆగి, ప్రయాణీకులని ఎక్కించుకుని వెళ్తున్నాయి.

బస్సులు కిక్కిరిసి లేవు, తొక్కులాటలేదు. అంటూ మెక్డోనాల్డ్ రెస్టారెంట్‌లోనికి జొర పడ్డాడు సురేష్.

"కెన్ ఐ హెల్ప్‌యు? "

"ఆనియన్ రింగ్స్, కాఫీ" అంటూ మైక్రో ఫోన్‌లోంచి "డాలర్ సెవెంటీఫైవ్" అంటూ డబ్బులు అందుకుంది. ఆనియన్‌రింగ్స్, కాఫీలు ఉన్న ట్రే అందుకుంటుంటే, "థాంక్‌యూ" అంది, ముట్టుకుంటే కందిపో యేలా ఉన్న ఆ అభిసారిక.

"యు ఆర్ వెల్‌కమ్" అంటూ ట్రేతో కిటికీ దగ్గర సర్దుకుని, బయటకి చూస్తూ ఆనియన్ రింగ్స్‌ని టొమోటో సాస్‌లో ముంచి నోటిలో ఉంచుకున్నాడు.

ఎప్పటిలా, కొవ్వుతో నిండిన ఆనియన్ రింగ్స్ నోటికి కమ్మగా తగిలేయి.

కల్నల్‌కుమార్ చమత్కరించినట్లు, "ఉల్లి పాయ పకోడీలు భలేగా ఉన్నాయి" అనుకు న్నాడు.

బయట సన్నగా మంచు కురవడం ఆరం భమైంది. పెద్ద పెద్ద ఓవర్‌కోట్లు వేసుకుని, మాడుమీద చిన్న టోపీలతో బవిరి గెడ్డా లతో పెద్దగా అంగలేసుకుంటూ యూదులు నడిచివెళ్తున్నారు. ఒక యూదుడికి పరిచ యమున్న ఇంకొకక యూదుడు కనిపించ గానే ఆగి, ఒకరి బుగ్గల్ని ఇంకొకరి బుగ్గలకి

ఆనిస్తున్నారు. కొత్త సంవత్సరం రావడానికి ఇంకా నాలుగు రోజులుంది.

ఒట్టి చేతులతో, నువ్వులని పిండి నూనె కార్పించగల దక్షత ఉన్న యూదుల దుకాణాల్లో, సరుకుల్ని అతిచవుకగా అమ్మేస్తున్నామన్న బోర్డులు కనిపిస్తున్నాయి. ఎక్కడ చూసినా కోలాహలమే. కుటుంబంలో సభ్యులు ఇతర కుటుంబసభ్యులకి, తమ తాహతులమేరకి కానుకలు కొంటారు ఈ సమయంలో.

ఒక్కసారి అంబులెన్స్ శబ్దం చేసుకుంటూ, సురేష్ కూర్చున్న రెస్టారెంట్‌కి రెండు వందల అడుగులదూరంలో ఉన్న ఒక నర్సింగ్ హోమ్ దగ్గర ఆగగానే, అంబులెన్స్‌లోంచి స్ట్రెచర్‌తో ఇద్దరు దిగి ఇంటిలోనికి పరిగెత్తేరు. వెన్వెంటనే, రగ్గులు చుట్టి ఉన్న ఒక వ్యక్తిని ఎక్కించుకుని అంబులెన్స్ హాస్పిటల్‌వేపు పరిగెత్తింది. అంబులెన్స్ రావడం రోగిని ఎక్కించుకుని వెళ్ళడానికి మహా అయితే రెండు నిమిషాలు పట్టింది.

"గుండెపోటు వచ్చింది కాబోలు" అనుకున్నాడు సురేష్.

బయట మంచు కురుస్తోంది.

తాగుతున్న కాఫీ అయిపోవడంతో కౌంటర్‌దగ్గరకి వెళ్ళి, మరొక కాఫీ తెచ్చుకుని తిరిగి పాతచోటకి చేరేడు సురేష్.

ఈ క్రిస్టమస్ పండుగ రోజుల్లో ఒంటరితనం కొంత మందిని, ముఖ్యంగా నర్సింగ్ హోమ్‌లలో నివసించే వయసు మళ్ళిన వాళ్ళని, ఒంటరిగా బతుకుతున్న వ్యక్తులని తెగ బాధపెడుతుంది.

నిన్న గురించి, రేపు గురించి పట్టించుకోని వ్యక్తుల తల్లితండ్రులు నర్సింగ్‌హోమ్‌లలో, రేపటికి ఎదురు చూడడానికి ఏమీ కనిపించక, విసుగేసి ఆత్మహత్యకి పాల్పడతారుట!

ఒంటరితనం!

క్రితం సంవత్సరంలా, ఈ సంవత్సరం ఒంటరితనం తనని ఇబ్బందిపెట్టడంలేదు. ఇండియా వెళ్ళి, కొంతమట్టుకు తెలుసుకున్నాక, ఇతర కుటుంబ సభ్యులని కలిసేక అలజడి తగ్గి, తనకి ఎవరూ లేరన్నది నిజం కాదని తెలియడంతో మనస్సు స్థిమితపడింది.

కాఫీ ఖాళీచేసి, గ్లాసుని చెత్తడబ్బాలోనికి తోసి, జేబులోంచి గ్లవ్స్‌తీసి తొడుగుకుని బయటకి వచ్చేడు.

ద్వారానికి ఇరవైఅడుగుల దూరంలో, ఇద్దరు వ్యక్తులు నడిచే బాటమీద డ్రైన్‌కన్నాలని మూసి ఉన్న ఇనుపచక్రం చిల్లుల లోంచి వస్తున్న వేడి నీటి ఆవిరితో చలి కాచుకుంటున్నారు. బయటకి వచ్చిన సురేష్ వాళ్ళని దాటి వెళ్ళబోతుంటే, ఆ ఇద్దరిలో ఒకతను సురేష్ దారికి అడ్డం పడుతూ, "ఒక క్వార్టర్ ఇవ్వగలవా? కాఫీ తాగుతాను" అనడిగేడు.

సురేష్ జేబులో చేయిపెట్టి క్వార్టర్ కోసం వెతికేడు. చిల్లర చేతికి తగలలేదు. చేతికి తగిలిన డాలర్ బిల్‌ని అతనికి అందిచ్చి ముందరకి కదిలివెళ్ళేడు.

డాలర్ బిల్ అందుకుంటూ "థాంక్‌యూ, థాంక్‌యూ, భగవంతుడు నిన్ను కాపాడుతాడు" అంటూ వడివడిగా రెస్టారెంట్ లోనికి దూరేడు అతడు.

ముష్టెత్తుకోవడం!

ఈదేశంలో చిన్నపిల్లలు అడుక్కోవడం తనకంటపడలేదు. ఇండియాలో చిన్నపిల్లలు అడుక్కోవడం చాలా ఎక్కువ!

జీవన యాత్రలో పోరాటంలేని ప్రదేశం లేదు. కాని అమెరికాలో ప్రతీ పరిస్థితులకీ విధి! ఖర్మ! అంటూ వాటికి బానిసకానవసరంలేదు. చదువు సరి అయినది ఉంటే, నచ్చనిచోటునుంచి, ఇంకొక చోటుకి మారిపోవచ్చు. నిజానికి అలా మారడంవలనే ఉద్యోగంలో పురోగమనం ఉందంటారు.

కాలు తొట్రుపడి, మంచుమీద జారిపో

బోయి తమాయించుకున్నాడు సురేష్.

ఇక్కడ పాకుడురాళ్ళమీద నడిచే ఫక్కీలో జీవితం గడిచినా, జారిపడినా, సర్దుకుని తిరిగినడిచే అవకాశాలు ఇంకా ఇక్కడ ఉన్నాయి, అనుకుంటూ తలుపు తెరచి ఇంటిలోనికి వచ్చేడు సురేష్. జోళ్ళు విప్పి, పడక గదిలో ఉన్న డ్రెస్ తీస్తుంటే, తండ్రి దాచిన ఆల్బం డబ్బా కనిపించగానే, దానిని అందుకుని హాలు.లో సోఫాలో కూర్చుని ఆల్బంలని తెరిచేడు.

క్రితం సంవత్సరం పరిచయంలేని మొహాలు, నవ్వుతూ పలకరించేయి.

ఆల్బంలో వెలితి సంధ్య ఆంటీ ఫొటో లేకపోవడమే! అనుకుంటూ ఆల్బం ముడిచి కళ్ళు మూసుకున్నాడు.

సంధ్య ఆంటీ తండ్రి రాసిన డైరీలు చదివిందా?

జరిగినది తెలుసుకున్నాక, ఆమె ఊహలో తండ్రి ఎదిగిఉంటాడా? లేక దిగజారి ఉంటాడా? అనుకుంటూ బరువుగా ఊపిరి వదిలేడు సురేష్.

ఆలోచనల్ని చెదరకొడుతూ టెలీఫోన్ మ్రోగింది.

రిసీవర్ ఎత్తి 'హలో' అన్నాడు సురేష్

"హలో సురేష్, నేను కేతరీన్ని"

"వాట్ ఎ సర్ప్రయిజ్, ఎలా ఉన్నావు?"

"నేను బాగానే ఉన్నాను. జనవరి రెండవ తారీకున నేను న్యూయార్క్ కాన్ఫరెన్స్ పని మీద వస్తున్నాను. మనం కలవగలమా? నీకేమీ ఇతర కార్యక్రమంలేకపోతే ఎయిర్ పోర్ట్కి రాగలవా? "

"జనవరి మూడవ తారీకున బయలుదేరి శాన్ఫ్రాన్సిస్కో వెళ్ళిపోతున్నాను. రెండవ తారీకున నిన్ను కలవడానికి ఏమీ అభ్యంతరంలేదు. నీ ఫ్లైట్ వివరాలు చెప్పు"

కేతరీన్ చెప్పినది కాగితంమీద రాసుకున్నాడు సురేష్.

"సరే, ఎయిర్పోర్ట్లో గేటు ప్రాంగణంలో నీకోసం నిరీక్షిస్తుంటాను"

మెల్లగా రిసీవర్ని హుక్ మీదుంచేడు సురేష్.

మూడేళ్ళతరువాత కేతరీన్ ఫోన్! ఆశ్చర్యం కాక ఇంకేముంది?

ఢిల్లీ ఎయిర్పోర్ట్లోనికి ప్రవేశించబోతూ, చిన్నాన్నతో కరచాలనం చేసినపుడు,

"తిరిగి కేతరీన్తో జీవితం పునఃప్రారంభించగలవేమో, ఆలోచించు" అన్న ఆఖరి వాక్యం గుర్తుకువచ్చింది.

మూడేళ్ళ తరువాత కేతరీన్ తనకి ఫోన్ చేయడంలో ఏదైనా ఆంతర్యం ఉందా?

ప్రత్యేకంగా, రామకృష్ణ దగ్గర ఇండియాలో తన టెలీఫోన్ నెంబరు సంపాదించి ఫోన్ చేయవలసినంత అవసరం ఏమొచ్చింది? తిరిగి కలుద్దామన్న ప్రయత్నమా?

తను ఏదేదో అర్థంలేకుండా ఊహిస్తున్నాడు!

కేతరీన్ తిరిగి పెళ్ళిచేసుకుందేమో! లేక ఎవరైనా బాయ్ఫ్రెండ్....!అవన్నీ ఆవలకి నెట్టి, కేతరీన్ తనతో చేతులు కలపడానికి తయారయితే ఏం చేయాలి? కేతరీన్ గురించి తెలిసిన తను, తిరిగి ఆ పాత దశకి వెళ్ళి మరొక తప్పు చేయలేడు. అది జరగని పని.

ఇండియా వెళ్ళకముందర, తను దేనికీ చెందకుండా ఉన్నప్పటి ఆ పరిస్థితివేరు. ఇప్పటి పరిస్థితి వేరు.

కేతరీన్ని ఎయిర్పోర్ట్లో కలిసి, అవసరమైతే డిన్నర్ కలిసి తిన్నాక, ఆమెని ఎక్కడ కావాలంటే అక్కడ వదిలేయడంతో ఆ కథ సమాప్తం అవుతుంది.

కేతరీన్ ఇంకేవిధమైన ఆసక్తి కనబరిచినా, ఆదిలోనే దానిని తుంచేయాలి, అనుకుంటూ ఫోటో ఆల్బంని తిరిగి అందుకున్నాడు సురేష్.

★

# చతుర కతలు

## అయస్కాంతతత్వం

నాలుగేళ్ళు కూడా నిండని జ్యోతిస్వరూప్‌ని ఇంట్లో అందరూ ముద్దుగా 'జ్యోతీ' అని పిలిచేవారు. దానికితోడు జ్యోతికి వాళ్ళ అమ్మ జడేసి పూలు పెట్టేది. అంతేకాకుండా జ్యోతికన్నా రెండేళ్ళే పెద్దదైన కూతురు స్వాతి తాలూకు గౌన్లనీ పరికిణీలనీ, జ్యోతికి కూడా తొడిగేది. ఎంతైనా మగపిల్లవాడవడంతో జ్యోతికి చురుకు పాలెక్కువ. అల్లరి కూడా విపరీతంగా చేసేవాడు. అక్కతో కలిపి జ్యోతిని బడికి పంపితే గిల్లి కజ్జాలు తెచ్చేవాడు. జ్యోతి చేసే అల్లరిని భరించలేక టీచర్లు మరో ఏడాదిపాటు జ్యోతి చదువుని వాయిదా వెయ్యమన్నారు.




ఇలా వుండగా జ్యోతి వాళ్ళింటిపక్క వాటాలో ఎవరో అద్దెకి దిగారు. ఆ వాటాలో దిగిన వాళ్ళకి జ్యోతి ఈడులోనున్న ఒక కుర్రాడున్నాడు. వాడు పాంటూ-షర్టులో అందంగా కనిపించాడు జ్యోతికి. ఇహనేం?! వాడితో మాటలు కలిపాడు జ్యోతి.

ముందుగా "ఒరే! నీ పేరేంట్రా?" అనడిగాడు జ్యోతి.

"నాపేరు మాధవ" చెప్పాడాకుర్రాడు.

"నాపేరు జ్యోతిస్వరూప్! నేను రాయిని సూటిగా ఆ చెట్టుమీదున్న కొబ్బరి కాయకేసి కొట్టగల్ను తెలుసా! బాణాలెయ్యగల్ను. క్రికెట్టాడగల్ను. ఇవేమైనా నీకొచ్చా?" అడిగాడు జ్యోతి.

"ఛీ! అవన్నీ మగపిల్లలాటలు. నువ్వాడుతున్నావా?" అన్నాడు మాధవ.

"ఒరేయ్! నేనాడపిల్లని కాన్రా! నీలాగే నేనూ మగాడ్ని'' అన్నాడు గర్వంగా జ్యోతి.

"ఆడపిల్లవి కాకపోతే మరా జడేంటి? గౌనేంటి?'' అంటూ ఎకసక్కెంచేశాడు మాధవ.

ఆ మాటలకి జ్యోతి ఉక్రోషం పట్టలేకపోయాడు. ఫెడీల్‌మని మాధవకో లెంపకాయ ఇచ్చి, ఇంట్లోకి దూరి మంచంకింద నక్కి ఏడుపు లంకించుకున్నాడు.

"అమ్మా జ్యోతి నన్ను కొట్టిందే!" అంటూ మాధవ రాగంతీశాడు.

వచ్చిన మొదటిరోజే గొడవపడ్డం

ఇష్టంలేక మాధవని చెవి పట్టుకుని లోపలికి లాక్కెళ్ళింది వాళ్ళ అమ్మ.

"ఏరా? ఆ అబ్బాయినలా కొట్టొచ్చా?" అని జ్యోతిని గదమాయించింది వాళ్ళ అమ్మ.

"మరాఅబ్బాయి నన్ను అమ్మాయి అనొచ్చేంటీ. నాకీ జడ కత్తిరించెయ్యి. నేను గౌన్లేసుకోను. ఆ అబ్బాయిలా చక్కగా పాంట్లూ- షర్టులూ వేసుకుంటా!" అంటూ మంచంకిందనించి బైటకి రాకుండా జ్యోతి గొణగసాగాడు.

"అలాగేలేరా! తిరపతిలో నిన్ను మగపిల్లాడ్ని చేస్తాన్లేరా!" అంటూ ఎలాగో జ్యోతిని సముదాయించింది వాళ్ళ అమ్మ.

ఈ సంఘటన జరిగిన సాయంత్రం మాధవ పిలక జడేసుకుని జ్యోతికి కనిపించాడు. జడ, గౌనులోనున్న మాధవను చూడగానే జ్యోతిలో వెర్రి ఆవేశం పొంగింది. సినీయాక్టరు ప్రభులా నేలపై గిరికీలు కొట్టాడు. పిల్లిమొగ్గలేశాడు. స్టెప్పులు వేస్తూ 'ముకాబలా' అనే పాట పాడుతూ డ్యాన్సు చెయ్యసాగాడు.

'ఏంట్రా? ఆ వెధవ డ్యాన్సు? ఆ అబ్బాయి నీలా పిల్లిమొగ్గలేస్తున్నాడా? బట్టలు పాడుచేసుకుంటున్నాడా?" అంటూ జ్యోతిని వాళ్ళ అమ్మ కేకలేసింది.

"అమ్మా! వాడమ్మాయే! అబ్బాయికాడు. నాకు తెలిసిపోయింది'' అంటూ జ్యోతి మరింత ఎక్కువగా డ్యాన్సు చెయ్యసాగాడు.

"ఛ! వెధవా? ఆ అబ్బాయిని పట్టుకుని అమ్మాయంటావేమిట్రా?" అంటూ జ్యోతిని కేకలెట్టింది వాళ్ళమ్మ.

"నాకు తెలుసును. వాడమ్మాయే! ఏరా నువ్వు అమ్మాయివి కదూ?" అనడిగాడు జ్యోతి మాధవని.

"హారి! భడవా!! నువ్వెలా కనిపెట్టావురా?" అంటూ మాధవ తల్లి ముక్కుపై వేలేసుకుంది. ఆ తర్వాత ఆవిడ మెల్లగా జ్యోతి తల్లితో చెప్పింది. "అవునమ్మా! మా అమ్మాయి పేరు మాధవి. ముద్దుగా ''మాధవా'' అని పిలుస్తాం. మావారికి మగపిల్లలంటే ఇష్టం. అందుకే మా అమ్మాయికి పాంట్లూ షర్టులూ తొడుగుతాం. మావారు కావాలనే క్రాపింగ్ చేయించారు. ఇవాళ మీ జ్యోతిని చూడగానే తనకీ జడవెయ్యమని మారాం చేసింది. ఎలాగో తంటాలుపడి రెండు పిలకలల్లాను'' అని.

మాధవి తల్లి మాటలకి సిగ్గుతో ఇంట్లోకి తుర్రుమంది. ఆ అమ్మాయి వెనకనే జ్యోతి 'ముకాబలా' పాట పాడుతూ పరిగెత్తాడు.

-పెయ్యేటి శైలజ

## సీక్రెట్

ఈమధ్య ప్రతీ అల్లాటప్పాగాడికీ సన్మానమే! అభాజనులకి, భజ్రాజమానాలకి సత్కారమంటూ మెడలో పూలదండవేసి, మొహాన బొట్టెట్టి గంగిరెద్దులా చేసాక ఓ ఫొటో తీసి వార్తలకెక్కిస్తున్నారు. తీరా చూస్తే ఆ శాల్తీకి ఏ ప్రత్యేకతా వుండదు. మరెందుకీ ఆర్భాటం.

ఇదే అభిప్రాయం చిన్నారావులో పాతుకుపోయింది. సరిగ్గా అప్పుడే చిన్నారావును వెతుక్కుంటూ "ప్రతిభకు పట్టాభిషేకం సంఘం" వాళ్ళు విచ్చేసారు.

చిన్నారావు నల్గురినోట్లో నానే మనిషంటే దేశప్రధానో, కుంభకోణంలో యిరుక్కున్న మంత్రో కాదు... తెలుగు కథారచయిత.

వచ్చిన ప్ర.ప.సం వారు చిన్నారావును సత్కరిద్దామని ఉత్సాహంగా వున్నారు.

చిన్నారావు సున్నితంగా తిరస్కరించబోయాడు. అయితే అతని భార్య మోహిని లోపలికి పిలిచి నాలుగు చీవాట్లేసేసరికి మెత్తబడిపోయాడు.




సంఘం వాళ్ళు అతన్ని ఏ రోజున సన్మానిస్తున్నదీ తెలిపి వెళ్ళిపోయారు.

పది రోజులు గడిచాయి.

ఆరోజు చిన్నారావు సన్మానం.

సభ ప్రాంగణంలోకి అడుగుపెట్టేసరికి కళ్ళు గిరగిర తిరిగాయి. అది తిరునాళ్ళా! మెగాస్టార్ చిరంజీవి సినిమాకి వచ్చిన జనాలా!

కాదు తన కోసమేనని తెలిసేసరికి గుండె అదిరిపోయింది. అంతమందిలో మాట్లాడాలంటే యమభయమేసింది.

పెద్దపెద్ద రచయితలంతా హాజరైనారు.

వేదికమీద ఓ వృద్ధపండితుడితోపాటు పాపులర్ రైటర్ నవ్యారావు కూడా వున్నాడు.

సభ ప్రారంభమైంది.

"ఈరోజు చిన్నారావును సన్మానించటం మన అదృష్టం. ప్రతి రచయిత పెద్ద కథల వైపు, సీరియల్స్‌వైపు మొగ్గుచూపిస్తున్నారు. కేబుల్ టి.వి. యుగంలో అంత పెద్ద కథలు చదివేతీరికెక్కడ! అటువంటి తరుణంలో మన చిన్నారావుగారు సామాజిక స్పృహతో, వ్యంగ్యంతో, హాస్యంతో, రకరకాల కొసమెరుపులతో అతిచిన్న కథలకు ఊపిరిపోసారు'' అని చెప్పాడు వృద్ధ పండితుడు.

నవలా రచయిత నవ్యారావు "నేను కలం కదిపితే పాతిక పేజీలకి తక్కువ రాయను. నాకు చిన్నారావుగారిలా చిన్ని కథలు రాయటం రాదని ఈ సభాముఖంగా ఒప్పుకుంటున్నాను. అయితే ఆయన ట్రేడ్‌సిక్రెట్ ఏమిటో నాకు అర్థంకావటంలేదు. ఆయన అదేదో నాకు సెలవిస్తే సంతోషిస్తాను'' అని నవ్వుతూ ప్రసంగించాడు.

సంఘ కార్యదర్శి లేచి చిన్నారావుకి తాము చిన్న కథల చిన్నారావు బిరుదును ప్రసాదించినట్లు తెలిపాడు. తదుపరి ఘనంగా సత్కరించారు.

చివరిగా చిన్నారావు ప్రసంగం.

"స్త్రీ ప్రసవ వేదన నాకు తెలీదు. ఎండలో రాళ్ళు కొట్టేవాడి కష్టం నేనెరగను. కానీ ఈ చిన్న కథ వుందే అంతకంటే కష్టమైన ప్రక్రియ అని నా ఉద్దేశ్యం. ఎంత గొప్ప విషయాన్నైనా మూడు పేజీలకు మించకుండా ముగించటమే మహా చిక్కు. పేజీలు పెంచటం సులువు కాని క్లుప్తత కష్టాతి కష్టం. కానీ దాన్ని సాధించటంలోనే నాకు సంతృప్తి ఆనందమూను''

హర్షధ్వానాలు మిన్నుముట్టాయి.

ఇంటికి చేరాడు. విషయాలన్నీ పూసగుచ్చినట్లుగా వివరించాడు చిన్నారావు.

"ఇంతకీ ఆ ట్రేడ్‌సీక్రెటేమిటో నాకైనా..." ఉత్సుకతగా అడిగింది భార్య మోహిని.

"నన్ను గొప్పగా వూహించుకుంటున్న జనాన్ని ఆకట్టుకోడానికి, నేనూ నాలుగు గప్పాలు కొట్టాను. నిజానికి రాయటానికి

నేను పురుటినొప్పులు పడ్డంలేదు. మూడు పేజీలు మించి నా కలం ముందుకు నడవదు. అందుకే అక్కడితో చేతులు ముడిచేస్తాను. పెద్ద కథలు రాయలేనన్న విషయం నేనెందుకు బయటపడాలి..." అనేసి చిద్విలాసంగా నవ్వాడు 'చిన్నకథల చిన్నారావు'.

-కె.కె.రఘునందన

## టిట్ ఫర్ టాట్

పెంటయ్య హాలులోకి వచ్చేసరికే వేలంపాట పూర్తయింది. తన ప్రత్యర్థి రాజారామ్ ఆ పాట తనే దక్కించుకొన్నట్లు విజయగర్వంతో పెంటయ్యకేసి చూసి మీసం మెలేశాడు.

మొత్తం అయిదు లక్షల కాంట్రాక్టు. తనే




కొట్టేశాడన్న మాట. దిగాలుగా కుర్చీలో కూర్చుండిపోయాడు పెంటయ్య.

డైరక్టర్ 'విశ్వం' తన సిన్మాలో పాటల క్యాసెట్టును రిలీజ్ చేయటానికి ఆసక్తిదారులైన కాంట్రాక్టర్లని కోరాడు. విశ్వం అంటే సినీ ప్రపంచంలో పెద్దపేరు. ఆయన సిన్మాలోని పాటలన్నీ సూపర్‌హిట్ అవుతాయని ప్రతి ఒక్కరి నమ్మకం.

రాజారామ్, పెంటయ్యి ఇద్దరూ పాటల క్యాసెట్ల ప్రపంచంలో ఇద్దరు ఒకరికొకరు తీసిపోని పోటీదారులు. పెంటయ్య పల్లెటూరి నుంచి వచ్చిన వాడు, పైగా నిరక్ష్యరాస్యుడు కావడంతో, రాజారామ్‌తో పోటీపడలేక పోతున్నాడు ప్రతి విషయంలో. తనని వేలం పాటకి రాకుండా ఓ మాస్టర్ ప్లాన్ వేశాడు. అందుకే టైమ్‌కి రాలేకపోయాడు.

మళ్ళీ దెబ్బకి దెబ్బతీసి రాజారామ్ విడుదల చేసే పాటల క్యాసెట్లకంటే ఎక్కువ మొత్తంలో పాటల క్యాసెట్లు అమ్మాలి!

మెరుపులా ఓ ఆలోచన తట్టింది.

వెంటనే పి.ఏని పిల్చి 'విశ్వం' గారి సిన్మా పాటల బాణీలు, సాహిత్యం వెంటనే సేకరించమన్నాడు. ఆ పని క్షణాల్లో జరిగింది.

ఆ బాణీలను, సాహిత్యాన్ని ఓ సిన్మా కవి దగ్గరకు తీసుకువెళ్ళాడు. ఆ కవి ఒకప్పుడు ప్రేక్షకులను వూపేశాడు.

కవిగారిచేత ఆ పాటల సాహిత్యానికి, బాణీల కనుగుణంగా భక్తిపాటలు రాయించాడు. వెంటనే రికార్డింగ్ థియేటర్‌కు వెళ్ళి బి. క్లాస్ గాయకులచేత అదే బాణీలో భక్తిపాటలు పాడించాడు.

"షేక్... అబ్బా... షేక్' అనే పాటల స్థానంలో అదే బాణీలో "అదిరింది మాతా... అబ్బా... అదిరింది నీ దీవెన" అనే పాటలు ఆంధ్రదేశం జనాల చెవుల్లో మారుమోగాయి.

ఈ దెబ్బతో రాజారామ్ క్యాసెట్లు మూలబడ్డాయి.

-డా.కె. శివసుబ్బారావు

# 'నిరాకరణ' పై సమీక్షలు

జనవరి 'చతుర'లో ప్రచురితమైన ఎస్.ఎల్.భైరప్ప నవల 'నిరాకరణ'పై మాకందిన ఉత్తమ సమీక్షలు.

## పలాయనం పరిష్కారంకాదు!

*(ప్రథమ బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)*

ఒంటరితనంతో పెరిగిన నరహరి వైరాగ్యం తన ప్రవృత్తి అనుకున్నాడు. కన్నపిల్లల్ని పెంచే బాధ్యతను నిరాకరించాడు. సన్యాసంతో తంటాలుపడి తట్టుకోలేక అనాథాశ్రమంలో నౌకరీకి కుదిరాడు. చివరకు కన్నపిల్లలే ఎదిగి ఎదురైతే బెంబేలుపడిపోయాడు. ఆధ్యాత్మిక వాదపు మిథ్యను యిది బయటపెడుతుంది. కాని బారామాసీమహరాజ్ మొదలు గంగానందుడి వరకు సాధకుల్నీ, హరిద్వార్ హృషీకేశ్‌లనుండి హిమాలయాల, మందాకిని వరకు పర్యటనల్నీ, ఏకబిగిని నవలలో నాలుగోవంతు వర్ణించడంవల్ల నరహరి వైఫల్యం వ్యక్తిగత బలహీనతే అనుకోవడానికి ఆస్కారం కల్పించారు.

తల్లిదండ్రులకూ సంతానానికీ, సంరక్షకులకు పిల్లలకూ మధ్య సంబంధాలు కూడా ఆర్థిక సంబంధాలే అనే నేటి సమాజ వాస్తవాన్ని ఈ భాగం కొట్టవచ్చినట్టు బయటపెట్టింది. అంతేగాక నిష్కామ కర్మ సిద్ధాంతానికీ మానవతా విలువలకీ పెద్దపీటవేసి ఆధ్యాత్మికతను తిరిగి ఆధునిక రూపంలో నిలబెట్టారు. ప్రగతి అంతా వయ్యక్తికమైనదనే వూహల్లో వూగులాడే మధ్యతరగతి మనస్తత్వానికి ఇది వూరటనిస్తుంది.

కాని బాధ్యతారాహిత్యానికీ పలాయనానికీ తండ్రి తగిలించుకున్న బంధవిముక్తి ముసుగుని భవాని చివరి భాగంలో ఒక్క దెబ్బతో చించిపారేసింది. తండ్రే చనిపోయి, తల్లో పినతల్లో బతికి వుంటే తమ రెక్కల కష్టంతో తాము బతికే వాళ్లమనే సవాలుతో నరహరికి చెంపపెట్టు పెట్టడమేకాక వారసత్వపు వ్యక్తి ఆస్తికీ అది సృష్టించిన దౌష్ట్యానికీ ఒక వార్నింగ్ యిచ్చింది. 120 పేజీల ఆధ్యాత్మిక చింతననీ గాలికెగరగొట్టేసింది. అదీ అసలు కథ. కాని నవల శైలి దానిని గడ్డివాము కింద గాజుపూసను చేసింది. చక్కగా రాసిన నవల తలకిందులయింది. రేళే, భవాని, శెనాయి నిజంగా జీవమున్న పాత్రలు. వాటిని సజీవంగా సహజంగా చిత్రించడం నవలకు చాలా మేలు చేసింది. అనువాదం ఎంతో సరళంగా చక్కగావుంది.

**-విజయసారథి,**
మద్రాసు-83

## పరిపూర్ణ రచన

*(ద్వితీయ బహుమతి రూ. 75/- పొందిన సమీక్ష)*

'నిరాకరణ' ఆసక్తిగా చదివించేదిలా ఉంది. నరహరి సన్యాసిగా మారి భవబంధాలను పూర్తిగా త్యజించలేక తిరిగి అనాథాశ్రమంలో ఉద్యోగంలో చేరి, చివరికి కూతురు భవాని, కొడుకు రాములతో కలసి జీవించాలని

నిర్ణయం తీసుకోవడంతో నవలకు పరిపూర్ణత వచ్చింది.

తండ్రి తమను దత్తు ఇవ్వబోతున్నాడని తెలిసి పసిమనసులు పడే ఆవేదనను వర్ణించిన తీరు కరడుగట్టిన హృదయాలను సైతం కదిలింపచేసేదిలా ఉంది.

నవలలో నరహరి మనసులోని సన్యాసికి, మామూలు మనిషికి మధ్య సంఘర్షణను రచయిత సమర్ధవంతంగా విశ్లేషించారు. కొడుకు లక్ష్మణుడు బతికి ఉన్నాడా లేదా అనే విషయం తెలియక పోవడం ఒక విషాదఘట్టం. భవాని తన కాళ్లమీద తాను జీవన పోరాటానికి సిద్ధపడటం, తండ్రిని నిలదీయడం హర్షణీయం. గణేశ్ వ్యాపారంలో స్థిరపడటం, విజయ్ బెంగాలీ దంపతుల ప్రీతిపాత్రుడు కావటం మాత్రం కొంత ఊరట నిస్తుంది.

నవలలో ఉత్తరదేశం, హిమాలయాలగూర్చి కాస్త పరిచయం చేశారు. ముఖ్యంగా హిమాలయాలను గురించి ఈ శీతాకాలంలో చదవడం పాఠకులకు ఒకవిధంగా అక్కడే ఉన్న భావననిచ్చింది.

భైరప్పగారు ఈ నవలలో అటు దత్తత ఇచ్చేవారి మనసును, ఇటు పిల్లల బాధను కొంత వివరించి, ఆ పసిమనసుల ఆవేదనను పరిపూర్ణంగా వర్ణించడంలో తన సమర్ధతను చూపారు. అనువాదకుల శైలికూడా చదివించేదిలా ఉంది.

-ఎం.ప్రతిభశర్మ
వెంకటాపురం-506 331

## కత్తిపోటు

*(తృతీయ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

విధివశాత్తు కన్నతల్లిని కోల్పోయిన ఐదుగురు చిన్నారులకు... తిరిగి మాతృవాత్సల్యాన్ని అందించాలన్న ఆలోచన, తపనల, దత్తతలపర్వంతో... జీవచ్ఛవమై 'తండ్రి'గా తన ఉనికిని సైతం చేజేతులా పోగొట్టుకొన్న సగటు మనిషి నరహరి... గాథను ఆద్యంతం శ్రద్ధగా చదివేలా చేయగలిగారు 'నిరాకరణ' రచయిత భైరప్ప.

ఏకాంతంలో ఈశ్వరధ్యానంలో పునీతుడు కావాలనుకొని ఆరాటపడి, కష్టనష్టాలకోర్చి హిమాచ్ఛాదిత గిరిశిఖరాలను తన శక్తికి మించి అధిరోహించిన 'నరహరి ఎలియాస్ నిస్సంగానందస్వామి' అదే పట్టుదల, దీక్షా దక్షతలతో 'గీత'లోని కర్మసన్యాసయోగం, ఉద్బోధలకనుగుణంగా, తన పిల్లలను అన్నీ తానై తీర్చిదిద్ది పైకి తీసుకురావటానికి ప్రయత్నించకపోవటం శోచనీయం.

యిదిలా ఉంటే... చెరువుగట్టున తన తల్లి బట్టలుతికే సీను తీరును, ఆమె ప్రతిబింబంను... సదరు నరహరి పాత్ర, భార్య లలిత, రెండో భార్య వైదేహి, కాశీలో మరో వేశ్య...ల విషయంలో ఆయాసందర్భాల్లో పలుమార్లు, ఫ్లాష్‌బ్లాక్‌గా గుర్తుకుతెచ్చుకొని అదోవిధంగా ఆలోచించటం... వెరసి ఈ తంతంగాన్ని రచయిత అనుచితంగా చిత్రీకరించారు.

నవల క్లయిమాక్స్‌లో "నాన్నా మా తల్లేగనుక బతికుంటే... యిలా మమ్మల్ని దత్తతలకిచ్చేదా?" అంటూ నరహరిని నిలదీసిన భవాని ప్రశ్న... సమాజంలోని నరహరిలాంటి అతి తెలివిపరులకు కత్తిపోటులాంటిది.

సంసారం మేలా? సన్యాసం గొప్పా? అంటూ నర్మగర్భంగా పాఠకులను ప్రశ్నిస్తూ ఆలోచనల్లోకి దింపటంలో రచయిత కృతకృత్యుడయ్యాడు.

- ఎం. లక్ష్మి
కరంజి -504 312.

## సన్యాసంకాదుపలాయనం

*(నాలుగవ బహుమతి రు: 50/- పొందిన సమీక్ష)*

జనవరి నెల భైరప్పగారి నవల "నిరాక

రణ" చాలా బావుంది. నరహరి పాత్ర స్వార్థపరుడైన తండ్రికి ప్రతీకగా వుంది. నిజమైన సన్యాసి కావాలనుకుంటే అసలు వివాహబంధంలోనే చిక్కుకోకూడదు. కానీ వివాహం చేసుకుని ముగ్గురు పిల్లలకు తండ్రి అయ్యి భార్య గతిస్తే మళ్ళీ తప్పనిసరి పరిస్థితుల్లో వివాహం చేసుకుని చివరకు ఐదుగురు పిల్లల తండ్రి అయ్యాడు. రెండో భార్య కూడా మరణిస్తే పిల్లలు అనాథలుగా మిగలవలసినదేనా? చిన్నపిల్ల భవానికున్న ఓర్పుకాని, ఆలోచన కాని అతనికి లేకపో యాయి. చివరలో భవాని తండ్రిని నిలదీసి అడగటం అతను ఊహించలేనిది. అదే తల్లి అయితే కష్టపడటానికి ఇష్టపడక పిల్లలని అలా గాలికి వదిలేస్తుందా? కనీసం కూలీ పనిచేసి అయినా పెంచుతుంది. కలో గంజో కలిసి తాగుతారు. కలిసి జీవిస్తారు. చూస్తూ చూస్తూ చేజేతులా ఏ స్త్రీ కూడా తన పిల్లలని అనాథలుగా చేయదు. కానీ నరహరి మాత్రం కేవలం సన్యాసం పేరుతో పిల్లలను తండ్రి వుండి కూడా లేని అనాథలని చేశాడు? వేదాంతధోరణి వుండవచ్చు. కాని బాధ్యతారాహిత్యం కూడదు. సన్యాసం అంటే కర్తవ్యంనుంచి పారిపోవటం కాకూడదు. పిల్లలందరినీ తలా ఒకరికి ఇచ్చేసి తను మాత్రం హిమాలయాలకు వెళ్ళిపోతే ఊహ తెలిసిన పిల్లలమీద ఈ మార్పు ఏవిధంగా వుంటుంది? దత్తత తీసుకున్నవాళ్లు బాగా చూసుకుంటేసరి లేకపోతే లక్ష్మణుడి గతి పడుతుందికదా! ఆ పసిమనసులు ఈ మార్పుకి తట్టుకోగలరా? దీనికి కారణం నరహరి పిరికితనం, కర్తవ్య విముఖత కాదా?

చివరకు తిరిగివచ్చి అనాధాశ్రమానికి వార్డెనుగా వుండదలచటం పాపపరిహారమా? లేక కీర్తికండూతా?

ఏదిఏమయినా భైరప్పగారు చాలా సూటిగా ఇటువంటి తండ్రులకు వాతలు పెట్టారు.

-ఇందిర యస్.
సికింద్రాబాద్.

# పారమార్థిక నిరాకరణ

*(అయిదవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

**ఋ**ణానుబంధ రూపేణ పశుపత్ని సుతాలయా అన్న ఆర్యోక్తికి కథారూపమే భైరప్పగారి నవల "నిరాకరణ". కథాగమనంలో శాఖాసంక్రమణ న్యాయం గోచరించినప్పటికీ, ఆరంభాంతములమధ్య వారధి ఏర్పడుతుంది. భవబంధవిముక్తికై నరహరి పడిన మానసిక సంఘర్షణ, ఆత్మఘోష, ఇంద్రియ నిగ్రహంపై అతని అంతరంగమధనం బిగిసడలనీయకుండా పాఠకుని ముందుకు నడిపిస్తాయి. కథాంతంలో తిరిగి కుటుంబ బాధ్యతలను స్వీకరించిన నరహరిరావు మానవులలో విడదీయరాని ప్రాపంచిక చింతనలకు, భవబంధాలకు ప్రతీకగా నిలుస్తాడు. కాని వేదాంతధోరణికలవారు కర్తవ్యపాలన నుండి పలాయన మంత్రం పఠించడానికి భగవంతుని ఆశ్రయించడం నిస్సందేహంగా ఆక్షేపణీయమే. చతుర్విధ పురుషార్థములలో కూడా గృహస్థాశ్రమం తరువాతనే వానప్రస్థం క్రమబద్ధం చేయబడినది. హిమవత్పర్వత వర్ణన, తీర్థయాత్రా విశేషాలు భైరప్పగారి స్వీయానుభవములై ఉండునన్న భావన కల్గును. కానీ ప్రాపంచిక, పారమార్థిక ద్వైదీభావాలలో నిజంగా సామాన్య మానవుని ఆఖరి మజిలీ చార్వాకుడు ప్రవచించిన ఐహికపాలన, పారమార్థిక నిరాకరణే నంటారా?

-బి. ఉషాదేవి,
హిందూపూర్ -515 201.

# FORM IV (See Rule 8)

Statement about ownership and other particulars of CHATURA.

| | | |
|---|---|---|
| 1. Place of Publication | : | 6–3–570, Eenadu Compound, Somajiguda, Hyderabad–500 082. |
| 2. Periodicity of its Publication | : | Monthly |
| 3. Printer's Name | : | **RAMOJI RAO** |
| Whether citizen of India | : | Yes |
| If foreigner, state the country of origin | : | – |
| Address | : | 6–3–570, Eenadu Compound, Somajiguda, Hyderabad–500 082. |
| 4. Publisher's Name | : | **RAMOJI RAO** |
| Whether citizen of India | : | Yes |
| If foreigner, state the country of origin | : | – |
| Address | : | 6–3–570, Eenadu Compound, Somajiguda, Hyderabad–500 082. |
| 5. Editor's Name | : | **RAMOJI RAO** |
| Whether citizen of India | : | Yes |
| If foreigner, state the country of origin | : | – |
| Address | : | 6–3–570, Eenadu Compound, Somajiguda, Hyderabad–500 082. |
| 6. Name and address of individuals who own the newspaper and partners or shareholders holding more than one percent of the total capital. | : | **VASUNDHARA PUBLICATIONS** 6–3–570, Eenadu Compound, Somajiguda, Hyderabad–500 082. |

**I, RAMOJI RAO,** hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

**for VASUNDHARA PUBLICATIONS**
**Sd/– RAMOJI RAO**
Publisher

Date: March 1, 1997

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 290328. Office Address: CHATURA Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel: Hyderabad 318181, 399444; Madras 8270434, 8251044; Vijayawada 476685; Visakhapatnam 552211; Tirupati 75291; Anantapur 33777; Rajahmundry 79170; Karimnagar 83216; Suryapet: 21146; Guntur: 353942.

CHATURA Telugu Monthly Hyderabad 500 482 Regd. No. H/HD/402